# చతుర

సంపుటి : 5
సంచిక : 7

ఆగస్ట్ 1982

## ఈ నెల సమగ్ర నవల

సమాజంలో సమున్నత స్థానంలో గౌరవనీయ స్థితిలో బతకాలని ఆరాటపడిందామె. వివాహం కోసం, బిడ్డల కోసం తపించిపోయిందామె. కాలేజీ చదువు పూర్తిగాక ముందే బజార్న పడవలసివచ్చినా అందుకు సిద్ధపడిందామె. అయినా ఫలందక్కక, బాసలుచేసిన ప్రియతముడు అంతులేని విధంగా అంతర్ధానమైపోతే చివరికి ఏం చేసిందామె? చివరికి భర్త అంటూ ఒకరు దొరికి సంసారపు సరదా తీరినా అతన్ని తన భర్తగా బహిరంగంగా చెప్పుకోలేని పరిస్థితి ఆమెకెలా దాపురించింది? కలలుకన్న విధంగా బిడ్డ పుడితే, ఆ బిడ్డకు తండ్రి ఎవరో తనకే తెలియని దుస్థితి ఏమిటి? చివరికి తెలిసి, తెలిసి కూడా...

# ఉరి

తాడుకు తన జీవితాన్నప్పగించటానికి ఆమెను సిద్ధపడేలా చేసిన పరిణామాలేమిటి?

### కప్పగంతుల మల్లికార్జునరావు

సామాజిక న్యాయాన్ని చర్చించే ప్రయత్నంలో రూపొందించిన తాజా నవల 'ఉరి' ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖచిత్రం : యతీంద్ర

రెండవ కవరు } సూరజ్, ఎన్. శర్మ
మూడవ కవరు }

నవల బొమ్మలు : శ్రీధర్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్రతాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యాన్నిచ్చే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

## 'బ్రేవ్'

'వివాహభోజనంబు వింతైన వంటకంబు......అహ్హహ్హ నాకె ముందు...' అనుకుంటూ పెట్టిందంతా తినేసి 'ఇంకా పట్రా...ఇంకా పట్రా' అని ఎవరైనా అని ఇంటిల్లిపాదికీ వండిన వంటను ఒక్కడే ఖాళీ చేస్తే అతన్ని బకాసురుడనో, ఘటోత్కచుడనో తిట్టుకోవడం, ఎంత రేషనూ, ఎంత తిండీ వీడికి సరిపోవడంలేదనుకోవడం పరిపాటి.

నిజానికి అది పాపం వాళ్ళ తప్పుకాదు, వాళ్ళ శరీరంలోని హార్మోన్ల తప్పంటున్నారు శాస్త్రవేత్తలు. మనిషి మెదడు 'ఎన్‌కెఫాలిన్', 'ఎండ్రోఫిన్' అనే రెండు హార్మోన్లను ఉత్పత్తి చేస్తుంది. ఇవి శరీరం చేసే పన్లను అదుపులో వుంచుతాయి. ఆహారం తింటున్నపుడు ప్రేవుల చుట్టూవున్న నరాల కొసలు కడుపునిండగానే 'ఇంక చాలు' అన్న వార్తను మెదడుకి తెలియజేస్తాయి. ఈ వార్త అందీ అందగానే మెదడు 'ఎన్‌కెఫాలిన్ హార్మోన్ను' విడుదల చేస్తుంది. నిద్ర మత్తు లక్షణాలున్న ఈ హార్మోను రక్తంతో కలిసి శరీరంలో కలవగానే 'హమ్మయ్య! ఇంకచాలు' అన్న సంతృప్తి కలిగి 'బ్రేవ్' వచ్చేసి ఎవరైనా దిండు, దుప్పటి ఇస్తే చాలు నడుం వాల్చేద్దాం అనిపిస్తుంది. ఆలస్యంగా అన్నం తిన్నా, కడుపుని చాలా సేపు ఖాళీ వుంచి తిన్నా,





తిండిలేకుండా బాగా పనిచేసి అలసి చివరికి భోంచేసినా, పెళ్ళిళ్లో, విందుల్లో కాస్త ఎక్కువగా తిన్నా తిన్న వెంటనే నిద్ర ముంచుకు రావడానికి ఆ సమయంలో 'ఎన్ కెఫాలిన్' ఎక్కువగా ఉత్పత్తి అవడమే కారణం.

తర్వాత బాగా తాగుడు అలవాటయిన వ్యక్తి మామూలుగా ఓ పెగ్గు పుచ్చుకుంటే దాని ప్రభావం అతని మీద చాలా తక్కువమోతాదులో వుంటుంది. అలాగే భారీశరీరం వున్నవాళ్లు ఎన్ కెఫాలిన్ హార్మోన్ వుత్పత్తి ఏమాత్రం తక్కువున్నా అది శరీరానికంతా పనిచేసే టప్పటికి 'డైల్యూట్' అయి కొంత, విడుదలైన హార్మోనులు శరీరపరిమాణానికి సరిపోక కొంత పనిచేయడం మానేస్తాయి. అందుకని ఎంత తిన్నా సంతృప్తి వుండక తినవల్సిందానికంటే ఎక్కువ తినేసి, కడుపు బాగాబరువుగా అనిపించాక 'అయ్యయ్యో అందరికంటే ఎక్కువ తినేశామే' అని తెగ బాధపడి, సిగ్గుపడి పోతారు.



## లిప్ సర్వీస్

ముద్దు చాలా ముద్దు అయిన పదం. ప్రకృతిలోని రంగుల్లాగ ముద్దుల్లో కూడా ఎన్నో వన్నెలు చిన్నెలు వున్నాయి. 'అడగక ఇచ్చిన మనసే ముద్దు, అందీ అందని అందమే ముద్దు' అంటూ 'నాకు నువ్వు నీకు నేను ముద్దుకు ముద్దు' అని ఎంతో ముద్దుగా చెప్పిందో

కవిగారి కలం.

ఎంత కంటికి నచ్చి మనసు మెచ్చిన అమ్మాయినైనా సమయం, సందర్భం, వీలు, వాలు చూసి మరీ ముద్దుపెట్టుకోవాలి. లేకపోతే దవడ పేలి చెంప మొద్దుబారే ప్రమాదం పక్కనే పొంచి వుంటుంది జాగ్రత్త అని అనుభవజ్ఞులు హెచ్చరిస్తున్నారు. ఆంధ్రా స్టయిల్, అరవ స్టయిల్లాగే విదేశీ ముద్దులు కూడా రకరకాలు. హాలీవుడ్ ముద్దులు అచ్చ తెలుగు సినిమాల్లో చూపిస్తే తెర చించేస్తారు ఆవేశపరులైన ప్రేక్షకులు. ఎక్కడి లక్షణం అక్కడ వుంటేనే ముద్దు అందుకే.

బ్రిటిష్‌వాళ్లు రోడ్డుమీద పోతూ పోతూ షేక్‌హాండ్ ఇచ్చుకున్నంత సులభంగా, హలో అనుకున్నంత ఈజీగా పెదవులకు పెదవులుచేర్చి ముద్దు పెట్టుకుని వెళ్లిపోతుంటారు. అది లిప్ సర్వీస్‌ట.

అసలా ముద్దుకి అందమైన భాష్యం చెప్పగలిగినవాళ్ళు ఫ్రెంచి వాళ్లే. తీవ్రంగా ఉద్రిక్తతతో అవతలి వ్యక్తిని ఒడిసి పట్టుకుని వెచ్చని ముద్దునివ్వడంలో ఫ్రెంచివారికి మించినవారులేరు.

వీరి తర్వాత స్థానం పోలెండువారిదే. వీరి ముద్దు స్పందనతో కూడి భావస్ఫోరకంగా, నాజూగ్గా వుంటుంది.

శక్తివంతమైన ముద్దులు పెట్టుకోవడం జర్మన్లకే చెల్లు. వీరికి 'స్ట్రాంగెస్ట్ కిస్సర్స్' అని పేరుంది కూడా. లక్సెమ్‌బర్గ్ వాళ్లు ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. వీరి ముద్దుల్లో ఎటువంటి రాగం, భావం వుండవు.

అమెరికన్ల ముద్దు టూత్‌పేస్ట్ ఎడ్వర్టయిజ్‌మెంటులా వుంటుంది. ముద్దుకి ముందు పళ్లను బ్రష్‌తో శుభ్రం చేసుకుని, మెడమీద అత్తరు స్ప్రే కొట్టుకుని నోట్లో ఒక 'మెంథాల్' బిళ్ళ వేసుకుని ఎదుటి వ్యక్తికూడా తమంత శుభ్రంగా ఆరోగ్యసూత్రాలు పాటిస్తున్నాడా లేదా అని అనుమానిస్తూనే ముద్దుకి సన్నద్ధులవుతారు. ఈ లోపల ముద్దుమీద మోజు పోదుటండీ! ఏమో మరి!

ఇంక బ్రిటిష్ ప్రేమికుల ముద్దు వైఖరి చూస్తే ప్రథమచికిత్స సరంజామా దగ్గర పెట్టుకోవాలేమోననిపిస్తుంది. ముద్దు పెట్టుకున్నంత మేరా రక్తంచిందేలా పంటినొక్కులు పడ్డమే అందుకుకారణం.

ఇన్ని విన్నాక 'ము...ము... ముద్దంటే మోజే...ఇపుడా వుద్దేశం లేదే' అనిపిస్తే అందుకు బాధ్యత బ్రిటన్లోని సినీరివ్యూ వారపత్రికదే!

## తమాషా తరువులు

ఓ బాటనీ లెక్చరర్‌గారు ఓ తెలివైన విద్యార్థిని పిల్చి 'ఈ సృష్టిలో ఎన్ని రకాల మొక్కలున్నాయో చెప్పగలవా' అని అడిగితే – అతను కాసేపు ఆలోచించి మనసులో లెక్కించి, గుణించి, భాగారించి నానా తంటాలుపడి చివరికి 'ఆకాశంలో చుక్కలన్ని' అని జవాబుచెప్పాడు. ఆతర్వాత లెక్చరర్ని 'పోనీ మీరు చెప్పండి సార్! సమాధానం పుస్తకంలో రాసుకుంటాను' అంటే – లెక్చరర్ ఖంగారుగా 'నువ్వు చెప్పావుకదా సమాధానం. సిదే సరైంది' అన్నాడుట.

విపరీత గుణాలున్న చెట్లు ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. 'సోపర' అనే చెట్టు ఆకులమీద చిన్న, పెద్ద రంధ్రాలు వుంటాయి. గాలి ఆ రంధ్రాల గుండా వీచినపుడు మురళీనాదం వెలువడుతుంది. 'సోపర' అంటే అరబ్బీ భాషలో 'మురళి'



# న్యూట్రమూల్ 'మొనగాడ'వండి
# బలానికి దారాసింగ్ చెప్పే పాఠాలు

**పొడుగును పెంచే కసరత్తు.**
కుడిభుజాన్ని గోడకు ఎదురుగా పెట్టి నిలబడండి. ఊపిరి పీలుస్తూ వేళ్ళ మీద పైకిలేస్తూ, ఎడమ ముంజేతిని పైకి విసరుతూ వీలైనంత ఎత్తుగా గోడను తాకండి. ముందటి స్థానానికి తిరిగివస్తూ ఊపిరి వదలండి. దీన్నే, ఎడమ ముంజేతితో 10 సార్లు కుడి ముంజేతితో 10 సార్లూ చెయ్యండి.



పాదాల మధ్య 10 అంగుళాల దూరం వుండేలా నిల్చోండి. ఊపిరి పీలుస్తూ, వేళ్ళ పైన పైకి లేస్తూ, ముంజేతుల్ని, వేళ్ల తలపైకి వచ్చేదాకా వీలైనంత ఎత్తుగా విసరండి. ముందటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్ని 10 సార్లు చెయ్యండి.



కాళ్ళను తిన్నగా పెట్టి నేల మీద కూర్చోండి. కాళ్ళను వీలైనంత ఎక్కువ ఎడంగా పెట్టండి. ఊపిరి పీల్చే టప్పుడు ముందుకు వంగండి. ఒల చేస్తూ, ఎడమ మోకాళ్ళను తగిలేలా పాదాన్ని రెండు చేతులతో తాకడానికి ప్రయత్నించండి. మొదటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్నే 10 సార్లు ఎడమ పాదంతో 10 సార్లు కుడి పాదంతో చెయ్యండి.



ప్రతి రోజూ ఒక కప్పు న్యూట్రమూల్ తాగి బలాన్ని పొందండి. న్యూట్రమూల్‌లో మీరు యిష్టపడే సమృద్ధి అయిన అమూల్ పాలు, మేలైన మాల్ట్ ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు ప్రొటీన్లు ఖనిజాలు. అదికూడా చాక్లెట్ రుచితో. తల్లులు తెలుసుకోవలసిందేమిటంటే, న్యూట్రమూల్ ధర, బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవాలకన్నా తక్కువ అని.





గట్టితనం పొందే మార్గంలో న్యూట్రమూల్ మీకు సహాయం చేయనీండి– ఆరోగ్యంగా, మీరు చేసేవన్నీ గొప్పగా కనిపించేలా, గొప్పగా చేసేలా కూడా. న్యూట్రమూల్ మొనగాడతనం అంటే అదేమరి.




daCunha/GCM/69/82/TL

అమూల్ వారి
# న్యూట్రమూల్

అమ్మకందారులు :
గుజరాత్ కో–ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్ ఆనంద్, గుజరాత్.





అని అర్థం.

'వాల్కానో' అని పిలిచే చెట్టు జపాన్లో ఉంది. సక్రమంగా పెంచినట్లయితే ఈ చెట్లు ఒక్కొక్కటి 50, 60 అడుగుల పొడవు పెరుగుతాయి. సూర్యాస్తమయం అయీ అవగానే ఆ చెట్టు చిటారు కొమ్మల్లోంచి తెల్లని పొగవచ్చి ఆకాశాన్ని చుట్టేస్తుంది.

మెక్సికోలో ఓ మొక్క సూదులు, దారాల్ని ఇస్తుంది. మొక్కచివర ఆకుపచ్చని ఆకులు, ఆకుల మధ్య సన్నని సూదుల్లాంటి ముళ్లు వుంటాయి. ఈ ముళ్ళను కోయగానే దానివెనుకే దారంలా నార వస్తుంది. సూదిలాగే ముల్లుచివర రంధ్రం ఉండడంవల్ల చిన్నచిన్న కుట్టుపన్లకి వాటినే సూది, దారాల్లా ఉపయోగిస్తారు.

ఆఫ్రికా అరణ్యాల్లో మాంసాహారులైన మొక్కలు కొన్ని ఉన్నాయి. ఈ చెట్టు ఆకులు మన అరటాకులంత పొడవుగా వుంటాయి. ఆకుమీద ఏదైనా కీటకం వాలితే వెంటనే ఆకు దాన్ని గట్టిగా చుట్టేసి రక్తాన్నంతా పీల్చుకుని చచ్చిన తర్వాత కిందకి విసిరేస్తుంది.

హిమాలయాల్లో ఓ వెలుతురు చెట్టుంది. దీన్ని 'బిజిలీ' చెట్టని అక్కడివారు సర్దాగా పిల్చుకుంటారు. పగలు, రాత్రి అన్న విచక్షణలేకుండా ప్రతిరోజూ ఆకు లోపల నించి ఎలక్ట్రిక్ లైటులాంటి వెలుతురు వస్తూ వుంటుంది.

పసిఫిక్ మహాసముద్ర దీవుల్లో 'బ్రెడ్డు' చెట్లున్నాయి. దానిపూలు ఆకుపచ్చరంగులో పెద్దవిగా ఉంటాయి. పూలు వాడి రాలిపోయాక మెత్తగా, కొంచెం పెద్దగా ఉన్న తెల్లని పండువస్తుంది. ఈ పండు గుజ్జు అచ్చం బ్రెడ్డులాగే వుండడంవల్ల ద్వీపవాసులు దాన్ని బ్రెడ్డుగా వాడతారు. పొద్దున్నే మొహం కడుక్కొని చెట్టు దగ్గరకెళ్ళి కోసుకుని తాజా బ్రెడ్‌తో బ్రేక్‌ఫాస్ట్ చేస్తారన్నమాట. ఎంతహాయి!



# ప్రమాదాల పరంపర

ఒకోసారి గోరుచుట్టు మీద రోకటి పోటన్నట్లు సంభవిస్తుంటాయి కొన్ని సంఘటనలు. అమెరికాలో నివసించే ఒక స్కూలు విద్యార్థి బ్రెంట్ హార్ట్‌ఫోర్డ్‌కి నిద్రలో నడిచే అలవాటుంది. అలవాటయిన పరిసరాలు, ఇల్లు కాబట్టి రాత్రులు ఎన్ని షికార్లు చేసినా ఏ గొడవా లేకుండా మళ్లీ మంచంమీదకి చేరి గుర్రుపెట్టి నిద్రపోయేవాడు.

అయితే కొన్నాళ్లకి వాళ్లు కొత్త ఇంటికి మారాల్సి వచ్చింది. పరిసరాలు కొత్తవి అయినా అలవాటు పాతదేగనక ఒక రాత్రివేళ నిద్రలో లేచి నడవసాగాడు 14 ఏళ్ళ బ్రెంట్. అప్పటికి ఆ ఇల్లూ, పరిసరాలూ కూడా అతనికి బాగా పరిచయంకాలేదు. అందుకని ఓ గది లోంచి నడుస్తోంటే కింది అంతస్తులో వున్న పొయ్యినుండి పై అంతస్తుకి కొత్త చిమ్నీ ఏర్పాటు చేయడానికని సిద్ధమవుతున్న రంధ్రంలో పడ్డాడు బ్రెంట్. పడటం పడటం సరిగ్గా ఆ రంధ్రం కిందేగల స్టవ్ మీదవున్న టబ్‌లో మరుగుతున్న నీళ్ళలో పడ్డాడు. బ్రెంట్ కేకలు విన్న అతని తండ్రి మెట్లు దిగి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. స్టవ్‌మీదున్న టబ్‌లోని వేడినీళ్లు అప్పటికే కిందపడి గదంతా ఆక్రమించడంతో అతని పాదాలు కాలి బొబ్బలెక్కాయి.

వీళ్లిద్దరి కేకలు విని ఏం జరిగిందోనని పరిగెత్తుకుంటూ వచ్చిన బ్రెంట్ సోదరుడు మెట్లమీద జారిపడి కాలు విరగ్గొట్టుకున్నాడు. వీళ్ళ ముగ్గుర్నీ చూసి కంగారుపడిపోయిన బ్రెంట్ తల్లి కారేసుకొని డాక్టర్ దగ్గరికి బయల్దేరింది. అయితే ఆవిడ దార్లోనే మంచు తుఫానులో చిక్కుకుంది.

చివరికి ప్రమాదాల పాలయిన ఇంటిల్లిపాదీ ఆస్పత్రిలో చేరారు. చివరికి అందరూ కోలుకున్నారనుకోండి. •

సిటీ బస్సు వచ్చి ఆ సెంటర్లో ఆగగానే 'ఉమెన్స్ కాలేజ్' అంటూ గావుకేక పెట్టేడు కండక్టర్.

లంగాలవాళ్లు, లంగా వోణీలవాళ్ళు, చీరె జాకెట్లవాళ్లు- ఇరవై రెండేళ్ళ లోపు ఆడపిల్లలు బిలబిలలాడుతూ, బోనులో నుండి బయటపడ్డవారిలా బస్సు దిగసాగేరు. దిగీదిగగానే గ్రూపులుగా చేరి కిలకిలలాడుతూ కబుర్లు చెప్పుకొంటూ కాలేజీ వైపు నడవసాగేరు. చీరెలు, లంగాలకు భిన్నంగా అక్కడక్కడా ఒకటీ రెండు పంజాబీ డ్రెస్సులు, పేంటు షర్టులు తళుక్కుమంటున్నాయి.

ఆడపిల్లల్లో చాలామంది వేసుకొన్న దుస్తుల రంగు ఒకటే!

ఆ కాలేజీ యూనిఫాం-తెల్ల లంగా, తెల్లజాకెట్టు, నీలం వోణీ లేక నీలం చీర, తెల్లజాకెట్టు! రంగులొకటే కానీ ఖరీదైన పాలిస్టర్ దుస్తులూ, తక్కువ ఖరీదు నూలు బట్టలూ కూడా ఉన్నాయి. శక్తిని బట్టి దుస్తులు. దుస్తుల్ని బట్టి అందం... ఆకర్షణ!

అలా యూనిఫాం వేసుకొని గుంపులు గుంపులుగా వెళుతున్న ఆడపిల్లల్ని చూస్తూంటే – కేపిటలిస్టు సోషలిస్టులు, సోషలిస్టు కేపిటలిస్టులు కల్సి వూరేగింపుగా వెళుతుంటే చూస్తున్న అనుభూతి కలుగుతుంది.

ఆ ఆడపిల్లల గుంపుల్ని చూడటానికి ఆ సెంటర్లో పోగయిన పేంటు పురుషులు హిందీ,తెలుగు,తమిళ, మలయాళ సినిమాలకు రాజపోషకులు. ఆయా భాషా సినిమా హీరోల భక్తులు. ప్రేమంటే ఏమిటో తెలియని ప్రేమికులు! అందాన్ని ఆరాధిస్తున్నామనుకొంటూ నడి బజార్లో అవమానించే మూర్ఖాగ్రేసర చక్రవర్తులు! ఒంటరిగా వున్నపుడు పిల్లులు- నలుగురిలో వుంటే ప్రతి ఒక్కడూ తాను పులిననుకొంటాడు.

ఒక్కో గ్రూపు ఆడపిల్లలకు ఒక్కో మగ పిల్లల గుంపు జతపడింది. హీరోల పరాచకాలు, హీరోయిన్ల బదులు పరాచకాలు. కిలకిలలు, కిసకిసలు, కిచకిచలు..!

ఆఖరి అమ్మాయి దిగేవరకు బస్సు కండక్టర్ దేబిరింపు మొహాన్ని వేసుకొని ఒక్కొక్క పిల్ల అందాన్ని రెప్పవాల్చకుండా చూస్తూ గుటకలు మింగుతూనే వున్నాడు. ఆఖరి అమ్మాయి కూడా దిగింది.

అప్పుడు కండక్టరుకు తన కర్తవ్యం గుర్తుకొచ్చింది. రెండు వేళ్ళూ నోట్లో పెట్టుకొని గట్టిగా ఈలగొట్టి గర్వంగా ఆఖర్న దిగిన అమ్మాయి వైపు చూశాడు. ఆ అమ్మాయి తల వంచుకొని నిలబడి వుంది. ఆ అమ్మాయి వైపు ఆశగా చూస్తూ 'రైట్...రైట్' అని బిగ్గరగా అరిచేడు.

కూతుళ్ళ పెళ్ళిళ్లు చేసి బరువు దించేసుకొన్న ఆడపిల్లల తండ్రిలా సంతోషంగా బస్సు బయల్దేరి వెళ్ళిపోయింది!

ఆఖరున బస్సు దిగిన అమ్మాయి పేరు లత. ఆమె యూనిఫారం వేసుకోలేదు ఆ రోజు. ఆ రోజు ఆమె పుట్టిన రోజు అని ఆమె వేషమే చెప్తోంది. తలంటి పోసుకొని జడ లూజుగా వేసుకొని వుంది. జడలో ఓ గులాబీ పువ్వు, ఓ పచ్చ సంపెంగ పువ్వు అలంకరించుకొంది. పసుపు పచ్చ నూలు చీరె కట్టుకొంది. అదే రంగు జాకెట్టు వేసుకొంది.

ఆమె బస్సు దిగిన చోట నిలబడి




ఒక్క క్షణం ఓరగన్నుతో అటూ ఇటూ చూసింది. స్నేహితురాళ్ళు ఎవరూ కన్పించలేదు. ఎడంచేత్తో పుస్తకాలను గుండెలకు ఆనించి పట్టుకొని తలవంచు కొని మెల్లగా నడవసాగింది.

"హాయ్... బ్యూటీ!"

"మఫ్టీలో అచ్చం సినిమా తారలా వుంది కదురా?"

"ఛ! సినిమా తార అమ్మమ్మలా వుందిరా!"

ఇలాంటి న్యూసెన్సు కాస్త కంటికి నదరుగా కన్పించే అమ్మాయిలందరికీ అనుభవమే! అయితే చాలా మంది అమ్మాయిలు అబ్బాయిల చేత అలా అనిపించుకోవడం గొప్పగా భావిస్తారు. కొందరు జవాబులిచ్చి వాళ్ళను రెచ్చ గొడ్తారు కూడా.

లతకు అలాంటివంటే వళ్లు మంట. కానీ చేసేదేముంది? తల వంచుకొని పోవటం అలవాటు చేసుకొంది. ఆ రోజూ అలాగే పోతోంది.

బస్సు ఆగిన చోటు నుంచి కాలేజీకి వెళ్ళాలంటే కొంత దూరం నడవాలి. ఆ కాస్సమేరా ఆమెకు నిప్పుల బాటే!

"ఒరేయ్! ఇవాళ మన బ్యూటీ బర్త్‌డే లాగుందిరా!"

"మెనీ హేపీ రిటర్న్స్ టూ యూ" అంటూ ఒకడు రాగం తీసేడు.

"ఒరేయ్! పుట్టినరోజును బ్యూటీకి పునర్జన్మ ఎత్తిన రోజుగా మారుస్తాను. దటీజ్ మై బర్త్‌డే ప్రెజెంటేషన్"

"అదంతా తర్వాత. ముందు చాత నయితే నీ బ్యూటీ నోటికి వేసుకొన్న 'సీల్'ను విప్పు చూద్దాం."

"అబ్బా! నోటికి ఏడు లివర్ల నవ్ తాళ్ వేసుకొందిరా! మన అశోక్‌కి అది విప్పటం సాధ్యమా?"

"ఆ తాళాన్ని తీసే 'కీ' ఏమిటో నేను తెలుసుకొన్నారా ఫ్రెండ్స్!"

"ఏమిటి?"

"ఏమిట్రా అది?"

"డబ్బు...."

"నీకేం తక్కువ? ఒకటి... రెండు.. పది ... ఇరవై వేలన్నా పడేసి ఈ తాళం తియ్యాల్సిందే!"

"ఆ ప్రయత్నంలోనే వున్నారా ఫ్రెండ్స్! త్వరలోనే నా బ్యూటీకి 'కన్నెరికం' చేసి బ్యూటీ సీల్స్ అన్నీ తొల గించేస్తా. ఓకే?"

లత పక్కకి వచ్చి దాదాపు మొహంలో మొహం పెట్టాడు అశోక్! లత చివ్వున తలఎత్తి అతణ్ని చూసింది!

అతను దాదాపు ఆరడుగుల ఎత్తు వున్నాడు. పచ్చటి శరీర వర్ణంతో, నల్లటి జుట్టు, మీసాలతో అందంగా వున్నాడు. అతను వేసుకొన్న ఖరీదయిన డ్రెస్ అతని అందాన్ని ఇనుమడింప చేస్తున్నది.

"హాయ్ బ్యూటీ...ఐ లైక్ యూ... ఐ వాంట్ యూ...ఐ నో యువర్ హిస్టరీ..." అంటూ ఆమె కళ్లల్లోకే చూస్తూ చిలిపిగా కన్నుగొట్టేడతను.

'యూ...స్కౌండ్రల్' అంటూ చాచి అతని చెంప 'చెళ్' మనిపించాలని మనసు ఆవేశపడింది.

కానీ బుద్ధి ఆ ఆవేశాన్ని కంట్రోల్ చేసింది.

'అశుద్ధం మీద రాయేస్తే చింది తన మొహం మీదనేగా పడేది?' ఆమె తల వంచుకొని 'ఛీ' అని మెల్లగా అని నడవ సాగింది.

సరిగ్గా ఆ సమయంలో వెనకనుంచి పోలీస్ వేన్ వచ్చి అక్కడ ఆగింది. పోలీస్ ఆఫీసర్ దిగి అశోక్‌ని పట్టుకొన్నాడు.

"ఏయ్ మిస్టర్! వేన్ ఎక్కు"

"ఎందుకు?"

"ఆ అమ్మాయిని 'ఈవ్ టీజింగ్' చేసినందుకు. అంతా స్వయంగా చూశాలే. బుకాయించకు."

ఆమధ్య పెద్ద పోలీస్ ఆఫీసర్‌గారి అమ్మాయిని, జడ్జిగారి అమ్మాయిని కొందరు అల్లరిపెట్టేరు. అప్పటినుంచి 'ఈవ్ టీజర్స్' పైన ఇలా మెరుపు దాడులు జరుగుతున్నాయి.

"అసలు నేనెవరో తెల్సా?" అన్నాడు అశోక్ అహంభావం ఉట్టిపడుతుంటగా.

పోలీస్ ఆఫీసర్‌లో 'కాకి కిక్'పూర్తిగా ఆవహించింది.

"నువ్వెవడివయితే నాకేంరా? ఏయ్! త్రీఫైవ్‌సెవెన్ వీడిని వేన్ ఎక్కించండి" అని పోలీసులకు ఆర్డరు జారీచేసేడు.

లత దగ్గరికొచ్చి "వీడు మిమ్మల్ని ఏం చేసిందీ వివరంగా స్టేట్‌మెంట్ ఇవ్వాలి మీరు" అన్నాడు పోలీస్ ఆఫీసర్.

లత తలఎత్తి ఓసారి పోలీస్ ఆఫీసర్ వేపు, మరోసారి అశోక్ వైపు చూసింది. అశోక్ మొహంలో అభ్యర్థనలేదు. భయం లేదు. అదే పశుత్వం..అదే అహంకారం.

"చెప్పండి మేడమ్! వాడినిచూసి భయ పడనక్కరలేదు. వాడు ఎంతగొప్ప వాడయినా వాడిని జైలుకు పంపించే పూచీ నాది"

కానీ అంతమాత్రంచేత అతను తన ధోరణి మార్చుకొంటాడా! మరింత పెచ్చేగిపోడూ? పైగా...

"అతను నన్నేం అనలేదండీ! అల్లరి చేయలేదు. హి ఈజ్ మై ఫ్రెండ్. యస్. హి ఈజ్ మై ఫ్రెండ్..."

అంటూ తల వంచుకొని చకచకా ముందుకు నడిచిపోయింది లత.

అశోక్ మొహం విజయగర్వంతో వెలిగిపోయింది. పోలీస్ ఆఫీసర్ వేపు ఛాలెంజింగ్‌గా చూశాడు.

పోలీసు ఆఫీసర్ తన సిబ్బందికి సైగ ద్వారా ఏదో ఆర్డర్ జారీచేసి వేను ఫ్రంట్ సీటెక్కి విసురుగా డోర్‌ను వేసాడు.

"వీడెవడో కొత్తగా వచ్చినట్లుంది. రెండురోజుల్లో వీడిని బదిలీ చేయించక పోతే నా పేరు అశోక్‌కాదు". అన్నాడు పొగరుగా వేను వైపు చూస్తూ అశోక్.

ఆ తర్వాత దూరంగా వెళ్తున్న లతవెపు చూస్తూ "థేంక్యూ డార్లింగ్" అంటూ ముద్దును గాలిలో విసిరేడు.

ఇదంతా అల్లంత దూరంలో నిలబడి మరో యువకుడు గమనిస్తున్నాడని ఎవరూ గుర్తించలేదు!

* * *

దయ్యమో, భూతమో సినిమాల్లో తరుముకొస్తున్నట్లు కాలేజీలోకి అడుగు పెట్టింది లత.

క్లాసులు జరిగే పాకలకు అల్లంత దూరంలో ఓ మూలగా, పెద్ద చెట్టు వుంది. పళ్లు కాయని చెట్టు అది!

ఆ చెట్టువద్దకు పరుగు పరుగున వెళ్లింది. పుస్తకాలు కిందకి వాటంతటవే జారిపడ్డాయి. ఆమె కూలబడిపోయింది. ఇంతవరకు అణచుకొన్న దుఃఖం ఎగదన్నుకొచ్చింది. మోకాళ్ళమీద చేతులు పెట్టి, చేతుల్లో మొహం దాచుకొని వెక్కి ఏడవసాగింది.

క్లాసులు ఆరంభమవుతున్నట్లు బెల్లులు మోగాయి. పీరియడ్స్ అయిపోయినట్లు

బెల్లులు మోగుతూనే వున్నాయి. కానీ అవేమీ లత చెవుల్లో పడలేదు.

ఆడపిల్లలను 'టీజ్' చేయడం సహజమే కావచ్చు. దాన్ని తను ఇంతకాలం స్పోర్టివ్‌గానే తీసుకొంది.

"కానీ ఇవాళ అతను ఏమన్నాడు? తనని డబ్బుతో...ఛీ...ఛీ.."

అలా ఏ ఆడపిల్లనైనా అనగలడా అతను?

తననే అలా ఎందుకనగలిగేడు?

"తను ఆ కుటుంబంలో" పుట్టటం తన నేరమా?

తన తల్లి చేసే తప్పులకు తను బాధ్యురాలా?

తన తల్లిలాగే తనూ ఆ జీవితాన్ని గడపాలని రూలు వుందా?

కన్నీళ్లు ఖర్చయిపోయాక ఆమె ఆలోచిస్తూ ఆవేశపడిపోసాగింది.

తనేం తప్పుచేసిందని వాళ్లు తన మొహాన అంతమాటన్నారు?

కులం, గుణం, చరిత్ర...

తన గుణానికేం? చరిత్రలో ఏమచ్చ వుంది?

ఇక తన కులం...

ఆమెకు ముళ్ళమీద కూర్చున్నట్లుంది. లేచింది.

రోడ్డుమీదికొచ్చేసరికి సిటీ బస్సు సిద్ధంగా వుంది. కాలేజీ వదిలే సమయం కాకపోబట్టి బస్సు రద్దీగా లేదు.

కానీ సీటు ఒక్కటే ఖాళీగా వుంది. అయితే ఆ రెండు సీటర్ల సీటులో పక్కన ఓ యువకుడు కూర్చుని వున్నాడు.

లతను చూసి అతను లేచి నిల్చుని ఆమెకు సీటిచ్చాడు.

ఆమె నిల్చోగలిగిన స్థితిలోలేదు. అంచేత అతను సీట్ ఆఫర్ చెయ్యగానే 'థేంక్స్' అంటూ సీటులో కూలబడింది.

కాసేపయ్యాక ఆమె తల ఎత్తి చూసింది. అతను నిలబడివున్నాడు. తన పక్క సీట్ ఖాళీగానే వుంది. తనకి సీటిచ్చిన అతన్ని కూర్చోమనటం కనీస మర్యాదకాదా?

'కూర్చోండి' ఆ మాట నాలుక దాకా వచ్చి అంతలోనే అనుమానంగా ఆగిపోయింది.

ఈ లో గా ఏదో స్టాప్‌లో బస్సు ఆగింది. ఎవరో స్త్రీ వచ్చి ఆమె పక్క సీట్‌లో కూచ్చుంది.

కొంతసేపుపోయాక అతను తన వైపే చూస్తున్న భావన కలిగింది లతకు. తలెత్తి అతని వైపు చూసింది.

అతను తలనుతిప్పుకొని కిటికీలోనుంచి ఎక్కడికో చూడసాగాడు. అంతవరకు తననే చూస్తున్నట్లు ఆమెకు అర్థమైంది. కానీ అతని మొహంలో ప్రసన్నత, ఆరాధన, అమాయకత్వం తప్ప మాలిన్య భావాలు కన్పించలేదు.

అతను ఆమె వైపు చూడబోయి, ఆమె తననే చూస్తున్నదని గుర్తించి మళ్ళీ చూపులు మరల్చుకోబోయాడు

ఆమెకు అతని అవస్త చూసి నవ్వొచ్చింది. ఆ నవ్వు పెదిమల పైన లాస్యం చేసింది.

ఆమె మనసు అనుకోకుండానే ఆర్ద్రమయింది.

ఆమె దిగాల్సిన స్టాప్ వచ్చింది. ఆమె మోకాళ్ళ మీద నున్న పుస్తకాల దొంతర తీసుకొని బస్సు దిగటానికి లేచింది. అతను ఆమె వైపే చూస్తున్నాడు

బస్సు దిగుతుండగా ఆమె చేతిలో పుస్తకాలు జారి కిందపడ్డాయి.





దిగాల్సినవాళ్ళు దిగారు. ఎక్కాల్సిన వాళ్లు ఎక్కారు. బస్సు కదిలి పోయింది.

వంగి పుస్తకాలు తీసుకోబోతుంటే లతకు అతను పుస్తకాలు తీస్తూ కన్పించాడు.

"అయ్యో! అదేమిటండీ? మీరు..."

ఆమె కూడా నేలమీద పడ్డ పుస్తకాలను ఏరుతూ అంది.

"ఫర్వాలేదండీ"

కింద పడ్డ ఆమె పుస్తకాలు కొన్ని అతని చేతిలో— మరికొన్ని ఆమె చేతిలో.

"మీరు కూడా ఈస్టాప్‌లోనే దిగాలా?"

"లేదండీ! మీ పుస్తకాలు కింద పడితే చూసి...కాస్త దూరం మీ పుస్తకాలు తీసుకొస్తాను. అభ్యంతరమా?"

"ఎందుకండీ.. "

"ప్లీజ్.."

ఇద్దరూ నడవసాగారు.

"పొద్దున జరిగిన సంఘటనను నేను చూసానండీ! మీరు చాలా మంచి పని చేశారు. పోలీసు రిపోర్టులు ఇస్తే అతనికి దండన పడటం సంగతి అలావుంచి ముందు మీరు రచ్చకెక్కుతారు కదా?"

"అయితే మీరు అంతా చూస్తూ ఊరుకొన్నారన్నమాట!"

"ఏం చేయనండీ? ఇవాళే కాదు. మిమ్మల్ని అలా 'టీజ్' చేయటం చాలా సార్లు చూసాను. బాధపడే వాడిని. వాళ్ళ మీద కోపం వచ్చేది. కానీ ఏం చేయనండీ?"

"ఏం? మీరు ఆ అరాచకత్వాన్ని, అన్యాయాన్ని ప్రతిఘటించవచ్చుగా? నా సహాయానికి రావచ్చుగా? ఆమాత్రం ధైర్యం లేదా మీకు?"

"ఇక్కడ ధైర్యం కాదండీ ప్రశ్న? ఇవాళ పోలీసులు మీ రక్షణ కొస్తే మీరేం చేసేరు? ఎవర్రికి జరిగే అన్యాయాన్ని, అరాచకాన్ని, వాళ్లు ఎదుర్కొంటే కదా? దారినబోయే వాళ్లు సహాయం రావటానికి పిలయ్యేది? మీకే ఆ ధైర్యం లేనపుడు నాలాంటి వాళ్లుకలగ చేసుకొంటే సలుగురూ నాలుగు విధాలుగా అనుకోరా? మిమ్మల్ని అల్లరి పెట్టే వాళ్లకు మిమ్మల్ని మరింతఅల్లరి పెట్టటానికి, చిలువలుపలువలు అల్లటానికి ఆస్కారం ఇచ్చినట్లవుతుంది కదా?"

నిజమే తనకి జరిగే అవమానాన్ని, అన్యాయాన్ని ప్రతిఘటించే శక్తి ముందు తనకి వుంటేగా?

ఆమె అతని మాటల్ని వితర్కించుకొంటోంది నిశ్శబ్దంగా.

ఆ సమయంలో అతను నెమ్మదిగా జేబులో నుంచి ఓ కాగితం తీసి పుస్తకంలో పెట్టటం ఆమె గమనించింది. కానీ చూడనట్టే నటించింది.

"ఇంతకీ అసలు నేనెవరో అడగనే లేదే మీరు?"

"అవసరమనుకొంటే మీకే చెప్తారుగా?"

అతను వాచ్‌లో టైమ్ చూసుకొన్నాడు.

"ఇక నేను వెళ్తానండీ! మా ఇల్లు దగ్గరికొచ్చింది. మీరు వెళ్ళండి. థేంక్స్!"

"ఈ పుస్తకం చాలా బాగుంటుందండీ! ఇంటికి వెళ్ళాక చదవండి కావలిస్తే. చదువుతారుగా?" అంటూ ఓ పుస్తకాన్ని ప్రత్యేకించి చూపించి మిగతా పుస్తకాలు కూడా ఆమెకిచ్చేసేడు.

ఆమె పుస్తకాలు తీసుకొని తలవంచుకొని వెనుదిరిగి చూడకుండా నడిచి ఒక

ఇంటిలోకి ప్రవేశించింది.

అతను వెళ్తున్న ఆమెనే చూస్తూ అలాగే నిలబడిపోయాడు!

ఆమె లోపలికి వెళ్ళగానే అతని దృష్టి ఆ ఇంటి ముందు గోడకున్న ఒక పెద్ద బోర్డు పైన పడింది.

'గౌరీ శంకర్ రికార్డ్ డాన్సింగ్ కంపెనీ'

* * *

రెండు స్కూటర్లు ఆ ఇంటి ముందు ఆగేయి. నలుగురు యువకులు దిగేరు. అప్పుడు రాత్రి ఏడు గంటలయింది.

"అశోక్! నువ్విక్కడే వుండు. నువ్వొచ్చినట్లు లోపల చెప్పి నీకు రిసెప్షన్ ఏర్పాటుచేయిస్తాం"

ఇద్దరిని వాకిట్లోనే ఉంచి ఇద్దరు యువకులు లోపలకి వెళ్ళారు.

సరిగ్గా ఆ సమయంలో సినిమా రికార్డు సంగీతం విన్పించసాగింది లోపలి నుంచి. ఆ సినిమా పాటకు అణుగుణంగా గజ్జెలు కట్టుకొని నాట్యం చేస్తున్న చప్పుడు. వాళ్లు లోపలికి ప్రవేశించారు.

విశాలమైన వరండాలో మాసిపోయిన రెండు సోఫా సెట్లు వున్నాయి. ప్లాస్టిక్ తెగిపోయిన రెండు గార్డన్ ఛైర్స్ వున్నాయి. ఎదురుగ్గా గోడకు గౌరీ శంకరులు నాట్యంచేస్తున్నట్లు పెద్దఫొటో, నటరాజు నృత్యం చేస్తున్న ఫొటో... ఈ రెండు ఫొటోల మధ్యగా ఓ విదేశీ సుందరి నగ్న చిత్రం వున్నాయి. ఇంకా గోడలకు అక్కడక్కడా వెంకటేశ్వర స్వామి ఫొటోతోపాటు మరికొందరు దేముళ్ల ఫొటోలు కొందరు తెలుగు, హిందీ ఆడ తారల చిత్రాలు వున్నాయి.

వెలిసిపోయిన పాత కార్పెట్ ఒకటి నేలమీద పరచి వుంది.

ఆ కార్పెట్ మీద సూర్యకాంతం కూర్చుని వుంది.

సూర్యకాంతానికి నలభై తొమ్మిది వెళ్ళి యాభై పడి రాబోతోంది. అయినా ఆమె పదేళ్ల చిన్నది కావాలన్న ప్రయత్నంగా అలంకరించుకొని వుంది.

సూర్యకాంతానికి ఎదురుగ్గా ఒక పద్దె నిమిదేళ్ళమ్మాయి వుంది. ఆ అమ్మాయి పేరు లక్ష్మి. సన్నగా, పీలగా, పాలిపోయి నట్లు రక్తరహితంగా వుంది. ఆమె తనది కాని అందాన్ని మేకప్ద్వారా సంపాదించు కోవాలని ప్రయత్నించినట్లు అలంకరణ స్పష్టంగా చెపోంది. ఆమె చాలా సేపుగా డాన్సు ప్రాక్టీసుచేస్తున్నట్లు గుర్తుగా ఆమె మొహంపైన, మెడపైన చమట బిందువులు వున్నాయి. జాకెట్ వెనుక భాగం



తడిసివుంది. చంకల దగ్గర జాకెట్టుకు పెద్ద తడి చారబడింది.

రికార్డులో సంగీతానికి అనుగుణంగా తొడ మీద తాళంవేస్తూ లక్ష్మి నృత్యాన్ని చూస్తున్న సూర్యకాంతం టక్కున రికార్డు ప్లేయరు ఆపేసింది.

"ఒసేయ్ మొద్దూ! స్టెప్పన్నీ తప్పు చేసే! సినిమా పాటకు అనుగుణంగా గెంతక్కలాడటం చేతకాని నువ్వు ఇంక దేనికి పనికొస్తావ్? ఛీ ఛీ... స్టెప్స్ ఎలా వెయ్యాలో మళ్ళీచేసి చూపిస్తాను. ఈసారి జాగ్రత్తగా చూసి, చేసి అలాగే అడుగులు వెయ్యకపోయావో గిలకలమీద కొడ్తా. తెల్సిందా? ఊ...ఇటొచ్చి చావు" అంటూ సూర్యకాంతం లేచింది. నృత్యం చెయ్యాల్సిన స్థానానికిపోయి నిలబడి చీర కుచ్చెళ్ళు, పమిట సర్దుకొంది.

వన్.. టూ.. త్రీ... రికార్డు మోగుతోంది. సూర్యకాంతం డాన్సు చేస్తోంది.

ఆమె అడుగులు వెయ్యటం, హస్తాభినయాలు చాలా అందంగా వున్నాయి. లక్ష్మి ఆమెనే చూస్తోంది. ఆమె అడుగుల లాస్యాన్నే గమనిస్తోంది.

ఉన్నట్లుండి నవ్వు వినబడింది. సూర్యకాంతం అడుగులు ఆగిపోయాయి. ఆ ఇద్దరు యువకులు చప్పట్లు కొట్టేరు— పొగడగా!

"మీ నృత్యం దర్శించేభాగ్యం మాకు లభించినందుకు మేమెంతో సంతోషిస్తున్నాం. మీరు చిన్నవారైనా, మేము పెద్దవాళ్ళమయినా ఎంత బాగుందేదో?" అన్నాడు అందులో ఒకడు కొంటెగా.

ఆ మాత్రానికే సూర్యకాంతం పొంగిపోయింది. సిగ్గుతో మెలిదిరిగిపోతున్నట్లు అభినయించింది.

"రండి బాబూ కూర్చోండి."

"మేం కూర్చోటానికేంకానీ, ఈ వూళ్లో పుల్లిపాయల వర్తకంచేసి లక్షలు గడించిన లక్ష్మణస్వామిగారి పేరు విన్నారా మీరు?"

"అయ్యో! లక్ష్మణస్వామిగారి పేరు వినకపోవడమేం బాబూ? వారు కట్టించిన 'ఊర్వసి'లో ఎన్నిసార్లు టిఫిన్ తెప్పించుకోలేదు? వారి 'మేనక' లాడ్జి... వారి 'తిలోత్తమ' థియేటర్ తెలీనిదెవరికి?"

"అవునా? లక్ష్మణస్వామిగారి పుత్రుడు అశోక్ కుమార్ పేరు విన్నారా?"

"వినకపోతేనేం బాబూ! తండ్రికి తగ్గ తనయుడేననుకొంటాను. ఇప్పుడు ఇవన్నీ ఎందుకు బాబూ?"

"ఎందుకంటే అశోక్ కుమార్ గారు నీతో ఓ విషయం మాట్లాడాలనుకొంటున్నారు."

"ఎంత అదృష్టం బాబూ? విషయమేమిటో?"

"అది వారినోట్నే వెంట వినటం బాగుంటుందేమో! వారు బయట స్కూటర్ వద్ద వున్నారు."

"వారిని బయటవుంచి మీరు వచ్చారా? ఎంత తప్పుబాబూ! రండి...రండి. వారిని ఆహ్వానించి..." అంటూ సూర్యకాంతం కంగారుగా బయటికెళ్ళింది.

అశోక్ కుమార్‌కు సర్వాలంధనాలను మాటలతోనే చెప్తూ ఆహ్వానించి తీసుకొచ్చింది. ఈలోగా లక్ష్మి లోపలికి మాయమయింది.

ఒకసోఫాలో అశోక్ కుమార్, మిగతా ఆసనాలలో ఆ ముగ్గురూ సర్దుకొన్నారు.

"అమ్మాయ్...లక్ష్మీ! బాబుగారికి కాఫీ తీసుకొనిరా" అని లోపలికి కేకవేసింది.

"బాబుగారు మా గృహానికి రావడం మా అదృష్టం. కానీ దోవతప్పి వచ్చినట్లు





న్నారు ?"

"లేదు. దోవతెల్సుకొనే వచ్చాను."

"అయితే చెప్పండి బాబూ ! రికార్డు డాన్స్ ప్రోగ్రాం ఇవ్వాలా ? ఎప్పుడు ? ఎక్కడ ?"

అశోక్‌కుమార్ జేబులోంచి త్రీ ఫైవ్స్ సిగరెట్టు తీసి వెలిగిస్తూ సన్నగా నవ్వేడు.

"నేను డాన్స్‌లకోసం రాలేదు."

'మరి?' అని సూర్యకాంతం ఆశ్చర్యపోలేదు. అతను వచ్చిన పని ఏమిటో ఆమె ఎప్పుడో గ్రహించింది.

"అయితే ఒక్క క్షణం వుండండి బాబూ!" అంటూ డ్రాయర్ తెరిచి ఫొటోలు కొన్ని తెచ్చి అతనికిస్తూ అంది-

"ఈ ఫొటోలలో వున్నవాళ్ళు మంచి నాట్యకతెలుబాబూ! మీకు ఎవరు నచ్చారో చెప్పండి?"

అతను ఆబొత్తి ఫొటోలను అందుకొని చూసినెనా చూడకుండా పక్కనపెట్టేడు. ఈలోగా కాఫీ పట్టుకొని లక్ష్మి వచ్చింది. అందరూ కాఫీలు తాగటమయింది. అశోక్ కుమార్ మిత్రుల వెపు చూశాడు.

"మా అశోక్ మీ అమ్మాయిని ప్రేమించాడండీ!"

"లత మీ అమ్మాయేకదా?"

సూర్యకాంతం మొహం మాడిపోయింది. అయినా కాస్సేపటికి నిబ్బరించుకొంది.

''ఇలా మా అమ్మాయిని ప్రేమించామని, పెళ్ళిచేసుకుంటామని చాలాపుంది ముందుకొచ్చారు బాబూ! కానీ అమ్మాయి ఇంకా చిన్నదికదా ? చదువుకొంటోంది. చదువు పూర్తయితేకాని వివాహ విషయం తల పెట్టదల్చలేదు.''

సగం కాల్చిన సిగరెట్టు కింద పడేసి బూటుతోనలిపేస్తూ కొత్తసిగరెట్టు వెలిగించాడు అశోక్‌కుమార్.

ఆ తర్వాత జేబులోనుంచి ఓ నోట్ల దొంతర తీసి టేబుల్‌మీద పెట్టేడు.

''నాకు డొంకతిరుగుడు వ్యవహారాలు ఇష్టంలేదు. మీ అమ్మాయిని నేను ప్రేమించాను కానీ పెళ్ళిచేసుకుంటాననలేదు. అయినా మీరే పెళ్ళి ప్రసక్తి తెచ్చేరు కనుక మీ కులధర్మం ప్రకారం పెళ్ళి చేయిస్తానంటే నా అభ్యంతరం లేదు. జీవితాంతం మీ అమ్మాయి పోషణ భారాన్ని నేను తీసుకుంటాను. కన్నెరికానికి ముహూర్తం పెట్టించి కబురుచేస్తే వస్తాను. తొందరేంలేదు నిదానంగానే కానీయండి. కానీ ఇవాళ మనం ఒక ఎగ్రిమెంట్‌కు వచ్చినట్లు గుర్తుంచుకోండి. ఊఁ..."

అశోక్‌కుమార్ లేచాడు.

"లేదు బాబుగారూ! నా కూతురిని వృత్తిలోకి దించదలచలేదు. అది తెలివైనది. చదువుకొంటున్నది. దానికి ఇష్టం లేదు. నాకూ ఇష్టం లేదు! మరెవరైనా అమ్మాయిని..." ఆమె డబ్బును తీసుకొని అతనికి అందిస్తూ అంది.

అశోక్‌కుమార్ కళ్ళు ఎర్రబడ్డాయి. విసురుగా వెనక్కి తిరిగేడు

"నీ ఉద్దేశం ఏమిటి? నేను నీ కూతుర్ని పెళ్లి చేసుకోవాలనా?"

"కాదు బాబూ, నాకు అంత ఆశ లేదు"

అశోక్ సూర్యకాంతం మాటల్ని పట్టించుకోలేదు. విసురుగా ఆమె చేతిలో నోట్లకట్టను లాక్కున్నాడు.

"నేనుగా వచ్చి నీ కూతురికి కన్నెరికం చేస్తానంటే వద్దన్నావు కదూ? గుర్తుంచుకో. నీ కూతురిని పైసా ఖర్చు

చేయకుండా అనుభవిస్తాను. ఇది ఈ అశోక్ శపథం. నేనంటే ఏమనుకొన్నావో?"

పాము బుసలుకొట్టినట్లు బుసకొట్టి అశోక్‌కుమార్ వెళ్లిపోయాడు విసురుగా. అతని వెంటే అసురగణం వెళ్లింది.

సూర్యకాంతం తల చేతుల్లోకి పట్టుకొని సోఫాలో కూలబడిపోయింది!

సరిగ్గా అదే సమయంలో, అదే గృహంలో ఆ గదికి చాలా దూరంగా ఉన్న మరొక గదిలో లత బెడ్‌మీద పడుకొని ఆ ఉత్తరాన్ని వందోసారి చదువుకొంటోంది. ఆమె మొహంలో వెలుగు ... పెదవులపైన హాసరేఖ...

'లతగారూ,

మిమ్మల్ని నేను చాలా రోజులుగా దూరంనుంచే చూసి ఆరాధిస్తున్నాను. ఏమిటి ఆరాధిస్తున్నాను? మీ అందాన్నా? మీ శరీర లావణ్యాన్నా? మీ విశాల నేత్రాలనా? సంపంగిలాంటి మీ నాసికనా? దొండపండులాంటి మీ పెదవులనా? అరటి స్తంభాలలాంటి మీ తొడలనా? ఇలా ప్రశ్నల్ని నాకు నేనే వేసుకొన్నాను. సమాధానం నాకే తెలియలేదు. కానీ ఒక్కటి మాత్రం సత్యం. పైన

వర్ణించిన ఏ ఒక్క అవయవాన్నీ కాదు. అసలు మీ అవయవ సౌందర్యాన్నే కాదు. మరి దేనిని? అది నాకు తెలియదు. ఎంత వితర్కించుకున్నా అర్థం కాలేదు.

కాలేజీకి మీరు వెళ్తున్నప్పుడు మీ వెంట చాలా మంది పడి పరిహాసాలు చేసేవారు. పిచ్చిమాటలు మాట్లాడేవారు. అలా నేనెందుకు చేయకూడదు? ఆ ఆలోచననే నాకు చాలా అసహ్యాకరంగా కన్పించింది. మరి మీ వెనుకపడేవారంతా నాలాగే మిమ్మల్ని ఆరాధిస్తున్నారా? దేవుడన్న సంకల్పం కలిగి ఆరాధించటం మొదలెట్టేక మట్టితో చేసిన వినాయ



కుడిని, పసుపుతో చేసిన వినాయకుడిని సైతం మనం గౌరవభావంతో, పూజ్యభావంతో కళ్ళకద్దుకుంటామే? మరి వాళ్ళంతా మిమ్మల్ని ఆరాధిస్తుంటే నడిబజార్లో మిమ్మల్ని అలా అగౌరవపరుస్తారా?

అందుకే మిమ్మల్ని దూరం నుండి చూసి ఆనందించటంతో తృప్తి చెందేను నేను.

కానీ ఆ మధ్య ఓ వారంరోజులు మీరు కాలేజీకి రాలేదు. అంచేత మిమ్మల్ని దర్శించే అదృష్టం పోయింది నాకు. అప్పుడు నేను పడ్డ మనోవేదన వర్ణనాతీతం. అప్పుడే తెల్సుకొన్నాను-మిమ్మల్ని చూడందే వుండలేనని!

ఆ తర్వాత మిమ్మల్ని గురించి విచారించాను. మీ భోగట్టా తెల్సుకున్నాను. మీ ఇంటి ముందు మీ దర్శనం

కోసం పడిగాపులు కాసేను. మీ గృహ చరిత్ర నేను కోరుకోకుండానే తెల్సింది. అలా మిమ్మల్ని గురించి నాకు మీరు చెప్పకుండానే అంతా తెల్సిపోయింది. కానీ మీకే నన్ను గురించి ఏమీ తెలియదు.

నేను ధనవంతుడిని కాను. మరీ బీద వాడినీ కాను. మధ్యతరగతి మనిషిని. చదువుంది. ఉద్యోగం దొరుకుతుంది. భార్యను ఆడంబరాలకు పోకుండా సుఖ పెట్టగల శక్తి నాకు ఉందని నా నమ్మకం.

అందుచేత మీకు నేనెవరో తెలియక పోయినా ధైర్యం చేసి ఈ ఉత్తరాన్ని రాస్తున్నాను.

మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మీ కుటుంబ చరిత్ర అంతా తెల్సికూడా మిమ్మల్ని భార్యగా పొందాలని కోరు కొంటున్నాను. అందుకు నా పెద్దల నుంచి ప్రతిఘటన ఉంటుందని నాకు తెల్సు. అయినా వాళ్ళకు నచ్చచెప్పగల సన్న ధైర్యం నాకు వుంది.

ఇది నా వైపు కథ...నా నిర్ణయం.

ఇక మీ వెపు నుంచి నిర్ణయం వెంటనే ఎలా కోరను? నన్ను మీరు చూడనైనా లేదుగా?

కానీ ఈ ఉత్తరం చదివేక మీకు నా మీద ఏమాత్రం మంచి అభిప్రాయం కలిగినా రేపు కాలేజీకి నెమలికంఠం రంగు చీరె కట్టుకొని వస్తారు. ఎందుకు? ఆ చీరె కట్టుకున్నప్పుడు మీరు నా కంటికి చాలా చాలా చాలా...అందంగా కన్పిస్తారు కనుక.

—శ్రీహర్షవర్ధన

పి.యస్. :ఈ ఉత్తరం రాసి వారం రోజులయినా పోస్ట్‌చేయలేకపోతున్నాను. భయమా? బిడియమా? ఏమో?'

ఆమె ఉత్తరాన్ని ముగించి నిండుగా నవ్వుకొంది.

ఆ రాత్రి నిద్రలో అన్నీ కలలే!

* * *

సూర్యకాంతం అమ్మమ్మ అమ్మ ఆ ప్రాంతంలోని పిల్లజమిందారుల ఆస్థాన నర్తకి. రాజాదరణలో సకలభోగాలను అనుభవించిందని చెప్పుకుంటారు. ఆమె అందచందాలకు భ్రమిసో లేక ఆమె నాట్యానికిమురిసో, జమీందారుగారు ఆమె పట్ల ప్రత్యేక అభిమానం చూపేవారనీ, ఆమెకు బోలెడంత ఆస్తిని ఇచ్చిపోయారనీ చెప్పుకొంటుంటారిప్పటికీ!

ఫలితంగా సూర్యకాంతం అమ్మమ్మకు నృత్యం చేయాల్సిన అవసరం లేకుండానే కాలం గడిచిపోయింది. తల్లి ఇచ్చి పోయిన ఆస్తిని ఓ జమీందారిణిలా విలాసాలకు ఖర్చు చేసి పారేసింది.

ఆమె కూతురు పేరు పారిజాతం.

పారిజాతం కాలం నాటికి జమీందారుల భోగాలు తగ్గేయి. జమీందారుల ఆశ్రయం లేకుండానే స్వీయప్రతిభతో పారిజాతం గొప్ప నర్తకిగా పేరు పొందింది. ఆమె మేజువాణీ కడ్తే జనం విరగబడేవారు. రూపాయల వర్షం కురిసేది. నృత్యం, సంగీతాభినయాలలో ఆమె నిధిగా చెప్పుకునేవారు.

ఆ పారిజాతం కూతురే సూర్యకాంతం. వృత్తిధర్మంగా, కుల సంప్రదాయంగా కూతురుకు పదమూడో ఏడు రాగానే పారిజాతం పెళ్లిచేసింది.

ఆరోజు సూర్యకాంతానికి బాగాగుర్తు! ఇల్లంతా సున్నాలు కొట్టేరు. పసుపు కుంకుమలతో అలంకరించారు. పచ్చగా మామిడి తోరణాలు కట్టేరు. కులంలోని

 

పెద్ద ముత్తయిదువులయిన స్త్రీలంతా వచ్చారు. మంగళ వాద్యాలతో ఇల్లంతా ప్రతి ధ్వనించింది

పురోహితుడు మంత్రాలు చదువు తుండగా—

సూర్యకాంతం మెడలో పెద్ద ముత్తయిదువు వొకామె తాళికట్టింది.

ఆమెతలపై అక్షింతలు రాలేయి.

"ప్రాచీనమైన మన వృత్తితో నీకు పెళ్లి జరిగిందే సూరీ! మిగతావారు భర్తను ఎలా గౌరవిస్తారో మనం మన వృత్తిని అలా గౌరవించాలి. తెల్సిందా?"

అర్థం చేసుకొనే వయసుకాదు అపుడు సూర్యకాంతానిది. కానీ కాలక్రమేణా అర్థం చేసుకొంది. ఆ వృత్తిబంధాన్ని పవిత్రంగా ఆరాధించింది.

ఆ రాత్రికి సూర్యకాంతాన్ని అలంకరించి ఓ గదిలోకి పంపేరు.

ఆ గదిలో ఆమె రాకకు నిరీక్షిస్తూ ఓ శృంగార పురుషుడున్నాడు.

ఆ పురుషుడికి ముప్పైఏళ్ళకు పైగా వుంటాయి. సన్నగా, తగుమాత్రం ఎత్తుగా వున్నాడు. అతని మొహం ఏదో తేజస్సుతో వెలిగిపోతున్నది. అతను పట్టు పంచెను కట్టుకొని సిల్కు లాల్చీని వేసుకొనివున్నాడు.

సూర్యకాంతం గదిలో ప్రవేశించగానే అతను లేచి, మెల్లగా ఆమె వద్దకొచ్చాడు. ప్రేమతోనిండిన తియ్యటి మాటలు చెప్పేడు. ఆమెను ఆప్యాయంగా తన కౌగిటిలో పొదివి పట్టుకొని పందిరి మంచం మీదికి తీసుకొచ్చాడు.

అతను తన తొలిపురుషుడని, ఈ రాత్రేకాదు అతను ధనాన్ని చెల్లిస్తున్నంత కాలం అతనితో రాత్రిళ్ళు పంచుకోవాలని, అతనిపట్ల నీతితప్పి ప్రవర్తించ కూడదన్న వృత్తిధర్మం సూర్యకాంతానికి తెల్సు.

అయినా సూర్యకాంతానికి ఆ రాత్రి అతడిని చూడగానే భయం వేసింది.

అతను స్పృశించగానే ఆమె వేటగాడి చేతిలో చిక్కుపడ్డ పిట్టలా గజగజ వణికి పోయింది.

"భయంగా ఉందా సూర్యం? అవును. నువ్వింకా చిన్నపిల్లవి. ఈ అనుభవంలో మాధుర్యం తెల్సుకొనే వయసు రాలేదు" అంటూ అతను ఆమెకు మంచి మాటలు చెప్పేడు. శృంగార విషయాలను పాఠాల్లాగా చెప్పేడు.

"సూర్యం! నేను వివాహితుడిని. అగ్ని సాక్షిగా పెళ్లాడిన నా భార్య పట్లగల నా ధర్మం నాకుతెల్సు. అయినా ఈ రాత్రి ఈ దుశ్చర్యకు ఎందుకు పాలు బడ్డానో తెల్సా? నా భార్య దాంపత్య జీవనానికి అనర్హురాలయింది. నా కామతృప్తికోసం ఆమెను బాధ పెట్టటం భావ్యమా? నాస్థితిని గ్రహించిన నాభార్యే నన్నీపనికి ప్రోత్సహించింది".

సూర్యకాంతానికి ఇప్పుడు భయం పోయింది. అతనిపై ఆరాధన పెరిగింది.

"నువ్వు నాకు భార్యవికావు. కానీ నీకు నేనుభర్తనని నాకుతెలుసు. నీపట్ల నాకు ఓ ధర్మంవున్నదని తెలుసు. ఆ ధర్మాన్ని విస్మరించి పశువులా ప్రవర్తిస్తానను కొన్నావా సూర్యం? లేదు. నీ శరీరం, మనసు పక్వమయేటంతవరకు మనిద్దరం స్నేహితులం. కామేచ్ఛ కూడా ధర్మబద్ధంగా వుండాలి సూర్యం."

ఆ రాత్రి సూర్యకాంతం అతను చెప్పిన కథలు వింది. శాస్త్ర ధర్మాలు వింది.

అతను ఎంతటి పండితుడు? ఎంత వున్నతుడు? ఎంత మాటకారి?

అతను వున్నత కులజుడు. ధర్మిష్ఠి. నధవంతుడు!

అతని పేరే విద్యాపతి!

ఆలా క్రమంగా విద్యాపతి పట్ల సూర్య కాంతానికి గౌరవం పెరిగింది. గౌరవం అనురాగంకింద, అనురాగం ప్రేమ కింద మారింది.

వారి ప్రేమ ఫలమే లత!

"లత న్యాయసమ్మతంగా నీ కూతురు సూర్యం! కానీ ధర్మసమ్మతంగా నా కూతురుకూడా కదా? ఆ ధర్మాధికారాన్ని పుతస్కరించుకొని నిన్నో కోరిక కోరనా?"

"కోరండి"

"లతను వృత్తిలోకి దించకు. కాలాను గుణమైన చదువు చెప్పించు. వివాహం చెయ్యి"

అప్పటికి పారిజాతం పెద్దదయింది.

సంపాదించే శక్తిపోయింది.

పైగా కాలంమారింది. కాలానుగుణంగా అభిరుచులు మారాయి.

సినిమాలు ప్రజా జీవితంలో ప్రధాన భాగమయ్యాయి. సినిమాకల్చర్ ప్రతి రంగాన్ని ప్రభావితం చేయసాగింది.

పారిజాతం నృత్యాలెవరిక్కావాలి?

సూర్యకాంతం మేజువాణీలకు డిమేండు ఎలా వుంటుంది?

నిజానికి సూర్యకాంతానికి పెద్దగా నాట్యంలో విద్వత్తులేదు. తల్లివద్ద రెండు మూడు ఐటమ్స్ మాత్రమే నేర్చుకొంది. వాటిని తల్లిముందు చేసే ధైర్యంలేదు.

జీవనభృతికి అవే ఉపయోగించుకోక తప్పలేదు.

ఇక్కడ ఇలావుంటే మరో పక్క విద్యాపతి ఆర్థికస్థితి మారిపోయింది.

సూర్యకాంతం తను మేజువాణీల మీద బతకలేనని గ్రహించింది.

వృత్తిధర్మాన్ని ఆశ్రయించింది.

ఆమెకు కొడుకు పుట్టేడు. పెరిగేడు. తండ్రి ఎవరో?

కొడుకు పేరు రవి. చిన్నప్పటి నుంచీ అతను ఆవేశపరుడే!

రవికి తల్లి అంటే కోపం— అసహ్యం. అక్క లత అంటే వొళ్ళుమంట. ఆ ఇల్లు అతనికో మురికికూపంలా తోస్తుంది. ఆ ఇంటికివచ్చే కస్టమర్స్‌ని గొంతు పిసికి చంపాలన్న ఆవేశంతో వణికిపోయేవాడు. కొడుకు మనోస్థితిని గుర్తించింది సూర్యకాంతం. అతడిని ఓ రెసిడెన్షియల్ స్కూలుకు చదువు నిమిత్తం పంపింది. బోలెడంత ఖర్చు. అయితేనేం?

సూర్యకాంతం ఆశలన్నీ కొడుకుమీదే. వాడు పెద్దవాడయి పెద్ద ఉద్యోగంచేసి తనని ఉద్ధరిస్తాడని! ఉద్ధరించాలన్న ఆశ!

కానీ రోజుగడిచేకొద్దీ సూర్యకాంతంలో



ఆకర్షణ తరిగిపోసాగింది. వృద్ధాప్య చిహ్నాలు మేకప్ అడుగునుంచి ప్రస్ఫుటంగా కన్పించసాగాయి.

నృత్యకళకు పారిజాతం చేసిన సేవకు గుర్తింపుగా ఏదో అకాడమీ నెలనెలా కొంత భృతి ఇస్తున్నది. కానీ ఆ భృతితో ఇల్లు గడిచేనా ? పారిజాతం మందులకే చాలదే !

కాలానుగుణంగా సూర్యకాంతం కొందరు యువతుల్ని చేరదీసింది.

'గౌరీశంకర్ రికార్డు డాన్సింగ్ కంపెనీ' స్థాపించింది. సినిమా పాటలకు అనుగుణంగా నాట్యం చేయటం నేర్పించింది. నిజానికి అది నాట్యం కాదని ఆమెకు తెల్సు. మేజువాణీలలో తను చేసినదే నాట్యంకిందకు రాదు. ఇక సినిమా పాటల కనుగుణంగా తైతక్కలాడటం నాట్యం ఎలాగవుతుంది?

అయినా జనం కొంతకాలం ఎగబడ్డారు. ప్రోగ్రాంలు వచ్చాయి.

వెనుక తను మేజువాణీలు చేసే రోజుల్లో నాయకురాలు ప్రోగ్రామ్ తర్వాత ఎవరూ అడ్డుబోవలు తొక్కకుండా జాగ్రత్త తీసుకొనేది. ఆమె మాట అందరికీ శిలాశాసనమే ! ఏంచేసినా అంతా ఆమెద్వారా జరగాల్సిందే !

కానీ రికార్డ్ డాన్సింగ్‌లో అలాటి కొలమానాలూ, నియమనిష్టలూ లేవు.

డాన్సు కాగానే కంటికి సదరుగా కన్పించినపిల్లను ఎవరో డబ్బు గలవాడు ఎగరేసుకుపోయేవాడు. అదేమంటే సంపాదించటం చాతనయిన ఆ పిల్ల లేచిపోయేది. కొందరు పిల్లలయితే పర్మనెంట్ ఖాతాదారులను సంపాదించుకొన్నారు.

రికార్డ్‌డాన్సింగ్ ముసుగుతో వ్యభిచారం జరిపించక తప్పలేదు.

పైగా రికార్డ్ డాన్సింగ్ కంపెనీలు కూడా పేటకు వొకటి వెలిసాయి పోటీగా.

కొత్తగా వచ్చిన పిల్లలు సూర్యకాంతం వద్ద డాన్సు నేర్చుకోవటం,కొంచెం పేరురాగానే పురుషులు నిర్వహించే పెద్ద కంపెనీలకు వెళ్ళిపోవటం ఆనవాయితీ అయింది. కొందరయితే పురుషుడి అండ సంపాదించుకొని తామే కంపెనీలు పెట్టుకొన్నారు.

ముసలితనం ముంచుకు వస్తున్నది. ముందుముందు రికార్డ్ డాన్సింగ్‌ల మీదకూడా బతుకు ఈడ్చటం కష్టమవుతుందని సూర్యకాంతానికి తెలుసు. కానీ ఏం చెయ్యగలదు?

సూర్యకాంతానికి తన గతమంతా గుర్తుకువచ్చింది. నిట్టూరుస్తూలేచింది.

'ఆయన కోర్కెను తీర్చగలనా? లతను వృత్తిలో దింపకుండా వివాహం చేయగలనా? అసలు తన కూతురుని వివాహం చేసుకోటానికి ఎవరైనా ముందుకొస్తారా? ఒకవేళ ఎవరైనా ముందుకొచ్చినా, తనను కట్నాలు అడుగుతారు కానీ తనకు డబ్బిస్తారా? డబ్బు లేకుండా కొడుకు చదువు కొనసాగించడం ఎలా?'

ఇలాంటి ఆలోచనలు ఆమెను ఎప్పటినుంచో వేధిస్తున్నా అశోక్‌కుమార్ వచ్చివెళ్లాక ఈ ఆలోచనలు భయాలుగా మారి ఆమెను ఆ రాత్రంతా వేధించాయి.

తెల్లవారబోతుండగా ఆమెకు నిద్ర పట్టింది. అంతలోనే తలుపు తట్టిన శబ్దం!

తలుపు తెరిస్తే పొద్దున్నే ఆ వార్త!

ఆ వార్త విని పిడుగు నెత్తిన పడ్డట్లు ఆమె కుప్పకూలిపోయింది.

* * *

లత ఎర్ర బార్డరు వున్న నెమలి కంఠం రంగు చీరకట్టుకొంది. ఎన్నడూ లేనిది

ఒకటికి రెండుసార్లు మేకప్ సరిచూసు కొంది. నిలువుటద్దంలో తన అందాన్ని చూసుకొంది.

పుస్తకాలు తీసుకొని బయటికి వెళుతుండగా తల్లినుంచి పిలుపు వచ్చింది. సూర్యకాంతం శోకసాగరంలో మునిగి వున్నట్లుగా వుంది.

"ఎక్కడికి వెళ్తున్నావ్ లతా! కాలేజీకి ఇవాళ వెళ్ళవద్దు. కొత్త పెళ్ళికూతురిలా ఆ అలంకరణంతా ఏమిటి?"

''నువ్వలా వున్నావేంటి అమ్మా! కాలేజీకి ఎందుకు వెళ్ళకూడదు?"

''ప్రశ్నలు వద్దు. నేను చెప్పినట్లు చెయ్యి"

తల్లిని ప్రశ్నలు వేసే అలవాటు లతకు మొదటినుంచీ లేదు. తల్లి స్థితిగతులు ఆమెకు తెలుసు. తనస్థితి, కోరికలు, ఆదర్శాలూ ఆమెకుతెల్సు. తల్లి జీవితవిధానం తనకు నచ్చనంత మాత్రాన, మరో మార్గం చూపకుండా ప్రతిఘటించి లాభమేమిటి?

లోపలకి వెళ్లి అలంకారాన్ని తీసేసింది.

శ్రీహర్షవర్ధనుడే ఆమె కళ్ళల్లో మెదిలాడు.

తనకోసం ఎంత ఎదురు చూస్తుంటాడో పాపం?

అయినా మరో పదిరోజులదాకా ఆమె ఇల్లు వదిలే వీలులేకపోయింది. ఈలోగా తల్లి మాటల ద్వారా తను తండ్రిని పోగొట్టుకొన్నట్లు తెలుసుకొంది.

"ఎవరమ్మా మా నాన్న ?"

విద్యాపతి రోజూ యింటికొచ్చినా ఎన్నడూ లతకు ఆయన్ని తండ్రిగా చెప్పలేదు. విద్యాపతికూడా లతతో మాట్లాడలేదు.

బతికివున్నంత కాలం తండ్రి ఎదురుగ్గానే ఉన్నా చెప్పని మనిషి చనిపోయాక చెప్తుందా ?

తండ్రి ఎవరో తల్లి చెప్పనందుకు విచారించలేదు లత. కానీ ఆయన తాళికట్టిన భర్త అయినట్లు తల్లి బొట్టు చెరిపేసుకోవటం, అలంకరణలు మానెయ్యటం, పదిరోజులు ఇంట్లో మైల పాటించటం ఇత్యాది చూసి సంతోషించింది. తల్లిపట్ల ఆమె భక్తి పెరిగింది. మనసు ఆర్ద్రమయింది.

పది రోజులు దాటిపోయాక, ఆరోజు కాలేజీకి బయలుదేరింది.

ఎందుకో ఆమెకు నెమలి రంగు చీరె కట్టుకొని అలంకరించుకోటానికి మనసు అంగీకరించలేదు.

నిరాడంబరంగా, కాలేజీ యూనిఫాంలో ఆనాడు బస్సు దిగింది.

అశోక్‌కుమార్ గ్రూప్ ఆనాడు రాలేదు. ఎవరో కొందరు మైనర్ హీరోలు ఆమె వెంటబడ్డారు. సర్దాగా ఆమెను గురించి ఏమేమో అనుకొంటూ ఆత్మానందాన్ని పొందుతున్నారు.

ఆమె వాళ్ళ అవాకు చవాకుల్ని పట్టించుకోలేదు. ఆమె దృష్టి అంతా శ్రీ హర్ష కోసం వెతుకుతోంది.

శ్రీహర్ష దూరం నుంచి ఆమె రాకను చూశాడు. నీరుకారిపోయాడు.

ఆమెకు తనంటే ఇష్టంలేదు. అందుకే ఉత్తరం అందుకొన్న పదిరోజులక్కాని బయటకురాలేదు. ఇవాళ వచ్చినా తను కోరిన డ్రస్ వేసుకురాలేదు.

అంటే ఏమిటి ?

తనపట్ల ఆమెకు ప్రేమభావం లేదు. ఇక తను ఆమెను ఎంత ఆరాధించి ఏం లాభం?

అతను నిరాశతో వెనక్కి తిరగ

పోతూ ఆఖరిసారిగా ఆమెను చూశాడు.

సరిగ్గా ఆ సమయంలో లత అతన్ని చూసింది. ఇద్దరి కళ్ళూ కలుసుకొన్నాయి. వెనుదిరిగిపోదామనుకున్న అతను ఆమె వెంట నడిచాడు.

అంతే! ఆ తర్వాత ఇద్దరూ మనసులు విప్పిమాట్లాడుకోటానికి ఎంతో ప్రయత్నం అవసరంలేకపోయింది.

"నా కుటుంబ చరిత్ర అంతా తెలుసు కొని నన్ను వివాహం చేసుకోటానికి మీరు ముందుకు రావడం నా అదృష్టం హర్ష్" అనగలిగింది.

ఆ తర్వాత మనసులు ఎంత దగ్గర యినా శ్రీహర్ష శారీరకంగా ఆమెకు చాలా దూరంగా మెలిగేవాడు.

అతని బిడియాన్ని చూస్తుంటే ఆమెకు ముద్దొచ్చేది. నవ్వొచ్చేది. జాలివేసేది. పరాచకాలు చేసేది.

అతని నిగ్రహాన్ని , ఎన్నోసార్లు పరీక్షకు పెట్టి ఆశ్చర్యపోయింది. అతని లోని ఆ నిగ్రహశక్తే ఆమెను ఎన్నో సార్లు వివశురాలిని చేసింది. అలాంటి పురుషుడిని భర్తగా పొందటం అదృష్టం కదూ?

"లతా! నా చదువు ఈ ఊళ్ళో అయి పోయింది. ఇక మనం త్వరలో పెళ్ళి చేసుకోవటం అవసరం. మా గ్రామానికి వెళ్ళి తల్లిదండ్రులతో చెప్పి పెళ్ళికి ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు.

అతనా ఏర్పాట్లు చేస్తాడు. సమర్థుడే. సందేహం లేదు.

"హర్ష్! నాదో కోరిక. నువ్వు వెళ్ళే లోగా మా ఇంటికి ఓసారి వచ్చి మా ఆతిథ్యాన్ని తీసుకోవాలి. మా అమ్మకు నిన్ను పరిచయం చేస్తాను."

"ఓ యస్! అంతకన్నానా? ఎపుడు రమ్మంటావో చెప్పు"

"నువ్వు వెళ్ళబోయే ముందు రోజు"

సూర్యకాంతం కాబోయే అల్లుడిని చూసి సంతోషించింది. మర్యాదలు చేసింది.

"బాబూ! నా కూతురని గొప్పలు చెప్పుకోటంకాదు. అది సద్గుణవంతురాలు. దానికి నీలాంటి ఉన్నతుడు భర్తగా లభిం చటం దాని పూర్వజన్మ సుకృతం. దాని తండ్రి ఆశీస్సు ఫలం"

భోజనాలు అయ్యాయి.

వెళ్ళానంటూ లేచాడు శ్రీహర్ష.

రాత్రి తొమ్మిది గంటలు!

కుంభపోతగా వర్షం!

పెనుగాలి!

"ఎలా వెళ్తావు బాబూ? గాలీవానా.."

"ఫర్వాలేదండీ. ఎలాగోలాగు రూమ్‌కి వెళ్తాను. రేపు పొద్దునే ఊరికి వెళ్ళాలి గదా?"

"పోనీ ఈ రాత్రికి ఇక్కడే పడుకో రాదూ? పొద్దున్నే వెళ్ళవచ్చు"

మెరుపులు...ఉరుములు... 'జయ్' మని గాలి

"వద్దండీ ! పెళ్ళికాకముందే అత్త వారింట్లో పడుకోటం మంచిది కాదు"

సూర్యకాంతం నవ్వింది.

"అదా నాయనా నీ సందేహం! నీకు వేరే గది ఏర్పాటు చేస్తానుగా? అలాంటి శంక పెట్టుకోకు"

"ప్లీజ్ శ్రీహర్ష్! అమ్మమాట విను. ఈ వర్షంలో నువ్వు వెళ్ళటం నాకిష్టం లేదు" అర్థింపుగా అంది లత.

"ఆల్‌రైట్! కానీ తెల్లవారు జామునే నేను వెళ్ళిపోతాను. మిమ్మల్నెవరినీ

అప్పుడు డిస్టర్బ్ చేయను సరేనా"
"ఓకే!"




ఆ రాత్రంతా వాన కురుస్తూనే వుంది.

అర్ధరాత్రి అయినా లతకు నిద్ర పట్టలేదు. గదిలో ఒంటరిగా మంచం మీద పడుకొని వుంది.

కళ్లు తెర్చుకొని ఉంది. కళ్ళ ముందు సన్నని బెడ్‌రూమ్ లైట్ కాంతి. సీలింగ్‌కు ఫాన్. గోడలకి రాధామాధవుల లేపాక్షి చిత్రం.

ఏవేవో ఆలోచనలు! పక్కకు పొర్లింది. ఈ పక్కకు ఆ పక్కకు మార్చి మార్చి పొర్లింది. పక్కమీద బోర్లా పడుకొని దిండు గుండెలకింద పెట్టుకుని కిటికీలో నుంచి చీకట్లో కురిసే వానను కాసేపు చూసింది. వెల్లకిలా పడుకుని సీలింగ్ ఫాన్ తిరుగుతుంటే తదేకంగా దాని అందాన్ని చూసింది.

ఎంతకీ నిద్ర రాదేం? గుండెల్లో ఏదో కోరిక! మనసంతా ఏదో మధురానుభూతి. శ్రీహర్ష తన గదిలో ఏం చేస్తున్నాడో?

ఆమె పక్క మీద నుంచి లేచింది. టేబిల్ గడియారంలో గంట పదకొండున్నర చూపిస్తోంది.

మెల్లగా తలుపు తీసుకొని బయటికొచ్చింది. చలిగాలి రివ్వున వీచింది. ఒంట్లో వేడికి ఆ చల్లగాలి హాయిగా ఉంది.

శ్రీహర్ష గదిని సమీపిస్తుంటే ఆమె కాళ్లు వణికాయి. గుండె వేగంగా కొట్టుకొంది.

తలుపు మీద చెయ్యి వెయ్యబోతూ ఆగింది.

కిటికీ తలుపులు తెరిచే వున్నాయి. కిటికీలో గుండా లోపలికి చూచింది.

శ్రీహర్ష బెడ్ మీద పడుకొని నిద్ర పోతున్నాడు. బెడ్‌లైట్ కాంతిలో అతని మొహం అందంగా మెరుస్తోంది. వంకులు తిరిగిన నల్లటి వెంట్రుకలు ఫానుగాలికి పచ్చటి మొహం మీద పడి మెల్లగా నాట్యం చేస్తున్నాయి. టేబిల్ మీద తను పెట్టిన పాలగ్లాసు ఖాళీగా ఉంది.

చలిగావుందేమో భుజం వరకు దుప్పటి కప్పుకొని వున్నాడు.

శ్రీహర్ష పురుషుడై ఉండి ఎంత నిగ్రహాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఆ నిగ్రహంలో ఎంత హుందాతనం వుంది?

ఆమె వెనక్కి తిరిగింది. గదిలోకి వచ్చింది.

అపుడు సరిగ్గా పెద్దముల్లు, చిన్నముల్లు పన్నెండు పైన కలిసేయి.

శరీరంలోని వేడి ఒక్కసారిగా ఆవిరి అయినట్లు అంతర్ధానమయిపోయింది. టేబిల్ మీది గ్లాసులో పాలు తాగేసింది. అయినా చలి...చలి...చల్లనిచలి... మధురమైన చలి...మైకంకల్పించే చలి!

కిటికీ తలుపులు మూసింది. వాకిలి తలుపు మూసింది. ఫాన్ కట్టేసింది. కళ్లు మూసుకొంది. క్షణంలో నిద్రపట్టేసింది ఆమెకు.

కొన్ని గంటల తర్వాత ఆమె ఎవరో లేపినట్లు వులిక్కిపడి లేచింది.




శరీరమంతా ఏదో మధురానుభూతికి లోనయినట్లు ఫీలింగ్! మత్తులోనుంచి లేచినట్లు లేచింది.

లేచి లైటు వేసింది.

లైటువేసూ గమనించింది.

సీలింగ్ ఫేను తిరుగుతోంది.

తను ఆర్పేసిన ఫాను ఎలా తిరుగుతోంది?

అంతలోనే ఎదురుగ్గావున్న నిలువుటద్దంలో తన బొమ్మను చూసుకొంది. వెంటనే ఉలిక్కిపడి తనని తాను చూసుకొంది!

జాకెట్ హుక్స్ ఊడివున్నాయి. బ్రాహుక్కులు కూడా తొలగించబడి వున్నాయి! పక్కమీద దుప్పటి బాగా నలిగివుంది!

ఆమె కంగారుగా పైటను భుజాల చుట్టూ నిండుగా కప్పుకుంది.

అప్పుడు గమనించిందామె!

తలుపులు బార్లాగా తెరచివున్నాయి!

పడుకోబోయేముందు తలుపులు వేసిందే! ఎలా తెర్చుకొన్నాయి?

ఆమె కంగారుగా బయటికొచ్చింది.

ఇంకా వర్షం కురుస్తూనే వుంది. అయితే తెలతెలవారనున్న చిహ్నాలు వాతావరణంలో కన్పిస్తున్నాయి.

ఆమెకు అనుమానం వచ్చింది.

ఎవరో తన గదిలోకి వచ్చారు! తనకి ఏదో జరిగింది!

ఎవరు వచ్చారు? ఏమిటి జరిగింది?

ఆమె దాదాపు పరుగెత్తుతున్నట్లు శ్రీహర్ష గదివద్దకెళ్ళింది. అతని గది తలుపులు తెర్చేవున్నాయి.

అతని పక్కమీద ఓ కాగితం రెపరెపలాడుతోంది.

'డియర్ లతా!

చెప్పకుండా వెళ్తున్నాను. అని కోపగించుకోకు. మగవాడు చెప్పకుండా చేసే పనులు ఎన్నో వుంటాయి. నీకు చెప్పకుండానే నిన్ను పెళ్ళిచేసుకోటానికి హఠాత్తుగా వస్తాను. ఎప్పుడోకాదు-త్వరలోనే! అందాకా మధురానుభూతుల్ని మననం చేసుకొంటూ కాలంగడుపుదాం. ఓకే...

విత్ కిసెస్...శ్రీహర్ష'

శరీరమంతా ఎవరో పురుషుడు ముద్దులతో ముంచేస్తున్న భ్రమ! ఇది భ్రమా? సత్యమా?

భ్రమే అయితే తనగది తలుపులు ఎవరు తెర్చేరు?

ఫాను ఎవరు వేసేరు?

పక్కంతా అలా ఎందుకు నలిగిపోయింది?

తన జాకెట్...?

అసలు శరీరమంతా ఈ మధురానుభూతి ఏమిటి?

ఆమె గడియారంలో టైమ్ చూసింది. సరిగ్గా నాలుగు గంటలయిందప్పుడు!

* * *

శ్రీహర్షనుంచి ఉత్తరంకోసం రోజూ ఎదురుచూసి చూసి విసిగిపోయింది లత.

ఏదో టెన్షన్...అనుమానం!

చదువు సాగటంలేదు. అసలు ఏ పనిపైకి మనసు లగ్నం కావటంలేదు.

అతని చిరునామాకు ఉత్తరాలు ఎన్ని రాసిందో! ఒక్కదానికీ సమాధానం ఇవ్వడేం? చెప్పకుండా హఠాత్తుగా రావాలనా?

అయితేమాత్రం? ఒక్క ఉత్తరం రాస్తే ఏంపోతుంది?

"ఆ అబ్బాయి మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళాడు. ఇంకా రాలేదేమే?"

సూర్యకాంతం గృహపరిస్థితి మరింత క్షీణించింది.

విద్యాపతి చనిపోయాడన్న దిగులు వల్లో, దారిద్ర్యం తెచ్చిన దిగులువల్లో కాని ఆమె ఆరోగ్యం చెడిపోయింది. రికార్డు డాన్సులు నేర్పిన అమ్మాయిలంతా ఒక్కొక్కరూ ఆమెను వదిలివేశారు. ఆఖరికి స్టెప్స్ అన్నా రాని లక్ష్మికూడా ఎవడితోనో వెళ్లిపోయింది.

కీడులో మేలన్నట్లు పారిజాతం ఓ రోజు నిద్రలోనే శాశ్వతంగా కళ్లు మూసింది.

డబ్బుకు అసలే కటకటగా వుంటే, రవి చీటికీమాటికీ డబ్బు కావాలంటూ ఉత్తరాలు రాయసాగాడు.

ఎలా పంపటం? ఇల్లు ఎలా ఈడ్చటం?

"అమ్మా! పోనీ కొంతకాలం నేను ఉద్యోగం చేస్తానే" లత తల్లి బాధ



గమనించి అంది ఒకరోజు.

సూర్యకాంతానికి చదువు లేకపోయినా లోకానుభవం పుష్కలంగా వుంది. కూతురి ఆలోచనకు నవ్వు వచ్చింది.

ఉద్యోగాలు ఊరికే బజార్లో పడున్నాయా?

ఒకవేళ ఎలాగోలాగ ఏటో ఉద్యోగం చిక్కినా ఎంత ఆదాయం వచ్చేను?

పెళ్ళికానిపిల్ల ఉద్యోగం చేస్తుంటే పురుషులు ఊరుకొంటారా? అందులోనూ దేవదాసీ కులంలో పుట్టినపిల్ల!

ఆకర్షణలు చూపి లొంగదీసుకోరూ?

చాలామంది మధ్యతరగతి ఆడపిల్లల కథలు ఇవేగా!

అప్పుడు వ్రతం చెడుతుంది. ఫలం దక్కదు.

వృత్తిధర్మంగా తప్పయిన పని, ఉద్యోగం అన్న కొత్త ముసుగులో చేస్తే గొప్ప అవుతుందా?

అలా ఎంతో ఆలోచించింది సూర్యకాంతం.

లతను 'కులవృత్తి'లోకి దించితే?

లతకు చదువుంది. అందం వుంది, నృత్యం వచ్చు.

ఎవరో ధనవంతుడికి కన్నెరికం చేసి అతని ఆదరంతో నాట్య విద్యాలయం లాంటిది పెట్టి నృత్య ప్రదర్శనలు ఇప్పిస్తే?

అటు కీర్తికి కీర్తి, సంఘంలోమర్యాద, గౌరవాలు. ఇటు డబ్బుకు డబ్బు! అదృష్టం బాగుండి ఛాన్సు తగిలితే సినిమా స్టార్...!

"అమ్మా! ఇలా ఎందుకు ఆలోచిస్తున్నావు నువ్వు? ఆడదానికి వివాహం తర్వాతే కీర్తి, ధనం, గౌరవ మర్యాదలు అన్నీనూ. మన కులంలో స్త్రీలకు వివాహం కావటం కష్టం. శ్రీహర్ష తనుగా



తాను నన్ను ప్రేమించి పెళ్లి చేసుకొంటా నన్నాడు. నాకు జీవితంలో అన్నిటికన్నా ముఖ్యమైనది పెళ్లి. నేను అమితంగా కోరుకొనే పెళ్లి చేసి నా కోరిక ఎందుకు తీర్చవు? నీ అవసరం కొద్దీ పాతధోరణిలో ఎందుకు ఆలోచిస్తావు? నా కోసం కొంత కాలం ఓపికపట్టమ్మా"

సూర్యకాంతం మరోనెల ఓపికపట్టింది.

గృహపరిస్థితి మరింత క్షీణించింది. రవి డబ్బుకోసం దబాయించి రాస్తు న్నాడు. అశోక్‌కుమార్ ఆశలు పెట్ట సాగాడు.

లతకు శ్రీహర్షనుంచి జవాబు రాలేదు.

'అందరిలాగా ఇతనూ మోసగాడు కాదుగదా ?' ఆమెను భయం ఆవహిం చింది.

"అమ్మా... లతా! నేను ఆడదాన్ని. పెళ్లి చేసుకోవాలన్న నీ కోరికను నేను అర్థం చేసుకోగలను. నీ తల్లిగా నాకు అంతకన్నా కావల్సిందేముంది? నా కోరికా అదే. కానీ... ఒక్క విషయం చెప్పు. అమ్మ మొహం చూసి నిజం చెప్పాలి. మీ ఇద్దరి మధ్య పరిచయం ప్రేమ వరకేనా లేక ఇలాంటి చాలా కథల్లోలాగా ఇంకా ముందుకు వెళ్ళిందా?"

"శ్రీహర్ష నువ్వు అనుకొంటున్నటు వంటివాడు కాదమ్మా ! అతను చాలా మంచివాడు. నిగ్రహశక్తి వున్నవాడు. మా ప్రేమ శారీరక సంబంధాల వరకు వెళ్ళలేదు" ఆవేశంగా అంది లత.

తీరా అనేసాక—

ఆనాటి సంఘటన గుర్తుకొచ్చింది.

ఆ మధురానుభూతి...ఆ పులకింత.. ఆ మత్తు...!





"అతను మంచివాడే కావచ్చునమ్మా! కానీ లోకం అంత ఎత్తుకు ఎదగలేదు. ఆ వాస్తవాన్ని గుర్తుంచుకోమ్మా! అతను తిరిగివచ్చి నిన్ను పెళ్లి చేసుకొంటాడని నాకెందుకో అనిపించటంలేదు"

'నాకు అనిపిస్తోంది. అతను తప్పక తిరిగి వస్తాడు' అని చెప్పాలన్న కోరిక కలిగింది లతకు. కానీ చెప్పే ధైర్యం రాలేదు.

"సరే! నీకు కావల్సింది వివాహమే కదా? నేను చేస్తాను. సరేనా?"

సూర్యకాంతం కూతురు పెళ్లికి ప్రయత్నాలు ఆరంభించింది! అవమానాలు... ఛీత్కారాలు... తిరస్కారాలు...

ఎన్నో అయ్యాక అశోక్‌కుమార్ ఆమెవద్దకొచ్చాడు.

"ఒకరోజు నీ కూతుర్ని పెళ్లి చేసు కోమంటే నాకు కోపం వచ్చింది. ఇవాళ నీ కూతుర్ని పెళ్లి చేసుకొంటానంటూ నేనే ముందుకొచ్చాను. ఏమంటావ్?"

ఏమనగలదు సూర్యకాంతం?

"కానీ ఒక్క కండిషన్. మా పెళ్లి రహస్యంగా జరగాలి. కొంతకాలం రహస్యంగా ఉంచాలి. లేకపోతే మా నాన్న నాకు ఆస్తి ఇవ్వడు. ఆస్తి చేతికొచ్చాక ఈ రహస్యం బయటికొస్తుంది"

"నా కూతురు మెళ్లో మీరే తాళికడ్తారుగా?"

"ఊ...కానీ కట్నం అడగకుండా కడ్తాను. కానీ ఆపెళ్ళి తంతు అంతా నీ ఇంట్లో గుట్టుగా జరగాలి. ఆర్భాటాలు, ఆడంబరాలు వుండకూడదు. తెల్సిందా?"

బేరసారాలయ్యాయి. ఒప్పందాలు కుదిరాయి.

విషయాన్ని సూర్యకాంతం లతతో

చెప్పింది.

లత ఆరంభంలో తిరగబడింది. మొండికేసింది. హఠంచేసింది.

"అతనికేమమ్మా లతా! రూపం తక్కువా? కులం తక్కువా? ధనం తక్కువా? సిద్ధాన్నాన్ని వదులుకొని లేనిదాన్ని వెతుక్కోటం, మనకు కానిదాన్ని ముట్టెత్తుకోటం, తెలివి తక్కువకదూ?"

'అతనికి అన్నీ వుండవచ్చునమ్మా! కానీ లేనిది గుణం, అని అరవాలనుకొంది లత.

కానీ అరవలేదు. సూర్యకాంతం అతడిని గురించి చెప్పగా చెప్పగా ఆమె మనసు మూగదయిపోయింది!

ఆరోజు ఉదయం——

ఆ ఇంట్లో మంగళవాద్యాలు మోగేయి.

సూర్యకాంతానికి ముఖ్యులయిన కొందరు ముత్తయిదు స్త్రీలతో ఇల్లు కళ కళలాడుతోంది.

అశోక్‌కుమార్‌కి, అతని మిత్రులకి ఆ ఇంట్లోనే విడిది ఓ పక్కగా ఏర్పాటు చేసేరు.

రాత్రి తొమ్మిదిగంటలకు ముహూర్తం.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి.

అంతా నడుములు వాల్చి కాస్సేపు కళ్ళు మూసేరు.

లతకు నిద్రపట్టలేదు. అసలు పక్క మీద పడుకోబుద్ధి పుట్టలేదు. అది ముళ్ళ పానుపులాగావుంది.

అశోక్‌కుమార్...శ్రీహర్ష!

శ్రీహర్ష ఆమెకు నచ్చేడు. అతను తన భర్త అవుతాడనుకొంది!

అశోక్‌కుమార్ అంటే ఆమెకు ఎందుకో అసహ్యం వేసింది. అతను తన భర్త అవుతున్నాడు.

కానీ అతను తనను నిజంగా ప్రేమిస్తున్నాడా? పోనీ పెళ్ళి అయ్యాకన్నా ప్రేమించగలడా? లేక ఇదంతా మోసమా?

భావనామాత్రంగానే ఆమెకు శరీరమంతా చమటపోసింది. గుండె దడదడలాడింది. బ్లడ్ ప్రెషర్ పెరిగినట్లయింది.

ఫాన్ వేసింది. అయినా శరీరంపైన ఏదో బరువు...!

జాకెట్టు వూడగీసింది. అలంకరణలను తీసేసింది.

అతను తనను ప్రేమించటం సంగతి సరే—

తాను అతడిని ప్రేమించగలదా?

పెళ్ళిచేసుకొన్నాక ప్రేమించితీరాలి. అది ధర్మం.

అయినా అశోక్‌కుమార్‌కు ఏంతక్కువ? అందగాడు. ధనవంతుడు. పెళ్ళిచేసుకోటానికి అంగీకరించాడంటే తనను ప్రేమించే వుండాలి.

తను శ్రీహర్షను మర్చిపోవాలి.

మనసా వాచా కర్మణ్యా అశోక్‌కుమార్‌ని ప్రేమించాలి!

తలుపుతట్టిన చప్పుడయింది.

"ఎవరూ?"

లత లేవబోయింది. పమిట జారింది.

ఎదురుగ్గా అశోక్‌కుమార్! తలుపు తెర్చేవుంది.

"హాయ్...బ్యూటీ!"

అశోక్‌కుమార్ తలుపువేసేడు.

జేబులోనుంచి 'త్రీ ఫైవ్స్' సిగరెట్ పాకెట్ తీసి ఓ సిగరెట్టు వెలిగించాడు.

"సినోటికి వేసుకొన్న 'సీల్'తో సహా అన్నిసీల్స్‌ను నేను విప్పుతానని ఓ రోజు మా ఫ్రెండ్స్‌తో అన్నాను. అందులో ఓ సీల్ నేను విప్పకుండా నువ్వే విప్పేసుకూర్చున్నావు!"

అతను ఆమె దగ్గరికొచ్చాడు.

నోటినుండి సిగరెట్టు పొగ పీల్చి ఆమె మొహంమీదికి ఒక్కసారిగా వదిలేడు.

లతకు వుక్కిరిబిక్కిరి అయినట్లయింది. ఊపిరి ఆడలేదు. దగ్గువచ్చింది.

అశోక్‌కుమార్ ఆమె అవస్థచూసి నవ్వుతున్నాడు.

నవ్వుతూనే రెండోసారి ఆమె మొహం మీదికి పొగ వదిలేడు.

ఆమె నిలవలేనట్లు మంచం మీద కూలబడింది. ఆ కూలబడటంలో ఆమె పమిట తొలగింది.

"హాయ్ ఆఫ్ నేకెడ్ బ్యూటీ! నీ అందానికి వస్త్రాపహరణ సమయం దగ్గరికొచ్చిందిలే" అంటూ మూడోసారి ఆమె మొహంమీదికి సిగరెట్టు పొగ వదిలేడు.

లతకు తలతిరిగినట్లయింది. మైకం ఆవహించినట్లయింది. అలాగే పక్కమీద వాలిపోయింది.

స్పృహ తప్పుతుండగా ఆమెకు అశోక్‌కుమార్ నవ్వు నూతిలో నుంచి వచ్చినట్లు విన్పించింది...!

* * *

తిరిగి లతకు స్పృహ వచ్చేసరికి—

తలుపులు ఎవరో దబదబా బాదుతున్న శబ్దం విన్పించింది.

చివాలున మంచంమీదనుంచి లేచింది.

ఎదురుగ్గా అద్దంలో ప్రతిబింబం వెక్కిరించింది!

వక్షోజాలకు ఆచ్ఛాదనలేదు. చీరె నలిగి వుంది. బొట్టు చెదిరిపోయివుంది. జుట్టు చెల్లాచెదురుగా వుంది.

అరె!

బుగ్గమీద ఆ గంటేమిటి?

"లతా! తలుపు తియ్యవే?"

 

తలుపు...తలుపు...!

ఆమె తలుపు దగ్గరకు నడిచింది.

అప్పుడు ఆమెకు గుర్తుకొచ్చింది.

తను స్పృహతప్పి పడిపోయేముందు తలుపు తెరిచేవుంది. తెరుచుకొని అశోక్ కుమార్ లోపలికొచ్చాడు.

అశోక్‌కుమార్ గదిలో వుండగానే తనకు స్పృహతప్పింది. మరి అతను ఏడీ?

ఆమె కళ్లు గదినంతా వేగంగా కలియజూసేయి.

అశోక్‌కుమార్ గదిలో లేడు. తన పక్క నలిగిపోయి వుంది. మరి అతను గది వదిలి వెళ్లాక లోపలి వైపు తలుపు ఎవరు వేసేరు? అతను ఎప్పుడు వెళ్లేడు? ఎలా వెళ్లేడు?

కిటికీ వూచలు అవీ సరిగానే వున్నాయే? ఆ గదిలోనుంచి వెళ్లటానికి మరో మార్గం లేదే?

ఆమె భయంభయంగా ఆలోచిస్తూనే తలుపు తీసింది.

"అదేమిటే! ఆ వేషం ఏమిటి? ఆ మొద్దు నిద్దేమిటి? ఇవాళ నీ పెళ్ళి. ముహూర్తానికి టైమ్ అవుతోంది. త్వరగా తెములు. అలంకరణ చేయాలి"

సూర్యకాంతం లోపలికి వచ్చింది.

ఆమె దృష్టి నేలమీద సగం కాల్చి పారేసిన సిగరెట్టు పీకలమీద పడింది. ప్రశ్నార్థకంగా లత వైపు చూసింది.

"అదే... అతను ...అశోక్‌కుమార్ వచ్చాడు"

"ఎప్పుడు?"

"దాదాపు రెండు గంటలప్పుడను కొంటా"

"వచ్చి...?"

ఏం చెప్పగలదు సమాధానం? కానీ ఏదో చెప్పక తప్పదుగా? నిజమే చెప్తుంది. ఏం?

సరిగ్గా ఆ సమయంలో సూర్యకాంతం దృష్టి నేలపైన ఉన్న మరో పదార్థం పైన పడింది.

"అదేమిటే! అసలేం జరిగింది? అతనేం చేసేడు?" సూర్యకాంతం ఆత్రంగా అడిగింది.

లత దృష్టి సూర్యకాంతం దృష్టిని అనుసరించి వెళ్ళి నేలమీదనున్న ఆ పదార్థం పైన పడింది.

ఆ పదార్థాన్ని చూడగానే ఆమె వెన్నెముకలో హఠాత్తుగా వణుకు ప్రారంభమయింది. భయంతో ఆమె మనసు బిర్రబిగుసుకు పోయింది!

*   *   *

అసలేం జరిగింది? ఏం జరిగిందసలు?

ఎంత ఆలోచించినా లతకు సమాధానం దొరకటం లేదు.

ముత్తయిదువలు ఇద్దరు ఆమెను అలంకరిస్తున్నారు. ఒకామె పూలజడ వేస్తోంది. రెండో ఆమె కాళ్ళకు పారాణి పెడ్తోంది.

ఇల్లంతా మళ్ళీ సందడిగా వుంది. రాత్రి భోజనానికి వంటకాలు తయారవుతున్నాయి. ఆ వంటకాల వాసనలు పూల పరిమళంతో, కొత్త చీరెల కొత్త వాసనలతో వచ్చి వింత వాసనలను వెదజల్లుతున్నాయి.

మైకులోనుంచి సినిమా పాటలు విన్పిస్తున్నాయి.

'పందిట్లో పెళ్ళవుతున్నది – కనువిందవుతున్నదీ...' ఎప్పటిదో పాత పాట!

తనకు పెళ్ళవబోతోంది. ఎవరితో?

అశోక్‌కుమార్‌తో–

అతను మధ్యాహ్నం తన గదికి అసలెందుకు వచ్చినట్లు? వచ్చి ఏం చేసినట్లు? ఎలా వెళ్ళినట్లు?

అతని నవ్వు...అతని ప్రవర్తన...

ఛీ...తనకు గిట్టదని తెలిసే సిగరెట్టు పొగ తన మొహం మీదికి వూది ఎలా నవ్వేడు? పశు ప్రవృత్తి! రాక్షసానందం.

అతని ధోరణి ప్రేమికుడి ధోరణిలా వుందా? కాబోయే భర్త భార్యతో అలాగేనా ప్రవర్తించాల్సింది?

అతనిది వక్రబుద్ధి. దుష్ట స్వభావం.

తనమీద పగబట్టేడు. పెళ్ళి పేరిట ఏదో సాధిద్దామనుకొంటున్నాడు. ఏదో ప్రణాళిక వేసేడు.

అతడిని పెళ్ళి చేసుకుని ఆ బంధానికి బద్ధురాలై జీవితాంతం అతని విష కోరల్లో పడి నలిగిపోవాలా?

అలాంటి వాడిని చేసుకొనేకన్నా వృత్తి ధర్మంగా...వద్దు వద్దు... తనకు వృత్తీ వద్దు, ఈ పెళ్ళీ వద్దు...

అవునూ! ఆ రక్తం ఏమిటి?

అతను తననేం చేయలేదుకదా?

ఏం చేసాడు? ఏంచేసి వుండగలడసలు?

"అలంకరణ అయింది. నీ అందాన్ని ఆ అద్దంలో చూసుకోవే లతా! ఎంత ముద్దుస్తున్నావో? ఆడదాన్ని నాకే..." ముత్తయిదువ పరాచకం ఆడింది.

లత తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకొంది.

అలంకరణలో ఆమె జగన్మోహనంగా వుంది.

ఇంత అందం ఆ దురాత్ముడికి అర్పించాల్సిందేనా?

నో... వీల్లేదు.

"కాసేపు విశ్రాంతి తీసుకోవే లతా! రాత్రంతా మళ్ళీ నిద్ర వుండదు. ఊఁ.."

ముత్తయిదువలిద్దరూ తమ జోక్‌లకు తామే నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

అవతల ముహూర్తానికి సమయం ఆసన్నమవుతోంది.

సూర్యకాంతం ఎందుకో తన గది లోకి వెళ్లింది. ఆమె మనసు ఏదో కీడును శంకిస్తోంది.

గదిలో ఇనుప బీరువా తలుపులు తెరిచి వున్నాయి. ఆమె ఆత్రంగా బీరువా లోపలి వస్తువుల్ని చూసింది. పరుగెత్తుకొంటూ అశోక్‌కుమార్ గది వద్ద కెళ్లి తలుపు తట్టింది.

"బాబూ! పొద్దున మీరు 'కన్యాశుల్కం'గా ఇచ్చిన డబ్బును మీ ఎదుటే ఇనుప బీరువాలో పెట్టేను కదా? ఇప్పుడు చూస్తే బీరువా తాళం తెర్చి ఉంది. కానీ..."

"కానీ..."

"అదృష్టవశాత్తు ఏమీ పోలేదు"

"నేనిచ్చిన డబ్బు...?"

"ఆ డబ్బు బీరువాలో పెడ్తే నిలవదేమోనన్న అనుమానం నాకు అప్పుడే వచ్చింది. అంచేత బ్యాంక్‌కి పంపించాను. తాళిబొట్టు కూడా సురక్షితంగానే వుంది. ముహూర్తం టైమ్ అవుతోంది. మీరు రండిబాబూ"

అశోక్‌కుమార్ ఆమె వెనుక నడిచాడు.

పెళ్లిపీటలమీద కూర్చున్నాడు.

మంత్రాలు రాని బ్రాహ్మణుడెవరో కేశవనామాలతోపాటు పిచ్చిమాటల్ని కలిపి మంత్రాలుగా చదువుతున్నాడు.

"అమ్మా! పెళ్ళికూతుర్ని తీసుకొని రండి"

తీసుకురావటానికి వెళ్లిన ముత్తయిదువులు అంతలోనే పరుగెత్తుకుంటూ హడావుడిగా వచ్చారు.





లత గదిలోలేదు. అసలు ఇంట్లోనే లేదు!

పిడుగు పడినట్లయింది సూర్యకాంతానికి.

అశోక్‌కుమార్ నిప్పులు కక్కుతూ లేచాడు.

"నాకేం తెలియదుబాబూ! నా కూతురు నన్నిలా దగా చేస్తుందనుకోలేదు బాబోయ్" అంటూ సూర్యకాంతం నెత్తీ నోరు బాదుకుంటూ కూలబడిపోయింది.

"పైసా ఖర్చు లేకుండా నీ కూతుర్ని అనుభవిస్తానని ఓ రోజు శపథం చేసేను. పైసల్ని నువ్వు కాజేసేవు. నీ కూతురు నన్ను తప్పించుకునిపోయింది. కానీ ఇల్లు అలకగానే పండుగకాదు. నీ కూతుర్ని ఎప్పటికైనా గాలంవేసి పట్టుకుంటాను. దానితో బిజినెస్‌చేసి నువ్వు కాజేసిన డబ్బుకు వడ్డీతోసహా సంపాదిస్తాను. ఇది ఈ అశోక్‌కుమార్ శపథం. గుర్తుంచుకో"

క్షణంలో ఆ ఇల్లు నిర్మానుష్యం అయిపోయింది.

* * *

అశోక్‌కుమార్ ఆ రాత్రి కిరాయి గూండాలను రైలు స్టేషను వద్ద, బస్సు డిపోలో, అన్ని రోడ్ల దగ్గరా కాపలాకు పంపాడు.

కానీ లత అతనాపని చేస్తాడని ముందే వూహించింది. అంచేత ఆ రాత్రి ఆమె ఊరుదాటి పోయే ప్రయత్నం చేయలేదు.

ఆ ఊళ్ళోనే ఓ స్నేహితురాలి ఇంట్లో ఆశ్రయం పొందింది.

ఆ స్నేహితురాలిపేరు ఉమాదేవి.

ఉమాదేవి తండ్రిపేరు పరబ్రహ్మ శాస్త్రి.

పరబ్రహ్మశాస్త్రి జీవనాధారం ఏమీ లేక పౌరోహిత్యం వృత్తిగా చేసు

కొన్నాడు. ఆయనకు మహా కోపిష్ఠి అన్న పేరు వుంది. 'దూర్వాసుడు' అన్న మారు పేరు వుంది. అయితే పరబ్రహ్మశాస్త్రి కోపతాపాలు, చిర్రుబుర్రులూ అన్నీ ఏ ఒక్క వ్యక్తి మీదా కాదు దరిద్రం మీదనని చాలా మందికి తెలియదు.

ఆయనది పెద్ద సంసారం. ఉమాదేవి కాక ఇద్దరు ఆడపిల్లలు, ఇద్దరు మగ పిల్లలూ వున్నారు.

"మాది ఉన్నత కులమండీ. ఆడ పిల్లలకు పెళ్లిళ్ళు ఎలాగవుతాయి? మగ పిల్లలకు చదువులు, ఉద్యోగాలు మా కెవరిస్తారు? ఎంత చదివినా నా కొడుకులు నా వృత్తినే స్వీకరించక తప్పదేమో! కూతుళ్ల గతి ఎలా రాసి వుందో?"

ఈ నిరాశ, బాధే ఆయన్ని 'దూర్వాసుడిగా' చిర్రుబుర్రులాడే వ్యక్తిగా శవాలపట్ల కూడా జాలి చూపని కఠినుడిగా మార్చాయి.

కానీ కొన్ని సమయాలలో ఆయన అసలు స్వభావం తెలుస్తుంది. ఆ సమయాలు అతను తాగివున్న సమయాలు!

ఆ రోజు రాత్రి లత వెళ్ళేసరికి పరబ్రహ్మశాస్త్రి తాగివున్నాడు.

లతను చూసి ఉమాదేవి సాదరంగా ఆహ్వానించింది.

అలంకరణలన్నీ ఎంత తీసేసుకున్నా లత మొహంలో పెళ్లికళ పోలేదు.

"చూడబోతే పెళ్లికూతురు వేషంలో వున్నావు. కానీ మొహంలో ఏదో భయం కన్పిస్తోంది. ఈ రాత్రప్పుడు ఇలా వచ్చావు. అసలేం జరిగిందే లతా?" అని అడిగింది ఉమాదేవి.

లత జరిగిందంతా చెప్పింది. ఉమాదేవి ఆమె కథ విని సానుభూతి చూపింది.

"అమ్మాయ్! నేను చెప్తున్నాను విను. నువ్వు చాలా భేషైన పనిచేసేవు. భోగం వాళ్ళ వంశంలో పుట్టిన ఆడకూతురు వేశ్యావృత్తిలోనే దిగాలని ఎక్కడా రూలు లేదు. ఆ వృత్తిని ఈ రోజుల్లో చాలామంది ఫేషన్‌గా స్వీకరించారుగదా! చదువుకొన్నదానివి, ఎక్కడకివెళ్ళినా నీ స్వంతకాళ్ళమీద నువ్వు బతకగలవు. భేష్! ఆడపిల్లవైనా ధైర్యసాహసాలని ప్రదర్శించావు" అంటూ ముద్దు ముద్దు మాటల్తో పరబ్రహ్మశాస్త్రి ఆమెను పొగిడేడు.

"మీ నాన్నగారు తాగుతారా?" అంది ఆ రాత్రి పడుకున్నాక రహస్యంగా లత.

"మీరు బ్రాహ్మణులు కదా?"

"వేశ్యావృత్తి అందరికీ ఫేషన్ అయినట్లే తాగడం కూడా అందరికీ ఫేషన్ అయిందిగా లతా ? కానీ మా నాన్నకు తాగుడు అవసరం అన్పిస్తుంది"

మర్నాడు తాగనపుడు పరబ్రహ్మశాస్త్రి దూర్వాస రూపాన్ని చూసి లత భయపడింది.

శాస్త్రికి ఈలోగా ఎక్కడి నుంచో పిలుపు వచ్చింది.

స్నేహితురాళ్ళిద్దరూ కూర్చొని ముందు కర్తవ్యాన్ని గురించి ఆలోచించారు.

"నన్నడిగితే శ్రీహర్ష విషయం ముం తెల్సుకోడం మంచిదంటాను. అతను మోసగాడుగా కన్పించటం లేదు. మోసగాడవుతే నువ్వు చొరవ ప్రదర్శించినా తాను అంత నిగ్రహం ప్రదర్శిస్తాడా?"

"కానీ..."

"కానీ ఆ అశోక్‌కుమార్ మాత్రం పరమదుర్మార్గుడు. చాలామందికి అతనితో ఇలాంటి అనుభవాలయ్యాయని చెప్పు

కొంటారుకదా? ఇంతకీ శ్రీహర్ష చిరునామా నీ దగ్గర వుందికదా?"

"వుంది. కానీ నేను రాసిన ఒక్క ఉత్తరానికీ జవాబివ్వలేదుకదా?"

"మీ ఇద్దరి మధ్య ఏదో కమ్యూనికేషన్ గాప్ ఏర్పడిందని నా అనుమానం. ఒక్కసారి వెళ్ళిరా అక్కడికి"

"ఎలా ? అశోక్‌కుమార్ మధ్యలో పట్టుకొంటే?"

"నీకెందుకు? రేపు ఈ ఊరు దాటించే పూచీ నాదిగా"

పరబ్రహ్మశాస్త్రి ఆ పనికి ఆనందంగా అంగీకరించాడు.

మర్నాడు తెల్లవారుజామున ప్రయాణం నిశ్చయమయింది.

ఆ రాత్రి లతకు నిద్రపట్టలేదు. ఏదో భయం! అనుమానం!

ఒంటరిగా వున్న అవకాశాన్ని చూసుకొని పరబ్రహ్మశాస్త్రి తననేం చేయడు గదా?

అసలే తాగుబోతు. అందులోనూ కోపిష్టి. అన్నిటికన్నా మించి పురుషుడు.

ఆమె ఉలిక్కిపడి నిద్రలో నుంచి లేచింది.

పక్కనే ఉమాదేవి నిద్రపోతోంది.

ఎంత పాపిష్టి అనుమానం. అనుమానం పెనుభూతం అని అందుకే అన్నారు! కానీ అనుమానించకుండా వుండటం ఎలా?

కానీ ఆమె అనుమానాలన్నీ నిరాధారాలని నిరూపితమయ్యాయి. పరబ్రహ్మశాస్త్రి కన్నకూతుర్ని అత్తవారింటికి సాగనంపినట్లు లతను జాగ్రత్తగా ఊరు దాటించాడు.

* * *

శ్రీహర్ష ఇచ్చిన చిరునామాను పట్టుకొని ఆ గ్రామాన్ని లత చేరేసరికి సూర్యుడు నడికెత్తి మీదికి వస్తున్నాడు.

శ్రీహర్ష తండ్రి పేరు చెప్పగానే ఊళ్ళో అంతా లతను గౌరవించసాగారు. ఆయన పేరు మాధవరావు. ఊళ్ళో పెద్ద భూస్వామి.

"మాధవరావు బాబుగారు మీకు చుట్టమా? ఏమవుతారు?"

ఏం సమాధానమివ్వగలదు?

వాళ్ళ ఇంటిని సులభంగానే చేరగలిగింది.

పెద్ద లోగిలీ ఇల్లు. ధనధాన్యాలు, పాడిపంటలూ సమృద్ధిగా వున్న ఇల్లుగా ఎవరూ చెప్పకుండానే కన్పించింది.

'శ్రీహర్ష తాను ధనవంతుడిని కానని ఎందుకు అబద్ధం చెప్పేడు?

ఆ ఇల్లు చూస్తుంటే లతకు అనుమానం పెరిగిపోసాగింది.

"ఎవరమ్మా?"



"శ్రీహర్ష స్నేహితురాలినండీ" అంటూ లత తన కథను చెప్పింది క్లుప్తంగా.

క్షణంలో లతను ఆ ఇంట్లోని స్త్రీలు చుట్టుముట్టేసేరు. చెప్పిన కథనే మళ్ళీ మళ్ళీ చెప్పించుకొని విన్నారు.

కానీ శ్రీహర్ష విషయం మటుకూ ఎవరూ చెప్పలేదు.

"ముందు భోజనం చేయమ్మా! తరువాత మిగతా విషయాలు మాట్లాడుకోవచ్చు"

ఆ ఇంట్లో స్త్రీల ప్రవర్తన లతకు చాలా చిత్రంగా కనిపించింది. తనని అన్నీ అడుగుతారు. కానీ తన ప్రశ్నలకు ఒక్కదానికీ సమాధానమివ్వరు. అంతా గోప్యం!

"నాకిప్పుడు భోజనం సహించదండీ. ముందు నేను శ్రీహర్షను చూడాలి" విసిగిపోయి లత మొండికేసింది.

స్త్రీలు ఒకరి మొహాలు ఒకరు చూసుకొన్నారు. దూరంగా వున్న పాలేరువంక చూశారు.

"అయితే నా వెంటరండమ్మా" అన్నాడు పాలేరు లత వద్దకొచ్చి.

"ఎక్కడికి?"

"నేను తీసుకెళ్తానుకదమ్మా రండి"

పాలేరు ముందు నడిచాడు. అతడి వెంట లత నడవక తప్పలేదు.

ఊరికి మరో వైపునున్న ఆధునిక రీతిలో కట్టబడ్డ ఇంటి ముందుకొచ్చి ఆగేడు పాలేరు.

"లోపలికి దయచేయండమ్మా"

"ఎవరి ఇల్లు ఇది?"

"బాబుగారు లోపల వున్నారమ్మా" బాబుగారు! అంటే శ్రీహర్ష!

శ్రీహర్షను తను చూడబోతోంది. తను వచ్చినట్లు అతనికి తెల్సా ? తెలియదు. ఎలా తెలుస్తుంది? మరి అకస్మాత్తుగా తనను చూసి ఎలా రియాక్ట్ అవుతాడో.

ఆలోచిస్తూనే ఆమె లోపలికి వెళ్ళింది?

ఆలోచనలో నుంచి బయటపడేసరికి తను ఓ గదిలో వున్నట్లు గ్రహించింది.

ఆ గది అందంగా వుంది. రెండు ఫోమ్‌బెడ్స్. వాటిపైన తెల్లటి గుడ్డపై పూల పూల డిజైన్ వున్న బెడ్‌షీట్స్. గోడలకి శృంగార క్రీడల్ని చిత్రించే బొమ్మల పటాలు. ఓ పెద్ద నిలువుటద్దం.

ఆ నిలువుటద్దంలో లత తన నిలువెత్తు బొమ్మను చూసుకొంది.

ఆమె మొహం వాడిపోయిన మల్లెపూవులా వుంది.

శరీరమంతా అలసటతో, ఆరాటంతో నిండివుంది.

ఈ గదేమిటి? ఏదీ శ్రీహర్ష?

అడుగో...

కిటికీవద్ద ఓ పెద్ద కుర్చీవుంది.

ఆ కుర్చీలో కూర్చొనివున్నది ఎవరు? శ్రీహర్షేనా?

కుర్చీలో కూర్చున్నవ్యక్తి మూసివున్న కిటికీలోనుంచి దేన్నో చూస్తున్నాడు.

తను వచ్చినట్లు తెలియదా ?

"హర్ష..."

ఆమె కుర్చీవద్దకెళ్ళి తక్కున పామును చూసినట్లు ఆగింది.

కుర్చీలోనించి ఆ వ్యక్తి లేచాడు. ఆమెను చూశాడు.

వెళ్ళి మంచంమీద కూర్చుంటూ తాపీగా అడిగేడు—

"అయితే నిన్నేనన్నమాట మావాడు ప్రేమించింది! గుడ్"

"అవునండీ! మీరు శ్రీహర్ష తండ్రిగారా?

నమస్కారమండీ! నాపేరు లత"

"మావాడు నిన్ను గురించి అన్ని వివరాలు చెప్పేడులే. నిన్ను గురించి చెప్తూ 'ప్రేమ, ప్రేమ' అంటుంటే ఏమిటో పిచ్చి వెధవ, పిచ్చి ప్రేమ అని చులకనగా భావించాను సుమా! కానీ నిన్ను చూసాక ఇప్పుడు మావాడూ తెలివిగలవాడేనన్న నమ్మకం కుదిరింది. వాడి సౌందర్యాభిలాషకు వాడిని అభినందించాలనిపిస్తోంది. కానీ వాడు సమయానికిక్కడ లేడు" అంటూ ఆయన జేబులో నుంచి చుట్ట తీసి కొస కొరికి నోట్లో పెట్టుకొన్నాడు.

లేడా? శ్రీహర్ష ఇక్కడలేడా? ఎక్కడి కెళ్ళాడు? తన కోసం కాని వెళ్ళలేదు కదా?

"అవునూ ముందు మావాడిని నువ్వు ప్రేమించావా? లేక మావాడే నిన్ను ముందుగా ప్రేమించాడా?" అన్నాడాయన అగ్గిపెట్టె తీస్తూ.

"శ్రీహర్షే ముందుగా నన్ను ప్రేమించాడండీ"

"అంత గట్టిగా నువ్వు ఎలా చెప్పగలవు? ముందుగా నువ్వే తనను ప్రేమించినట్లు వాడు చెప్పినట్లు గుర్తే! ముందుగా మావాడే నిన్ను ప్రేమించినట్లు దాఖలాలున్నట్లు చెప్తున్నావే!"

"ఎవరిని ఎవరు ముందు ప్రేమిస్తే నేమండీ? ఇరువురం ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకొందామనుకున్నాం. మీకు అంతగా దాఖలాలు కావాలంటే అతను మొదట రాసిన ఈ ఉత్తరం చూడండి"

"ఊహూ...అయితే మావాడు సిగ్గు... ప్రేమలేఖ కూడా రాసేడన్నమాట రసికుడేనే" అంటూ ఆయన అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించబోయాడు. అగ్గిపుల్ల ఆరిపోయింది. చుట్ట వెలగలేదు.

"ఏదేది...నాకిప్పుడు మావాడంటే గర్వంగావుంది. వాడు నిజంగా నాకు వారసుడనిపించుకొన్నాడు. ఏదేది ... ఆ ఉత్తరం. ఏం రాసేడో, ఎలారాసేడో చూసి సంతోషిస్తాను"

లత హాండ్‌బాగ్‌లోనుంచి ఉత్తరం తీసి ఆయన చేతికిచ్చింది. ఆయన చుట్టను నోట్లోనే పెట్టుకొని ఉత్తరం తెర్చి చదివాడు. ఆనందంతో, గర్వంతో ఆయన మొహం వెలిగిపోయింది.

"ఓరి...ఓరి! ఏం కవిత్వంరా సేడు? భలే భలే...ఇదేనా? ఇంకా ఏమైనా ఉత్తరాలు రాసేడా?" చుట్ట చేతబట్టుకొని అడిగేడు.

"ఇంకేంలేవండీ..."

"లేవుకదా?"

ఆయన చుట్ట నోట్లో పెట్టుకొని అగ్గిపుల్ల వెలిగించాడు. వెలిగిన అగ్గిపుల్లను చుట్టకొసకు కాకుండా ఉత్తరానికి అంటించాడు.

"ఏమండీ...ఏమండీ...నా ఉత్తరం... అదేంటి..."

ఉత్తరం కాలి బూడిదయింది. లత మనస్సు...

"భోగందానికూతురా ప్రేమలు... పెళ్ళిళ్ళు! ఇక లోకం బాగుపడ్డట్టే! అవునూ...నీ పేరేంటే?"

"ఏమండీ..."

"లత! అవునా! ఏ గుంజ చిక్కితే ఆ గుంజకు అల్లుకుపోతుండే లత! నీకీ బుద్ధేమిటి? మీ అమ్మ కథ, నీ కథ నాకు తెలీదనుకోకు. మీ అమ్మ సూర్యకాంతం నా పెళ్లికో, గర్భాదానానికో మేజువాణీ చేసింది. ఆ తర్వాత ఎప్పుడో నాలుగైదు రాత్రులు దానిపక్కలో కాలం గడిపాను.

ఆ తర్వాత నేను భోగం ఇళ్ళకు వెళ్ళటం మానేసి భోగంవాళ్ళనే మా ఇంటికి రప్పించుకొంటున్నాననుకో. ఇది ప్రత్యేకంగా నా ఉంపుడుగత్తెలకు కట్టిన ఇల్లు. బాగుంది కదా ? ఇక్కడే వుండిపోతావా ఏమిటి ?"

"ఏమండీ...పాపమండీ! నేను... నేనూ..."

"నీతులు చెప్పకు. మూతిపళ్లు రాలగొడ్తాను. నువ్వు కులరీత్యా వేశ్యవు. పాతివ్రత్యాన్ని గురించి చెప్పకు. తండ్రితో, కొడుకుతో రహస్యంగా ప్రేమలు సాగించిన వేశ్యల కథలు వినలేదా నువ్వు? నువ్వు 'ఊ' అంటే ఈ క్షణంలో సుగుణమణిని పంపించేసి ఈ ఇల్లు నీ పరం చేస్తాను. సుగుణా... ఒసేవ్...సుగుణామణీ..."

ముప్పైఏళ్లున్న ఓ యువతి గదిలోకి వచ్చింది.

"ఇది సుగుణమణి. నీ అక్క. నా దగ్గర అయిదేళ్లు కాపురం చేసింది. దానికి నేను నాకు అదీ పాత బడ్డాం. అంచేత ఈ క్షణంలో విడాకులిచ్చుకొంటున్నాం.ఈ క్షణంలోనే సుగుణ స్థానాన్ని నీకిస్తున్నాను. దాన్నొకసారి చూడు. నీకన్నా వయసులో కాస్త ఎక్కువ కావచ్చు. కానీ అందంలో తీసిపోయిందా? దానిలాగా వృత్తిధర్మంగా బతకటం నేర్చుకోవాలి. నువ్వు ఇక వెళ్ళవచ్చు సుగుణా! వెళ్ళేటపుడు..." అంటూ ఆయన అర్థోక్తిగా ఆపేడు.

ఎలా వచ్చిందో అలాగే వెళ్లింది సుగుణమణి.

అంతవరకు లత బ్రిర స్తబ్ధమయింది.

సుగుణమణి వెళ్ళటంతో ఆమె ఆలోచనలకు చైతన్యం వచ్చింది. జరగబోతున్నదేమో తెల్సుకొంది.

ఈలోగా ఆయన చుట్టపొగను గుప్పు గుప్పున వదులుతూ లేచాడు. మీసాలు దువ్వుతూ ఆమె మీదిమీదికి వస్తున్నాడు.

"ఏమండీ...ఇది అన్యాయం. నేను శ్రీహర్షను ప్రేమించాను. మేమిద్దరం పెళ్లి చేసుకోవాలనుకొన్నాం. నేను మీకు కోడలినవుతానండీ. ఇది మీకు ధర్మం కాదు. నన్ను..."

"దయ్యాలు వేదాలు వల్లించటం అంటే ఇదేననుకొంటాను. భోగందానికి వరసలు లెక్కా? అరిచి లాభంలేదు కానీ ఊరికే హైరానపడకు. నా కంటికి నచ్చిన స్త్రీని, నా జిహ్వకు ఇష్టమైన వస్తువుని నేను ఎన్నడూ వదులుకొని ఎరుగను. అయినా తెలివిగలదానివయితే నువ్వే ఆలోచించు. నేను గొప్పా, నా కొడుకు గొప్పా ? ఆస్తి నాది. అనుభవం నాకు ఎక్కువ."

అతను కెనడియన్ ఇంజన్‌లా గుప్పు గుప్పున పొగ వదులూ మీదికొస్తున్నాడు. బలవంతంగా రైలు పట్టాలమధ్యకు నెట్టబడి పట్టాలమధ్య ఇరుక్కుపోయిన మేకపిల్లలా గిజగిజలాడిపోయిందో క్షణం. అతని ముందు వేదాలు వల్లించి, భగవద్గీత పారాయణం చేసి లాభంలేదు. తప్పించుకుపోవాలి.

ఆయన బారినుంచి తప్పించుకోటానికి లత ఆ గదంతా తిరిగింది.

ఆ గదికి చాలా తలుపులు వున్నాయి. అన్నీ గడియలు పెట్టే వున్నాయి. ఓ తలుపు తెరచి వున్నట్లు ఆమెకు అనిపించింది.

ఆ తలుపు వద్దకు పరుగెత్తింది.

అది అసలు తలుపేకాదు. అక్కడ




అసలు ద్వారమేలేదు.

గోడకు తల కొట్టుకొంది.

తల దిమ్మెక్కింది. శరీరం నీరసించింది.

ఆమె క్షణంలో స్పృహతప్పి పడిపోయింది.




మళ్ళీ ఆమెకు స్పృహ వచ్చేసరికి...

శరీరమంతా చాలా నొప్పులుగా ఉన్నట్లు అనిపించింది.

మరి కొంతసేపు అలాగే పడుకొని ఉంటే బాగుండునన్న భావన కలిగింది.

ఇంతలోనే జరిగింది గుర్తుకొచ్చింది.. అసలేం జరిగింది?

నేలమీద నుంచి చటుక్కున లేచింది. గురక వినిపించింది.

పెద్ద ఎలుగుగొడ్డులా మంచం మీద పడిఉన్నాడు శ్రీహర్ష తండ్రి!

ఆయన్ని చూడగానే ఆమె భయంతో గజగజా వణికిపోయింది.

అప్పుడు గమనించిందామె...

తలుపు తెరిచే ఉంది. తనకేం జరగలేదు.

స్వేచ్ఛ... స్వేచ్ఛ...

ఇంతలో మంచంమీద పడుకొనివున్న ఆయన కదిలాడు.

గురక ఆగింది.

లేవడు కదా?

అదుగో...అతను కళ్లు తెరుస్తున్నాడు...

స్వేచ్ఛ... స్వేచ్ఛ!

ఆమె ఒక్క క్షణంలో ఎవరో వెంట తరుముతున్నట్లు గదిదాటి బజార్లో కొచ్చింది. శ్రీహర్ష తండ్రి తనని చూసి నవ్వుతున్నాడని ఆమెకి తెలియదు.

ఆమె శరీరం అంతా నలిగిపోయినట్లుంది. ఆమె జాకెట్టు తడిసిపోయింది.

భయవిహ్వల అయి బజార్లగుండా పరుగెత్తుతున్న ఆ సుందర యువతిని ఊరిజనం సినిమా షూటింగును చూసినట్లు చూస్తున్నారు.

ఆమె ఊరుదాటి రోడ్డుమీది కొచ్చింది. సమయానికి అక్కడ వున్న బస్సు ఎక్కింది. బస్సు తీసుకువెళ్ళిన ఊరు వెళ్లింది.

భయం మాత్రం ఆమెను వదల్లేదు.

ఆ ఊళ్ళో బస్సుదిగి రిక్షాఎక్కి రైలు స్టేషన్‌కు వెళ్లింది.

సమయానికి ఏదో రైలు ప్లాట్‌ఫామ్ మీద వుంది.

ఏ ఊరికి వెళ్లాలి? ఏమిటి గమ్యం?

లత ఇవేమీ ఆలోచించే స్థితిలో లేదు.

దయ్యాలు, భూతాలు తరుముకొస్తున్న భ్రాంతి ఆమెను వదల్లేదు.

"ఏమండీ... టిక్కెట్టివ్వండి"

"ఎక్కడికి?"

"ఆ రైలు ఎక్కడికి వెళ్తే అక్కడికి!"

టిక్కెట్టు ఆమె చేతిలో పడింది.

బుకింగ్ క్లర్క్ వెర్రిగా ఆమె వైపు చూశాడు.

ఆమె టిక్కెట్ తీసుకొని ప్లాట్‌ఫామ్

పైకి పరుగె త్తింది.

రైలు కూతవేసి అప్పటికే కదిలింది.

"అయ్యో... రైలు..."

కదిలే రైలులో ఎక్కటానికి ఆమె రైలు వెంట పిచ్చెక్కినట్లు కాస్సేపు పరుగెత్తింది.

ఎవరో రైల్లోనుంచి చేయి అందించ బోయారు.

మరెవరో ప్లాట్‌ఫామ్‌పైనుంచి ఆమె ప్రయత్నాన్ని వారించబోయారు.

కింద పడబోయి ఆమె నిలదొక్కుకుంది.

రైలు ప్లాట్‌ఫామ్ వదిలివెళ్లిపోయింది. రొప్పుతూ ఆమె వెళ్తున్న రైలును అలాగే నిశ్చలంగా చూస్తూ కాస్సేపు నిల్చుండిపోయింది.

ఇదంతా గమనిస్తోన్న ఒకామె లత వద్దకు వచ్చి భుజంమీద చెయ్యి వేసింది.

"భయం లేదమ్మా. నేనున్నాగా!"

"అమ్మా..." అంటూ ఆమెను కౌగిలించుకొని హిస్టీరిక్‌గా వెక్కి వెక్కి పెద్దగా ఏడవసాగింది లత.

* * *

హైదరాబాద్ వెళ్లే రైలు వచ్చి స్టేషనులో ఆగింది.

"ఎక్కమ్మా"

ఆమెను ఇద్దరు అమ్మాయిలు చేయి పట్టుకొని ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్‌లోకి ఎక్కించారు.

కాస్సేపటికి రైలు కదిలింది. వెనక్కి జరిగిపోతున్న ఆ రైలుస్టేషన్‌ను లత కిటికీలోంచి అలాగే చూస్తూ వుంది.

"ఏమ్మా? ఏమిటి చూస్తున్నావ్?" సౌహార్ద్రం నిండిన గొంతుతో తియ్యగా అడిగిందామె. లత పక్కన కూర్చొని తల మీద చెయ్యివేసి లతవైపు తిరిగింది. ఆమెను తదేకంగా చూసింది.

ఎవరామె? తానెక్కడుంది అసలు?

ఆమె షాక్‌నుంచి కోలుకోటం ఆరంభించింది. ఆ కూపేనంతా ఓసారి కలయ చూసింది. ఆ కూపేలో తామిద్దరే. మిగతా బెర్‌లన్నీ ఖాళీగా వున్నాయి.

ఆమె దృష్టి ఎదురు బెర్త్ మీదనున్న పండ్లపైన పడింది. క్షణంలో ఆకలి గుర్తు కొచ్చింది.

"ఏమ్మా! ఆకలిగా వుందా?"

ఆమె పండ్లతో పాటు సంచీలోనుంచి కొన్ని పొట్లాలు తీసి ఆమె చేతికిస్తూ అంది—

"తినమ్మా. బాగా అలసిపోయినట్లున్నావు. నీకింకేం భయం లేదమ్మా"

కరుణ, ఓదార్పు, ధైర్యం...

లత ఒక్కొక్క పదార్థాన్ని తింటూ ఆమె వైపు కృతజ్ఞతా భావంతో చూసింది.

ఆమె విలువైన కంచిపట్టు చీర కట్టుకొంది. శరీరంమీద విలువైన ఆభరణాలు వున్నాయి. జుట్టు దువ్వి హైక్లాస్ లేడీస్ వేసే ముడిని అందంగా వేసింది.

ఆమె ధనవంతురాలు, విద్యావంతురాలు, సంఘంలో హోదా కలది, సంస్కారం కలదని ఆమె వేషభాషలు చెప్తున్నాయి.

"మీ రెవరు?మనం ఎక్కడికెళ్తున్నాం?"

లత ప్రశ్నలు విని ఆమె మెల్లగా హుందాగా నవ్వింది.

"మొదటిది నేను అడగవల్సిన ప్రశ్న. రెండోది నేను సమాధానం ఇవ్వాల్సిన ప్రశ్న. రెండు ప్రశ్నలూ నువ్వే అడిగేశావ్. కనుక నువ్వెవరో అడగకుండానే సమాధానం ఇస్తాను. గమ్యం తెలియకుండా భీతితో, షాక్‌తో రైలు





ఎక్కబోతున్న నిన్ను ఆపేను. నిన్ను నాతో పాటు హైదరాబాద్‌కు తీసుకెళ్తు న్నాను. ఇక నేనెవరని అడిగావు కదూ? నేనూ..." అంటూ ఆమె ఆగింది.

లత తినటం పూర్తి చేసింది.

"కాస్త పడుకోమ్మా. నా కథ చెప్తుం టాను. వింటూ పడుకో" అంటూ ఆమె లేచి ఎదురు బెర్త్ మీద సర్దుకొంది.

"నా పేరు కరుణా శ్రీధరన్"

కరుణాశ్రీధరన్ ఎవరో తెల్సుకొనే సరికి లతకు భయం పోసాగింది. ధైర్యం వచ్చింది. వర్తమానాన్ని వదిలేసి భూత భవిష్యత్‌లను గురించిన ఆలోచనల్లో పడిపోయింది.

శ్రీహర్ష... అశోక్‌కుమార్.

అశోక్‌కుమార్ విలన్ అని తనకు మొదటినుంచీ తెల్సు.

కానీ శ్రీహర్ష?

ఎంత తియ్యగా తనని మోసం చేసేడు? ఎన్ని అబద్ధాలు చెప్పేడు? నిజంగా అతను మోసగాడేనా?

మోసగాడే అయితే తనముందు అన్ని రోజులు అంత నిగ్రహాన్ని ఎందుకు ప్రదర్శించాడు? అదీ నాటకంలో భాగమా?

ఇంత నాటకం ఆడి అతను సాధిం చిందేమిటి?

"నిద్రవస్తున్నట్లుంది కదూ?"

"లేదండీ...నేను..." లత హఠా తుగా లేచి కూర్చొనే ప్రయత్నం చేయ బోయింది. ఆమె వారించింది.

"విశ్రాంతి తీసుకోమ్మా! నీ కథ తర్వాత వింటాలే. అయితే నాకొక్కటి తెల్సు. నీకు నా సహాయం అవసరం. నీకు ఏమికావాలంటే అది ఇవ్వగల శక్తి నాకుంది. నిజానికి నువ్వు చాలా అదృష్ట వంతురాలివి. అందుచేతే నా కళ్ళ బడ్డావు. ఇది గుర్తుంచుకో చాలు"

నిజమే. తనకి సహాయం కావాలి. కాస్తంత సహాయం అందిస్తే తాను తన జీవితాన్ని తనకిష్టమైన రీతిలో దిద్దుకో గలదు. కానీ తనకి ఏంకావాలి?"

ఆమె అంతరాత్మను మథించ సాగింది

అంతలోనే ఆమె కళ్ళు బరువెక్కి మూతలు పడసాగాయి.

ఆ మూసుకొన్న కళ్ళ ముందు ఎన్నెన్నో దృశ్యాలు...

అన్ని దృశ్యాలలోనూ ఇతివృత్తం, బాపం ఒక్కటే!

వివాహం... పెళ్ళి...

"నాకు పెళ్ళికావాలి. పెళ్లికావాలి" ఆమె కలలో గొణిగింది. నిద్రపోతున్న ఆమె మొహంలోకి తదేకంగా చూసింది కరుణ.

"నీకు పెళ్లికావాలి. అందరు ఆడ పిల్లలు కోరుకొనేది కూడా ఆ పెళ్లినే! పెళ్ళి... పెళ్ళి...హు!"

కరుణ పెదవులపై అదోవిధమైన నవ్వు వెలిగింది!

లైటు ఆర్పివేసి కిటికీలో నుంచి చూస్తూకూర్చుంది.

చీకట్లో రైలు గమ్యంవైపు పరు గెడుతూ వుంది.

* * *

లత మంచంపైన పడుకొని పైన కప్పుకు వేలాడుతున్న ఫానును తదేకంగా చూస్తున్నది. సన్నగా శబ్దంచేస్తూ ఫాన్ మెల్లగా క్రమబద్ధంగా తిరుగుతోంది.

ఆమె కళ్ళు ఆ సీలింగ్ ఫానును చూస్తున్నాయి. కానీ ఆమె మనసు ఫాను మీద లేదు. అసలా గదిలోనే లేదు. ఫాను



కన్నా వేగంగా ఎక్కడెక్కడో తిరుగు తోంది.

ఆమె ఆ ఇంటికొచ్చి వారం రోజులు దాటింది.

ఆ ఇంట్లోకి అడుగు పెట్టేనాడు ఆమె ఎన్నెన్ని కలలు కన్నదో!

రాగానే ఆ ఇంట్లో సర్వెంట్స్ కరుణ చుట్టూమూగేరు. నమస్కారాలు చేసేరు. కుశల ప్రశ్నలు వేసేరు.

అన్నిటికీ కరుణ చిరునవ్వులతో సమాధానం ఇచ్చింది.

"ఈమె పేరు లత. కొంతకాలం ఇక్కడ ఉంటుంది" అంటూ ఆరోజు లతను వారందరికీ పరిచయం చేసింది. ఆమె ఉండటానికి ఏగది ఇవ్వాలో ఆజ్ఞలు పురమాయించింది.

అంతే! ఆ తర్వాత ఆమె లతతో మాట్లాడలేదు. తనే పలకరిద్దామన్నా లతకు ఆ అవకాశం చిక్కలేదు.

ఎన్నోసార్లు ఇద్దరూ ఎదురెదురు పడ్డారు.

లత సమస్కరించటం, కరుణ తల వూపి చిరునవ్వు విసరటం...

ఆ వారంరోజుల్లో కరుణను గురించి లత చాలా తెల్సుకొంది.

ఆమె చాలా బిజీ.ఎన్నో పరిచయాలు, ఎన్నో సంస్థలతో సంబంధాలు ఉన్నాయి. అటు రాజకీయ వర్గాలలో, అధికారుల వర్గాలలో, బిజినెస్ వర్గాలలో, సాంస్కృతిక వ్యవహారాల్లో ఆమె వేలు పెట్టని రంగం లేదు. అన్ని రంగాల్లో, అన్ని వ్యవహారాల్లో ఆమెకు ప్రాధాన్యతే వుంది. ఆమెకు ఎంత పలుకుబడి వుందో ఆమెకు రోజూ వచ్చే ఫోన్‌కాల్స్‌ను బట్టి అంచనా కట్టవచ్చు.

ఆమె రాత్రిళ్ళు చాలా ఆలస్యంగా ఇంటికి వస్తుంది. ఉదయం చాలా ఆలస్యంగా నిద్ర లేస్తుంది.

నిద్ర లేచిన దగ్గరినుంచి ఫోన్ కాల్స్‌తో, విజిటర్స్‌తో బిజీ...బిజీ!

లతకు ఏమీ అడగాల్సిన అవసరం లేకుండా ఆ ఇంట్లో అన్ని రాజోపచారాలు జరిగిపోతున్నాయి.

అయినా లతకు సుఖంగా లేదు. మనసులో ఏదో అసంతృప్తి ... అనుమానం!...భయం!

ఏమిటీ వ్యక్తి?

తనని ఇంత దూరం తీసుకొచ్చిన వ్యక్తి, రైల్లో అంత ఆదరాన్ని చూపించిన వ్యక్తి ఇక్కడికొచ్చాక అసలు తనని గురించి పట్టించుకోదేం? అసలు తనెవరో, తన కథ ఏమిటో తెల్సుకోదేం?

ఇక్కడి నుంచి తను వెళ్ళిపోతే?

వెళ్ళి?

ఎక్కడికి వెళ్ళాలి? ఏంచేయాలి?

తలుపు తట్టుతున్న శబ్దం వినిపించి వులిక్కిపడి లేచింది లత.



చతుర ... లేలే

కరుణ కాదుకదా?

అలా ఎన్నోసార్లు ఆమె అయ్యుంటుం దని ఆశపడింది లత. కానీ పిలిచేది ఏ సర్వెంటో అయివుంటుంది.

తలుపు తెరిచింది.

ఆశ్చర్యం! తలుపు తట్టింది ప్యూను కాదు.

కరుణా కాదు.

మరి...?

శ్రీధరన్!

'మీరా?' అని మనసు ఆశ్చర్య పోయింది. కానీ నోరు ఏ విధమైన శబ్దం చేయలేదు.

"లోపలికి రావచ్చా?" శ్రీధరన్ ఇంగ్లీషలో అడిగేడు

"రండి ప్లీజ్...!"

శ్రీధరన్‌ను లత చాలా సార్లు చూసింది. కరుణ ఇంట్లో అందరినీ పరిచయం చేసింది. కానీ భర్తను మాత్రం లతకు పరిచయం చేయలేదు.

అయినా శ్రీధరన్‌ను గురించి లతకు చాలా తెల్సు.

శ్రీధరన్ కేంద్రప్రభుత్వంలో పెద్ద ఉద్యోగి. చాలా పెద్ద హోదా గలవాడు. ఆఫీసు పనులతో ఎప్పుడూ బిజీగా ఉంటాడు. ఇంట్లో అన్ని విషయాలు కరుణ చూసుకోవల్సిందే!

కరుణ అంటే శ్రీధరన్‌కు ఎంతో ప్రేమ.

నిజానికి వారిద్దరిదీ ప్రేమ వివాహం.

"లోపలికి రమ్మని ఆహ్వానించి కూర్చోమనైనా అనకుండా ఏమిటి ఆలోచనలో పడ్డారు ?" శ్రీధరన్ అనడంతో లత లోకంలోకి వచ్చింది.

"సారీ...కూర్చోండి"

శ్రీధరన్ కూర్చోలేదు.

"పెళ్ళికాని ఆడపిల్లలు అలా ఆలోచనల్లో పడి వూహల్లో విహరిస్తూ తమ చుట్టూ వాతావరణాన్ని, తమని తామే మర్చిపోవటం, చూడటం అంటే నాకు చాలా ఇష్టం. అలాంటి ఆడపిల్లలు చాలా అందంగా ఉంటారు. గొప్ప 'యీస్తటిక్ సెన్స్' వున్నవారుగా నేను వారిని పరిగణిస్తాను. మీరేమంటారు?"

శ్రీధరన్ ప్రశ్న అడిగేడే కాని సమాధానాన్ని లతనుంచి ఆశించినట్లు లేదు.

"అన్నట్లు నేను త్వరగా వెళ్ళాలి. ఇలాంటి విషయాలు మరోసారి మాట్లాడు కొందాం కాని ముందు నాకో సాయం చేసి పెట్టండి"

"చెప్పండి"

"కరుణకు మీరైనా చెప్పండి. కొంచెం తన ఏక్టివిటీస్ తగ్గించమని. చూస్తున్నారుగా నౌ ఎడేస్ షి ఈజ్ వెరీబిజీ. చెప్తారు కదూ?"

శ్రీధరన్ ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు.

'ఇది అడగటానికా తన గదికి అతను వచ్చింది?' లతకి అతని పట్ల ఎందుకో అనుమానం వేసింది !

* * *

తలుపు తట్టిన శబ్దం అయింది.

అపుడు లత తనవంటూ పోగయిన వస్తువుల్ని సర్దుకొంటోంది. సర్దుకొంటున్నట్లు నటిస్తూ ఆమె ఓ నిర్ణయానికి వచ్చింది.

ఇక ఇక్కడ కరుణా శ్రీధరన్ మవునంగా చేసే అవమానాన్ని సహించ లేదు. వెళ్ళిపోవాలి. ఇవాళే ... ఈ క్షణంలోనే !

వెళ్లి ?

 

ముందు వెళ్ళాలి. ఆ తర్వాత సంగతి ఆ తర్వాత.

ఈ కరుణా శ్రీధరన్‌ని కలుస్తానని తాను ఇంటినుంచి బయటికొచ్చిననాడు అనుకొందా ?

ఆమె ఆ ఇంటికి వచ్చిన నెలరోజుల తర్వాత ఆ రోజు అక్కడినుండి వెళ్ళిపోవాలని నిర్ణయించుకొంది. కరుణా శ్రీధరన్ ఈసమయంలో ఇంట్లోవుంటుంది. వెళ్తూ వెళ్తూ ఆమెతో చెప్పటం కనీసమర్యాద కదా !

లేకపోతే...!

ఎంత బిజీ అయితే మాత్రం తనతో ఒక్కసారి మాట్లాడకూడదా? అసలు ఆమె ఉద్దేశం ఏమిటి?

ఆమె ఉద్దేశం ఏమయితే తనకేం?

తనకి ఆత్మాభిమానం ఉంది. వెళ్ళిపోతుంది. తన బతుకు తను బతుకుతుంది.

మళ్ళీ తలుపు తట్టిన శబ్దం అయింది.

ఎవరు? సర్వెంటా లేక శ్రీధరనా? కరుణ ఎలాగూ రాదుకదా?

తలుపు తెర్చింది – వెళ్ళిపోవటానికి అంతా సిద్ధం చేసుకొన్నాక.

సర్వెంట్ మెయిడ్ !

"అమ్మగారు మీతో మాట్లాడాలిట. వస్తున్నారు"

ఆశ్చర్యకరమైన వార్త.

తను ఆ యింటినుంచి వెళ్ళిపోవాలని నిర్ణయించుకొన్న క్షణంలోనే, కరుణ తనతో మాట్లాడటానికి వస్తున్నట్లు కబురు పెట్టటం యాదృచ్ఛికమా ? లేక తనని గమనిస్తూ, తన ఆలోచనల్ని పసిగట్టే ఏర్పాటేమైనా చేసిందా?

ఆమె అనుమానంగా సర్వెంట్ మెయిడ్‌ను చూసింది. గదంతా కలియజూసింది.

హఠాత్తుగా శ్రీధరన్ గుర్తుకొచ్చాడు. శ్రీధరన్ నాలుగయిదుసార్లు ఆమెని కలిసేడు. ప్రతిసారీ నిముషం, రెండు నిముషాలు...!

"కరుణ ఇవాళ ఎన్ని గంటలకొస్తుందో మీకేమైనా చెప్పిందా?"

"కరుణను కొంచెం పెందరాళే ఇంటికి రమ్మనమని నేను చెప్పమన్నాను కదా ? చెప్పేరా?"

సమాధానాలు ఆశించకుండా అడిగేసి వెళ్ళిపోవటం చిత్రమనే అనిపించేది లతకి. కొంపదీసి కరుణ అతడిని తన పైన గూఢచారిగా నియమించలేదుగదా?

"ఏమిటి ? ఏదో ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయినట్లున్నావే ? ప్రయాణ సన్నాహంలో ఉన్నట్లు కన్పిస్తున్నావే ? ఎక్కడికి ?"

కరుణకు తన నిర్ణయం చెప్పాలా, అక్కర్లేదా ?

"నెల రోజులయినా నీ ఆలనా పాలనా చూడనందుకు నా మీద నీకు కోపం వచ్చి ఉండాలి కదూ" అంటూ కరుణ లత భుజం పైన చేయి వేసింది ఆప్యాయంగా. తను లోపలికి నడుస్తూ లతను తనవెంటనే నడిపించింది.

"ఇక్కడ నీకు సౌకర్యంగా ఉందా? సర్వెంట్స్ నీ సదుపాయాలన్నీ చూస్తున్నారు కదా! ఏమిటో చూస్తున్నావుగా నేను ఎంత బిజీనో. అయినా నీ విషయం మర్చిపోలేదనుకో. ఇవాళ నా సమయాన్ని కొంత నీకోసం అలాట్ చేసేను" అంటూ ఆమె ఓ కుర్చీలో కూర్చుంది. "కూర్చో" అని లతకు మరో కుర్చీ చూపించింది.

కానీ లత కూర్చోలేదు. ఆమెకు కళ్ల

ముందు జరుగుతున్నదంతా నమ్మబుద్ధి కావటంలేదు.

నెలరోజులుగా తన మొహమన్నా చూడని కరుణా శ్రీధరన్ ఇప్పుడు హఠాత్తుగా ఇంత ఆప్యాయత ప్రదర్శిస్తున్నదేమిటి? ఇందులో గూఢంగా ఏమన్నా అంతర్యం వుందా?

ఆ ఇంట్లోనుంచి వెళ్ళిపోవాలన్న తన నిర్ణయాన్ని చెప్పాలా?

లేక...

"అన్నట్లు నువ్వు నా గది చూడలేదు కదూ? వెళ్దాం పద"

ఆమె లేచింది. లత కూడా ఆమె వెంట నడవక తప్పలేదు.

కరుణా శ్రీధరన్ లతను తన పడక గదిలోకి తీసుకు వెళ్ళింది. ఎయిర్ కండిషన్డ్ గది అది.

నేలమీద అందమైన కార్పెట్‌లు పరిచి వున్నాయి. రెండు బెడ్‌లు జాయింట్ చేసి వేయబడి ఉన్నాయి. హంస తూలికా తల్పాల మోడల్‌లో పాలరాతితో చేసినట్లున్నాయి ఆ మంచాలు. వాటి మీద మూరెడెత్తున వున్న పరుపులు ఉన్నాయి. పరుపుల మీద చాలా విలువైన బెడ్‌షీట్‌లు పరచివున్నాయి.

గది గోడలకి వాల్ పేపరు అతికించి వుంది. రకరకాల సీన్లు! కొందరు యువతులు జలకాలాడే సీను. ఇంకో గోడపైన ఓ యువతి తడిగుడ్డతో అర్ధనగ్నంగా బిందె చంకనబెట్టుకుని తీసుకెళ్తున్నది.

గదిలోకి ప్రవేశించగానే కమ్మటి వాసన వేసింది లతకు.

"కూర్చో" అంది కరుణ సోఫా చూపిస్తూ. అంటూ ఆమెను ఓ సోఫాలో కూర్చోబెట్టి తను ఆమె ఎదురుగ్గా మరో సోఫాలో కూర్చుంది.

"రైల్లో నా కథ నీకు కొంత చెప్పేను. మిగతాది నువ్వు ఈపాటికి తెల్సుకుని వుంటావు. క్లుప్తంగా చెప్పాలంటే, నాకు ఈసిటీలో ఏ సాంఘిక, సాంస్కృతిక, రాజకీయకార్యక్రమం జరిగినా అందులో ప్రమేయం ఉంటుంది. ఒక్కోసారి ఈ 'సేవ' ఎందుకా అనిపిస్తుంది. కానీ సేవా భావమన్నది తెచ్చిపెట్టుకొంటే వచ్చేది కాదు కదా? నా రక్తంలో జీర్ణమైపోయి వుంది. అంచేత వదల్లేను. అప్పటికీ శ్రీధరన్ ఈ సేవ మానమని పోరుతూనే వుంటాడు, రెకమెండేషన్లు చేయిస్తుంటాడు. నీకూ ఈ విషయం చెప్పివుండాలే! శ్రీధరన్ అంటే గుర్తుకొచ్చింది. అతనితో ఓ విషయం చెప్పాలి. వన్ మినిట్, ఇప్పుడే వస్తా" కరుణ హఠాత్తుగా లేచి తలుపు తీసుకొని వెళ్ళింది.

నిర్ఘాంతపోయింది కరుణ!

ఏమిటీ మనిషి?

తాను చాలా గొప్పదాన్నన్న అహం భావమా?

"సారీ లతా! అకస్మాత్తుగా ఆ విషయం గుర్తుకొచ్చింది. ఊ...ఇక ఇప్పుడు చెప్పు నీ కథ వింటాను. వివరంగా చెప్పాలి సుమా" అంటూ వచ్చింది మరి కాసేపట్లో.

కానీ లతకు తన కథంతా వివరంగా ఆమెకు చెప్పుకోవాలని బుద్ధిపుట్టలేదు. అంచేత స్థూలంగా, క్లుప్తంగా, చెప్పింది.

"స్త్రీకి ఆర్థిక భద్రత వుంటే ఇలాంటి కథలు ఉండవు లతా! నీకెందుకు? నువ్వు నిర్విచారంగా వుండు. రేపీపాటికి నేను ఉద్యోగం సంపాదించి పెడతాను. డిగ్రీ వరకు చదివేవు కదా! పోనీ ఆ డిగ్రీ పూర్తిచేయరాదూ? ఆ ఏర్పాటు చేస్తాను"

వివాహానికి పెద్దగా ప్రాధాన్యత

ఇవ్వని వ్యక్తి ఆమె!

తన జీవిత ధ్యేయం వివాహం, గౌరవ మైన కుటుంబ జీవితం.

కన్నబిడ్డల్ని దూరంగా వుంచి 'సేవ' చేస్తున్న ఆమెకు తన ఆరాటం అర్థం అవుతుందా?

తన కోరికను అసలు ఆమెకు చెప్ప టమా, చెప్పకపోవడమా?

"నా దగ్గర ఏమీ దాచనవసరం లేదు లతా! నీ మనసు విప్పి మాట్లాడ వచ్చు. నా జీవితంలో నీలా ఇల్లు వదిలి వచ్చిన స్త్రీలను చాలా మందిని ఆదు కొన్నాను. ఉపాధి చూపేను. నిజానికి నా విలువైన కాలాన్నంతా స్త్రీ జనోద్ధ రణకే వెచ్చించాలన్న ఆలోచన కూడా ఉంది. నువ్వు ఎలాంటి జీవితాన్ని కోరు కొంటే అలాంటిది చూపగలను. నీకు ఓ నిర్ణయం లేదనుకో... నేనే నీకు సరైన మార్గాన్ని చూపగలను. ఏమంటావ్?"

"నాకు జీవితంలో ఒకే ఒక్క కోరిక ఉంది. దాన్ని మీరు తీర్చగలరా?"

"చెప్పు ఏమిటది?"

"పెళ్లి... నాకు పెళ్ళి చేసుకుని భర్తతో, పిల్లలతో సాధారణమైనకుటుంబ జీవితాన్ని గడపాలని ఉంది."

కరుణ నవ్వింది చాలా లైట్ గా.

"ఓస్ ఇదా నీ కోరిక! సగటు ఆడ పిల్లలందరికీ చాలా సులభంగా తీరే కోరిక. ఈ కోరిక తీర్చుకోడం కోసం నాదాకా రావల్సిన పని లేదనుకొంట్లానే! ఇంతకన్నా పెద్ద కోరికలు కోరుకొనే వాళ్లే నా దగ్గరికొస్తారు"

"మీకు నా కోరిక చాలా అల్పంగా, స్వల్పమైనదిగా కన్పించవచ్చు. కానీ నా దృష్టిలో అది చాలా పెద్ద వరం. స్త్రీకి కుటుంబ జీవితంకన్నా కావల్సిందేముంది? కుటుంబం ఏర్పాటు అయ్యాకే ఏ కోరిక లైనా"

"స్త్రీకి వివాహం అంత ముఖ్యమని నువ్వు భావిస్తున్నావా? నేను భావించను. భావించలేదు"

"మేడమ్! ప్రపంచంలో అందరి స్త్రీల ఆలోచనా విధానం ఒక్కలాగే ఉండాలని లేదుకదా? ఒక వ్యక్తి ఆలో చనల్ని, పెంచుకొనే కోరికల్ని ప్రభా వితం చేసే శక్తులు అనేకం ఉండవచ్చు. పైగా మీ మేధాశక్తి,బుద్ధి కొలత హెచ్చు. అందరూ మీ అంత ప్రజ్ఞావంతులు, ప్రతిభావంతులు కాలేరుగా?కాగా అదృష్టం మిమ్మల్ని వెతుక్కొంటూనే వచ్చింది. పెళ్ళివిలువ పెళ్ళి కానివారికి, కాదన్న భయం ఉన్నవారికి తెలుస్తుంది మేడమ్. అక్కర్లేదనుకొన్నా అదృష్టం నెత్తినెక్కి పెళ్ళి అయిన వారికి దాని విలువ, మాధుర్యం తెలియకపోవచ్చుకదా!"

"ఐసీ...! నువ్వు బాగా ఆలోచించ గలవే! ఊ..."

కరుణ కాసేపు ఆలోచించినట్టు నటించింది.

"పెళ్లి కాదేమోనన్న భయం నీకు అంతగా వున్నదంటే, నువ్వు చెప్పకుండా దాచిన కథ కొంత నీ వెనుక వుండి వుండాలి. అవునా?"

"వుంది. చెప్పమంటే చెప్తాను"

"అక్కర్లేదులే. కానీ నీకు పెళ్లి కావాలి. అంతేగా?" అంది లేస్తూ.

* * *

పెద్ద కాంపౌండ్. ఆ కాంపౌండ్ నిండా పెద్ద పెద్ద చెట్లు, ఆ చెట్ల మధ్యన పెద్ద బిల్డింగ్. కాంపౌండ్ బయటనుంచి చూస్తే బిల్డింగ్ వున్నట్లే కనిపించదు. అంతా చెట్లు. చక్కటి చల్లటి వాతావరణం.

ఆ వాతావరణంలోకి టాక్సీలు వెళ్తున్నాయి, వస్తున్నాయి. అలా కాస్సేపయ్యాక కాంపౌండ్‌కు వున్న ఇనుపగేటు మూత పడిపోయింది.

అప్పుడు సరిగ్గా పదకొండు గంటలు అయింది.

సరిగ్గా అప్పుడే బిల్డింగ్‌లో ఫోన్ మోగింది.

ఆ ఫోన్ వున్నది బెడ్‌రూంలో.

ఆ బెడ్‌రూమ్ నూర్జహాన్‌ది.

కానీ ఆ బెడ్‌రూంలో ఆ సమయంలో నూర్జహాన్ లేదు.

నూర్జహాన్ బెడ్‌మీద పడుకొని మోగుతున్న టెలిఫోన్‌ను నవ్వుతూ కాస్సేపు చూశాడు అరవింద్.

ఫోను రింగ్ కావటం ఎంతకీ ఆగలేదు.

అరవింద్ ఫోన్ ఎత్తాడు.

"హల్లో నూర్జా...ఏమిటి చేస్తున్నావ్? లత అన్న ఓ అమ్మాయిని గురించి నీకు చెప్పేను కదూ? ఆ అమ్మాయితో ఇవాళ మాట్లాడేను. ఆమెకు పెళ్లి కావాలిట"

అరవింద్ మొహం ఆనందంతో వెలిగిపోయింది. హుషారు వచ్చింది. లేచి కూర్చున్నాడు.

"ఏమిటి నూర్జా మాట్లాడవ్? లతకు పెళ్లే కావాలిట. పెళ్లి తప్ప మరేమీ అక్కర్లేదుట నూర్!"

"చేసేద్దాం"

ఆ మాట అనేశాక నాలిక కొరుక్కొన్నాడు అరవింద్. నాలిక కొరుక్కొనే ప్రయత్నంలో పెదిమల మధ్య సిగరెట్టు ఒళ్ళో పడింది. తొడ చురుక్కుమంది. చేతిలో ఫోను బెడ్‌మీద పడింది. అరవింద్ హడావుడిగా బెడ్‌మీద నుంచి లేచి సిగరెట్‌ని దులిపేశాడు. పేంటుకు అంటుకొన్న నిప్పుని చేతితో నలిపేసి సిగరెట్‌ను కాలితో కసకసా నలిపేసేడు.

"హల్లో..." ఫోన్ ఎత్తి పిలిచేడు.

"గుర్...గుర్..."

విసుగ్గా ఫోన్ క్రెడిల్‌మీద పెట్టేశాడతను.

* * *

ఫోన్ క్రెడిల్‌మీద పెట్టి లత వైపు చూసింది కరుణ.

లత కళ్లు ఆమెను గుచ్చి గుచ్చి చూస్తున్నాయి.

"ఏమిటలా చూస్తున్నావ్? రాంగ్ నెంబర్. నీ పెళ్లి విషయం నేను చూసుకొంటాలే. అందాక హాయిగా ఇక్కడే వుండు"

"మీ అభిమానానికి కృతజ్ఞురాలిని మేడమ్! కానీ ఎన్నాళ్ళని ఇక్కడ వుండను? నాకు ఇష్టం లేదు"

"ఏం? నీకు నా ఇంట్లో లోటేమైనా జరిగిందా? అయినా ఎక్కడికి వెళ్తావ్, ఏం చేస్తావ్?"

అవును. తను ఎక్కడికి వెళ్తుంది? ఏం చేయాలి?

"కాలేజీలో సీటు, ఉద్యోగం, ఆఖరికి ఓ లీటర్ కిరసనాయిల్ కూడా మహా మహా వాళ్ళకి కావాలనగానే చిక్కని రోజులివి. పెళ్లి కావాలనుకోగానే మొగుడొచ్చి ఒళ్ళో వాలుతాడా? కాస్త టైమ్ పడుతుంది. ఒట్టి పిచ్చిదానిలాగున్నావే. సుఖానవున్న ప్రాణాన్ని కష్టపెట్టుకొంటానంటావ్ సరే. ఆ విషయాలు తర్వాత ఆలోచిద్దాం. ఇప్పుడు నాకు పనుంది" అంటూ కరుణ లేచింది.

* * *

"ఇందాక నాకు ఫోనులో రిప్లయి ఇచ్చిందెవరు?" కరుణ కోపంగా అడిగింది.

నూర్జహాన్ మెల్లగా నవ్వింది.




"శాంతించండి మేమ్‌సాబ్. అతను నాకు చాలా ఆత్మీయుడు. గురుతుల్యుడు. 'సంస్కరణ' అన్న ఓ గొప్ప సినిమా వచ్చింది దాదాపు అయిదేళ్ళ క్రితం. ఆ చిత్ర దర్శకుడు అతను. పరిచయం చెయ్యమంటే చేస్తాను"

కరుణ ప్రసన్నురాలయింది. ఆమె మనోభావనను గ్రహించి నూర్జహాన్ లోపలికి నడిచింది.

""అరవింద్ ! ఈమె.... కరుణా శ్రీధరన్"

పరిచయాలయ్యాయి. అరవింద్ విలాసంగా నవ్వేడు.

"ఇందాక మీకు కోపం వచ్చిందికదూ? ఫోను పెట్టేసేరు"

"ఫోను పెట్టేస్తే కోపం వచ్చినట్లు లెక్కా? అలా అని మీరు ఎందుకను కొన్నారు?"

"నేను సినిమా దర్శకుడిని మేడమ్! లెన్స్‌లలో నుంచి చూడటం వెన్నతో పెట్టిన విద్య. మీ మనసును అప్పుడే మీ గుండెల లెన్స్‌లలో నుంచి చూసేశాను. కరుణ గుండెలవైపు చూస్తూ అరవింద్ సూటిగా అన్నాడు.

కరుణ కంగారు పడింది. అసంకల్పిత చర్యగా పమిట సవరించుకొంది. మొహం లోకి సిగ్గు కమ్ముకొచ్చింది. మాటలో ఠీవి, కఠినత్వం పోయాయి.

"కాఫీ తీసుకొస్తాను మేమ్‌సాబ్" అంటూ నూర్జహాన్ ఆ గదిలో నుంచి వెళ్ళిపోయింది.

"నూర్‌కి, మీకు పరిచయం ఎలా?"

"ఆమె ఒకప్పుడు సినిమాల్లో ఎక్స్‌ట్రా నటి. నేను కథారచయితను, స్క్రీన్‌ప్లే రచయితను, దర్శకుడిని. అదే మా మధ్య బంధం. అది అంటే ఏమిటో ననుకొనేరు? కెమేరా"

కరుణ నవ్వింది. "మీరు చాలా తమాషాగా మాట్లాడుతారే" అంది మెల్లగా నవ్వి అతడిని పరిశీలనగా చూస్తూ.

"మాట్లాడటమే కాదు మేడమ్! అవకాశాలు రావాలి కాని నేను చాలా చాలా తమాషాలు చేయగలను. తెల్సా?"

"ఊ!'' అంటూ కరుణ నవ్వింది.

సరిగ్గా అప్పుడే నూర్జహాన్ కాఫీలు తీసుకుని ప్రవేశించడం ఆమెకు నచ్చినట్లు కన్పించలేదు.

"అన్నట్లు మేమ్‌సాబ్ ఎవరా లత? పెళ్ళి చేయాలన్నారుట!"

"లత గురించి చెప్పాలంటే చాలా కథ వుంది ఇప్పుడు కాదు."

'నాకా లతను వెంటనే చూడాలని ఉంది' నోటిదాకా వచ్చిన మాటను బలవంతంగాఅణగదొక్కేశాడు అరవింద్. అడిగితే ఆమె లతను అసలు చూపించదు. ఆడవాళ్ళకు అసూయ జాస్తి. అందులో మగాడి దగ్గర మరీ జాస్తి!

"నా సినిమా మీరు చూశారా?" అరవింద్ కాఫీ కప్పు టేబిల్ మీద పెట్టి సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు.

'సంస్కరణ' సినిమాను నిజానికి కరుణ చూసింది.

ఆ సినిమా ఆర్థికంగా ఫ్లాప్ అయింది. అయినా విమర్శకులు బాగుందన్నారు. అందులో ఆదర్శం వున్నతమయిన దన్నారు.

కానీ కరుణకు ఆ సినిమాలో ఆదర్శవంతంగా వున్న ఆ ఇతివృత్తమే నచ్చలేదు. సినిమాలోని మిగతా అంశాలు నచ్చాయి.

సినిమాకు అవార్డులు ఇచ్చే సందర్భంగా ఈ ప్రసక్తులన్నీ వచ్చాయి. ఆ

సినిమాకి అవార్డు రాకుండా అడ్డంకొట్టింది కరుణ!

అదంతా ఓ క్షణం గుర్తుకొచ్చింది కరుణకు.

"చూడలేదు" అంది మెల్లగా.

"అయితే సమయం చూసి నేనే స్వయంగా చూపిస్తాను. కానీ ఒక్క కండిషన్"

"ఏమిటి?"

"నేను సినిమా చూపించటానికి లంచంగా ముందు మీరు నాకు మీ ఇంటిని చూపించాలి."

"ఓస్. ఇంతేనా?"

"ఇంకేం అడుగుతాననుకొన్నారు?"

"మా ఇంటికి ఇప్పుడే వెళ్దాం రండి. నూర్! నువ్వు కూడా రారాదూ?" కరుణ లేస్తూ నూర్జహాన్ వైపు చూసి అంది.

"దిస్ ఈజ్ బిజినెస్ టైమ్ మేమ్‌సాబ్. ఈ టైమ్‌లో ఇల్లు విడిచి వెళ్ళటం మంచిది కాదుకదా?"

కరుణ మాట్లాడలేదు. కారు దగ్గరికి వెళ్ళి డ్రైవింగ్ సీట్‌లో కూర్చుంది.

అరవింద్ డ్రెస్‌మార్చుకొని 'ట్రిమ్'గా తయారయి వచ్చాడు. బాక్‌డోర్ తెరవ బోయాడు. కరుణ ఫ్రంట్ డోర్ తెర్చింది.



"ఇక్కడ కూర్చోండి మిస్టర్ అరవింద్"

"థాంక్యూ"

కారు కదిలింది.

"ముసలితనంలో ప్రేమలో పడి నట్లుంది పాపం"

వెళ్తున్న కారును చూసి నవ్వుకొంటూ లోపలికి వెళ్ళింది సూర్జహాన్.

*　　*　　*

"అమ్మాయిగారూ! ఎక్కడికి వెళ్తున్నారు?"

ప్రశ్న అడిగిన నౌకరు వైపు విసుగ్గా, కోపంగా చూసింది లత.

ఇన్నాళ్ళ తర్వాత తను స్వేచ్ఛగా అలా సిటీ తిరిగి రావాలని వెళ్తోంటే వీడి అపశకునం ఏమిటి?

"ఎక్కడికి వెళ్తే నీకెందుకుట! నీ పని నువ్వు చూసుకోరాదూ?"

"అదేంటమ్మగారూ అలా కోప్పడుతారు? మీరెక్కడికెళ్ళారని అమ్మగారు వచ్చి అడిగితే ఏం చెప్పను నేను? అందుకని..."

"అమ్మగారు ఎక్కడికెళ్లారని నేనడిగితే నాకు చెప్తున్నావా? ఇదీ అంతేలే"

లతకి ఆ ఇల్లు బంగారు పంజరంలా కన్పించింది. ఉక్కు పంజరమైనా బంగారు పంజరమైనా పంజరం పంజరమేగా? అసలు అలా ఒక్కసారి ఊళ్ళో కెళ్ళి తిరిగొస్తే? కొత్త అనుభవం నూతన



ఆలోచనలు రావచ్చుగా?

"మేడమ్ ఎక్కడికో బయలు దేరి నట్లున్నారు? షల్ ఐ గివ్ ఎ లిఫ్ట్?" కారు డోరు తెర్చిపట్టుకొని శ్రీధరన్ అడిగేడు.

లత తన రిస్ట్‌వాచీ చూసుకొంది.

మధ్యాహ్నం పన్నెండు దాటింది.

ఆకాశం వైపు చూసింది. సూర్యుడు నడినెత్తిమీద వున్నాడు.

ఆఫీసులో ఉండాల్సిన సమయంలో శ్రీధరన్ ఇక్కడ ఎందుకున్నాడు? తనని వెంబడిస్తూ, తన చర్యల్ని గమనించటం లేదుకదా?

అనుమానంగా చూసింది అతని వైపు.

"మీరు ఊరు చూడలేదనుకొంటాను! సిటీ బస్సుల్లో, ఆటోలో వెళ్ళాలంటే చాలా కష్టం. పైగా మీకు ఊరు కొత్త కదా? ఇవేళ నేను మనసు బాగా లేక శలవు పెట్టేను. ఖాళీనే. మీకు సిటీ అంతా కారులో చూపిస్తాను. తద్వారా నాకు మనశ్శాంతి కలుగుతుంది. ప్లీజ్..."

చాలా గొప్ప వ్యక్తి! సిటీ చూపిస్తానని అర్థిస్తున్నాడు!

భయమేమిటి? వెళ్ళేనేం?

ఫ్రంట్ సీటులోనే కూర్చుంది.

టాంక్‌బండ్... సెక్రెటేరియేట్... రవీంద్రభారతి... అసెంబ్లీ ... రేడియో స్టేషను... పబ్లిక్‌గార్డెన్... ఆబిడ్స్... సుల్తాన్‌బజార్... సాలార్ జంగ్ మ్యూజియం... చార్మినార్...

"కారులోనుంచే అన్నీ చూపిస్తున్నారే! ఇలాగయితే దేశం చూడటం భలే సుఖం. బొమ్మల్లో చూస్తే సరిపోతుందిగా?"

"ఏది ఎక్కడుందో, ఎలా వుంటుందో ఇవాళ తెల్సుకోండి. మరోసారి వివరంగా చూద్దురుగాని..."



జూ... గండిపేట...

"పార్కులో కాస్సేపు కూర్చొని పోదామా?"

సూర్యుడు ఆ రోజుకు శలవు తీసుకొని విశ్రాంతి మందిరంలోకి వెళ్ళటానికి సన్నద్ధమవుతున్నాడు.

"చీకటి పడుతున్నదేమో! త్వరగా వెళ్ళిపోతే మంచిదిగదా?"

"చీకటిపడ్డేనేం? కారులో ఎంతసేపు వెళ్ళటం?"

మళ్ళీ అనుమానం. ఒంటరిగా తనని ఏం చెయ్యడుకదా?

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మీకు చీకటంటే భయమా?"

అవును తనకు చీకటంటే భయమే. చీకటి మనుషులంటే మరీ భయం.

"అయితే వద్దులెండి. వెళ్లిపోదాం"

శ్రీధరన్ కారు స్టార్టు చేయబోయాడు.

"వద్దు...వద్దు. నాకేం భయం లేదు. ఓ అరగంట కూర్చొనే వెళ్దాం. మీరు మటుకు కంటిన్యుయెస్‌గా ఎంతసేపని డ్రైవ్ చేస్తారు?"

"అయితే కారు పార్కు చేసి వస్తానుండండి"

లత ఒంటరిగా నిలబడింది.

అల్లంత దూరంలో ఓ బిల్డింగ్ అందంగా వుంది- అంచేత లతను ఆకర్షించింది.

అక్కడ...

అక్కడా వ్యక్తి ఎవరు?

కరుణ!

ఆమె పక్కన వున్న ఆ వ్యక్తి? వెనక్కి తిరిగి ఉన్నాడతను.

ఇద్దరూ కారు ఎక్కేరు. కారు స్టార్టు అయింది.

అమ్మో! ఆమె తనని, శ్రీధరన్‌ని చూస్తే ఏమన్నా ఉందా?

లత పక్కకి వెళ్ళింది.

కారు చూసుకొని వెళ్ళింది. సందేహం లేదు. ఆమె కరుణే! కానీ ఆ పక్క నున్న అతను ఎవరు? మొహమన్నా కన్పించలేదే?

"కమాన్ మిస్ లతా ... లెట్ అజ్ గో..."

ఆమె పార్కులో నడుస్తోంది. కానీ మనసంతా పరధ్యానంగా ఉంది. కరుణను తను మరో పురుషుడితో చూసినట్లు శ్రీధరన్‌కి చెప్పాలా... చెప్పకూడదా?

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"ఏం లేదు..."

"మిస్‌లతా! కరుణను గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

శ్రీధరన్ ప్రశ్నకు ఆశ్చర్యపోయింది లత. ఏమని జవాబివ్వడం? అసలు ఆ ప్రశ్న ఎందుకు అడిగినట్లు అతను?

"నేను పెద్ద ఆఫీసర్‌ని లతా! ఎన్నో ఆశలు పెట్టుకుని, ఎంతో గాఢంగా ప్రేమించి కరుణను పెళ్ళి చేసుకొన్నాను. జీవితంలో నేను చేసిన పెద్ద పొరపాటు అది ఒక్కటే అన్పిస్తోంది నాకు"

"పొరపాటా! అంటే...?"

"అంటే ఏమిటో ఎవరితోనూ చెప్పుకోలేను. చెప్పుకోక కడుపులో దాచుకోలేను. ఆ బాధ దావానలం లాంటిది లతా..."

అతను తన బాధను చెప్పుకోటానికి తనని ఇంత దూరం తీసుకొచ్చినట్లు గ్రహించింది లత.

"అదంతా నీకు చెప్పుకోవాలనే ఉంది. కానీ ఇప్పుడు కాదు. ఇది సమయం కాదు. చీకటి పడుతున్నది. ఇక వెళ్దామా?"

అతనే ముందుగా లేచాడు. లత మౌనంగా అతడిని అనుసరించింది. కారు ఎక్కింది.

మెత్తటి రోడ్డుమీద కారు నల్లటి తాచులా చర్రుమని పాకుతూ పోతోంది. శ్రీధరన్ కారు నడిపే స్పీడుకు లత భయపడసాగింది.

"ఏమండీ! అంత స్పీడెందుకు? కాస్త తగ్గించకూడదూ... ప్లీజ్!"

శ్రీధరన్ నవ్వేడు. స్పీడు తగ్గించాడు.

"కారు అంత స్పీడు నడిపేను కనుక నాకు ప్రాణం మీద తీపిలేదని అనుకోకు లతా! నాకూ ప్రాణభయం ఉంది. అందరిలాగా జీవితాన్ని తీపిగా గడపాలని ఉంది. కానీ..."

ముందు వెళ్తున్న కారుకు బ్రేకు పడటంతో హఠాత్తుగా బ్రేక్ వేసేడు శ్రీధరన్. హారన్ కొట్టి ఆ కారును ఓవర్ టేక్ చేసేడు.

"కానీ దేనికైనా అదృష్టం వుండాలిగా"

"నాకు మీ మాటలు నమ్మబుద్ధి వేయటం లేదండీ! మీకేం తక్కువ?"

అతను నవ్వి ఊరుకున్నాడు.

కారు సిటీ పొలిమేరల్ని చేరుకొంటోంది.

"మిస్ లతా! మెరిసేదంతా బంగారం కాదన్న మాట సత్యం. నాగరికత ముసుగు కింద, సభ్యత, సంస్కారం అనే బంగారు పెట్టెల అడుగున ఎంత మలినముందో అనుభవంవల్ల తెల్సుకోవాల్సిందే. మనిషి మనసును చదివే యంత్రాన్ని దేన్నైనా కనిపెడ్తే కాని, జీవితంలో నీకు సుఖాన్నిచ్చే పార్టనర్‌ని కనుక్కోవటం కష్టమే మోనసి పిస్తోంది నాకు. సృష్టిలోకెల్లా కాంప్లికేటెడ్ పదార్థం ఏదన్నా వున్నదంటే అది మనస్సు. మానవుడి సుఖసంతో

షాలకి, దుఃఖానికి, శోకానికి కారణం ఆకలి తర్వాత ఈ మనస్సే లతా!"

కారును ఓ పెద్ద హోటల్లోకి తీసుకెళ్లి పార్కు చేసేడు.

"కాసింత కాఫీ తాగి వెళ్దాం లతా!"

ఇద్దరూ లోపలికి వెళ్ళేరు. ఏసీ రూమ్‌లో ఎవ్వరూ లేరు.

మళ్ళీ లతకు ఏదో అనుమానం!? ఇన్ని చెప్పి చివరికి అతను తనను పెళ్ళి చేసుకోమనో, మరేదో కోరడు గదా?

"లతా! కరుణ పెళ్ళి చేసుకోవాలన్న నీ కోరికను తీరుస్తుందని అనుకొంటున్నావా?"

"అనవసరంగా నేను ఎవరినీ అనుమానించనండీ!"

"కరుణకు వివాహ వ్యవస్థ మీదే నమ్మకం లేదు లతా! నీ పెళ్ళికి ఆమె సహాయం చేస్తే అది ఒక పెద్ద వండర్. మే గాడ్ బ్లెస్ యూ!"

* * *

ఆ రాత్రి లతకు నిద్రపట్టలేదు. శ్రీధరన్ మాటలనే పునశ్చరణ చేసుకో సాగింది.

శ్రీధరన్.... కరుణ...!

ఇద్దరి మధ్య పెద్ద సయోధ్య లేదన్నది సత్యం. ఇద్దరూ అంటీ ముట్టనట్లు ఉంటారు. శ్రీధరన్‌కు కరుణ పెద్ద విలువ ఇవ్వదు కానీ ఆ పద్ధతులన్నీ హైక్లాస్ సొసైటీ జీవితంలో భాగాలు అనుకొంది. కాని ఇద్దరి దాంపత్య జీవితంలో అగడ్తలున్నట్లు వూహించలేదు లత.

ఇద్దరిలో ఎవరిని నమ్మటం... ఏం చేయటం?

అర్ధరాత్రి దాకా ఆలోచనలు ... ఆలోచనలు...మనసుతోపాటు శరీరమూ అలసిపోయింది. రెప్పల మీదికి మత్తు వచ్చింది.

గది తలుపులు తీసే ఉన్నాయి. లైటు వేసేవుంది.

లైటు ఆర్పేసి, తలుపు మూసి రావాలంటే లేవాలి.

లతకు లేవబుద్ధేయలేదు. లేస్తే నిద్ర మత్తు పోతుంది.

తలుపులు తీసిఉంటే మాత్రమేం?

ఆమె కళ్లు మూతలుపడ్డాయి.




అకస్మాత్తుగా ఉలిక్కిపడ్డట్లు ఆమె బెడ్ పైనుంచి లేచింది.

లైటు అలాగే వెలుగుతూనే ఉంది. తలుపులు తెరిచేఉన్నాయి. కానీ గదిలో ఏదో సుగంధం...

అలాంటి పరిమళం లతకు కొత్తకాదు.

ఆ సెంటు శ్రీధరన్ వాడుతాదని తెల్సు.

అంటే... అర్ధరాత్రి శ్రీధరన్ తన గదిలోకి వచ్చాడా?

ఎందుకు?

వచ్చి ఏంచేశాడు?

ఆమె అద్దంలో తన ప్రతిబింబం చూసుకొంది. బెడ్‌ను చూసింది. కుర్చీ పక్కన హేండ్ ఖర్చీఫ్!

ఎక్కడో ఇద్దరు మాట్లాడుకొంటున్న చప్పుడు సన్నగా!




జాగ్రత్తగా ఆ శబ్దాల్ని గమనించింది. ఆ శబ్దాలు శ్రీధరన్ గదినుంచి వస్తున్నాయి. శ్రీధరన్ బెడ్‌రూమ్ కరుణ బెడ్‌రూమ్ పక్కన ఉంది.

ఆమె తన గదిలో లైటు ఆర్పివేసింది. చకచకా నడిచి ఆ గదివద్దకెళ్ళింది.

గది తలుపులు వేసి ఉన్నాయి. పైగా ఎయిర్‌కండిషన్డ్ గది. అయినా ఎక్కడ లీకేజ్ ఉందో లోపలిమాటలు బయటకి అస్పష్టంగానే అయినా విన్పిస్తున్నాయి.

"ఏ సంబంధం లేకపోతే అర్ధరాత్రి ఆ పిల్ల గదిలోకి వెళ్ళాల్సిన అవసరం నీకేమిటి? ఛీ ఛీ... పైకి పెద్ద పవిత్రుడు, ఏకపత్నీవ్రతుడు అయినట్లు పోజు... మనసులో దుర్మార్గపు ఆలోచనలు"

శ్రీధరన్ మెల్లగా ఏదో చెప్పాడు. కానీ అతని మాటలు గదిదాటి బయటికొచ్చి లతకు విన్పించలేదు.

"నా పద్ధతులు నీకంతగా నచ్చకపోతే విడాకులు ఇమ్మన్నానా? అసలు నిన్ను పెళ్ళి చేసుకొనేటపుడే నాకు స్వేచ్ఛ ఉండాలని కండీషన్ పెట్టేను. గుర్తుంచుకో. నీకు ఎదగటం చాతకాదు. నేను ఎదుగుతుంటే చూసి ఓర్చలేవు. ఛీ ఛీ..."

కాస్సేపయ్యాక-

"ఇక నోరు మూసుకుని పడుకో. నాకు నిద్ర వస్తోంది. నా ఇంట్లో, నా ఎదురుగా నీ మగసిరి చూపించుకోవాలనుకొంటున్నావేమో? నీ శక్తిసామర్థ్యాలు నీకన్నా నాకే బాగా తెల్సు. మరెప్పుడూ ఇలాంటి పిచ్చిపిచ్చి వేషాలెయ్యకు"

గదిలో లైటు ఆరిపోయింది. శబ్దాలు ఆగిపోయాయి.

* * *

"రా రా... నీ కోసం నేనే కబురు చేద్దామనుకుంటున్నాను"

లత ఆమె చూపించిన సోఫాలో కూర్చోలేదు.

"ఇన్నాళ్ళు మీ ఇంట్లోనాకు ఆశ్రయం ఇచ్చినందుకు ధన్యవాదాలండీ! ఇక ఒక్కరోజు కూడా నేనిక్కడ వుండలేను. మీ అనుమతి తీసుకొని వెళ్ళిపోదామని వచ్చాను"

"ఎక్కడికి వెళ్తావ్?"

"ఇక్కడికి వద్దామని బయలుదేరేనా? విధి మీ వద్దకు ఈడ్చుకొచ్చింది గదా! అలాగే..."

"అలాగే విధి ఎక్కడికి లాక్కువెళ్తే అక్కడికి వెళ్తావా? నీకు పిచ్చా ఏమిటి? వయసులోవున్న అందమైన ఆడపిల్లవి. నువ్వు [illegible]గా ఎక్కడికో వెళ్తానంటే పట్టుకు నేనెలా పంపిస్తాను. నో నో... అదేం కుదరదు. కానీ నువ్వు ఇక ఈ ఇంట్లో కూడా ఉండడానికి వీల్లేదు. నిన్ను భద్రంగా ఎక్కడికైనా పంపిస్తాను. పదిహేను నిమిషాలు టైమ్ ఇవ్వు. ఈలోగా నువ్వు నీ గదికి వెళ్ళి మరో మజిలీకి సిద్ధంకా"

''కానీ మేడమ్! నా కోరిక తీర్చే శక్తి వుంటేనే మీరు శ్రమ తీసుకోండి. లేకపోతే నా దోవన నన్ను..."

"మిస్ లతా! నేను చాలా పట్టుదల మనిషిని. నా సంగతి నీకింకా తెలియదు. నీకు పెళ్ళి కావాలనీ, అందుకే పారిపోయి వచ్చావనీ నాకు తెల్సు. అంతేకాదు. నువ్వు దేవదాసీల వంశంలో పుట్టావనీ, ఎవరో యువకుడు నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకొంటానని పారిపోయాడనీ, మీ అమ్మ నిన్ను మరెవరికో ఇచ్చి పెళ్ళిచేయబోతే పారిపోయావనీ..."

అయితే తన చరిత్రంతా సేకరించిం



పన్నమాట!

"మేడమ్.! ఈ చరిత్రంతా నేనే చెప్పి ఉండేదాన్ని. శ్రమపడి మీరు సేకరించారు. ధన్యవాదాలు. కానీ నా పెళ్ళి చేయించ టానికి మీకు నా కుటుంబ చరిత్ర అవసర మయిందా?"

"నీ భవిష్యత్తు నిర్ణయించటానికి అవ సరం కదా"

"నా భవిష్యత్తును నేను ఎప్పుడో నిర్ణ యించుకున్నాను."

"కానీ నువ్వు నిర్ణయించుకొన్నట్లు జరుగలేదుగా ?"

"అయితే మీరెలాగ నా భవిష్యత్తును నిర్ణయించారు ?"

"చూస్తావుగా ? పదిహేను నిమిషాలు ఆగిరా"

* * *

సరిగ్గా పది నిమిషాల తర్వాత లత శ్రీధరన్ గది తలుపుతట్టింది. శ్రీధరన్ తలుపు తెర్చేడు.

"మీరా!?"

"ఊ...నేనే. మీ వస్తువును మీకిచ్చి పోదామని వచ్చాను."

ఆమె కర్చీఫ్ తీసి చేతిలో పట్టుకొంది.

శ్రీధరన్ నిక్కచచ్చిపోయాడు. సిగ్గుతో తలవంచుకొన్నాడు

"ఇది ఎప్పుడు ఎలా ఎందుకు నా గది లోకి వచ్చిందో నాకు తెలియదు. తెల్సు కోవాలన్న ఉత్సాహం, ఆసక్తి కూడా నాకులేవు. కానీ మనిషికి నీతి నిజాయితీ, చిత్తశుద్ధి అవసరం అని గుర్తుంచుకోండి. అవి లేని మనిషి చెల్లని నయాపైసా లాంటివాడు. గుడ్ బై"

ఆమె కర్చీఫ్‌ను ఓ కుర్చీమీదికి గిరాటువేసి వెనక్కి నడచి తలుపు తెరవ బోతోంది.

అకస్మాత్తుగా ఆమె ఆగి వెనక్కి చూసింది.

శ్రీధరన్ నెత్తిబాదుకొని ఏడుస్తు న్నాడు.

"ఆడవాళ్లు దొంగ ఏడుపులు ఏడ్చినా అందంగా ఉంటుంది. మగవాడు నిజంగా ఏడ్చినా అసహ్యంగా ఉంటుంది"

"మిస్ లతా ప్లీజ్, ఒక్కమాట. అదే నా ఆఖరి కోరిక. నువ్వు ఇక్కడి నుంచి వెళ్ళిపో. కానీ కరుణ పంపించే చోటికి కాదు. మరెక్కడికైనా. నీ..."

లత తలుపు తెర్చింది..

అవతలకి వెళ్ళి విసురుగా తలుపు వేసేసింది.

* * *

"లతా! నీ కోరిక తీర్చబోతున్నాను. నీ కోరిక పెళ్ళి చేసుకోవాలని గదా! ఆ ఏర్పాటు చేసి పంపుతున్నాను. డ్రైవరు నిన్ను కారులో ఎక్కడ దిగవేస్తే అక్కడ దిగిపో. ఊ"

కారు కదిలింది. నగరంలో ఎక్క డెక్కడో తిరుగుతోంది.

నగరం ఇంకా పూర్తిగా నిద్రలేవ లేదు. సందడి ఆరంభం కాలేదు.

కారు పెట్రోలు కొట్టించుకోటానికి ఓ బంకు దగ్గర ఆగింది.

ప్రాతఃకాలభానుడు వెచ్చగా వున్నాడు. ఉషామారుతం చల్లగా వుంది. స్వచ్ఛ మైన, స్వేచ్ఛాయుతమైన ఆ గాలిని పీల్చు కోటానికి, ప్రకృతిని ఆనందించాలన్న కోరిక కలిగింది లతకు.

కారు దిగింది.

రోడ్డు మీద అప్పుడో కారు—ఇప్పుడో ఆటో.. అప్పుడప్పుడు బస్సులు...

ఎవరో డబుల్స్ రైడింగ్ చేస్తూ





సైకిలు మీద భారంగా పోతున్నారు.

ఉన్నట్లుండి కారు వెనగ్గా వచ్చి ఓ టాక్సీ ఆగింది పెట్రోలుకోసమే!

అందులో నుంచి ఓ వ్యక్తి దిగేడు. అటువైపు డోర్ నుంచి మరో ఇద్దరు దిగేరు.

అతను... అతను...

లత గుండె అదిరింది.

అసంకల్పితంగా కారులోకి ఎక్కి కూర్చుంది.

ఆ వ్యక్తి ఆమెను చూసేసరికే కారు డ్రైవర్ పెట్రోలు బిల్లు చెల్లించి వచ్చాడు.

"త్వరగా పోనియ్ డ్రైవర్!"

ఆ వ్యక్తి చకచకా నడిచి లత కారు డోర్ దగ్గరి కొచ్చాడు. కారు బాక్ సీట్ వద్ద డోర్‌కు నల్ల అద్దాలు ఉండటం వల్ల లోపల ఉన్న లత కన్పించలేదు. అతను డ్రైవర్ సీటు వద్దకెళ్ళి లోపలికి తొంగి చూడబోయాడు—

"కోన్‌హో తుమ్?"

డ్రైవర్ కారు స్టార్టు చేసేడు.

అయినా లత అతని కంట పడనే పడింది.

అతను అశోక్‌కుమార్!

* * *

పెద్ద ఐరన్ గేట్. ఆ కాంపౌండ్ లోపల దాదాపు ఫర్లాంగు దూరం పోతే కన్పించే నవాబుల కాలంనాటి బిల్డింగ్...!

డ్రైవరు ఇక్కడికి తీసుకొచ్చాడేమిటి? చిరునామా పొరపాటు పడలేదు గదా ?

పైగా కారు వెళ్ళి ముందు భాగంలో ఆగలేదు. పక్కకు తిరిగి వెళ్ళి వెనుక వైపునున్న ఓ ద్వారం ముందు ఆగింది.

"ఇదేమిటి డ్రైవర్! ఇక్కడికి తీసుకొచ్చావేమిటి?"

కారు డ్రైవర్ మౌనంగా కారు డోర్ తెర్చుకొని దిగేడు. లత వైపునున్న డోర్ తెర్చి పట్టుకొన్నాడు.

"దిగండి మేడమ్! మేమ్‌సాబ్ మిమ్మల్ని ఇక్కడే దించి రమ్మన్నారు. ఫోనులో నూర్జహాన్ బేగంతో మాట్లాడేరు. అదిగో అదే బేగమ్‌గారి గది. కాలింగ్ బెల్ నొక్కండి. అదిగో."

లత కారుదిగింది. కారు వెళ్ళిపోయింది.

డోర్ వద్దకెళ్ళి లత బజర్ నొక్కింది.

"కమిన్!"

గది తలుపు నెట్టింది లత.

అరవింద్ ఓ ఈజీ ఛైర్‌లో కూర్చుని దీక్షగా ఓ ఇంగ్లీషు పుస్తకాన్ని చదువుతున్నాడు.

ఆమె అతడిని చూస్తూ కాసేపు అలాగే నిలబడిపోయింది.

ఇతనేనా తనని పెళ్ళి చేసుకోబోయే యువకుడు?

ఆ భావనా మాత్రంగానే ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది. చెంపలు ఎర్రబడ్డాయి. కళ్ళు వాలిపోయాయి.

అతను అందంగానే ఉన్నాడు. అసలు తను పురుషుడి అందానికి ప్రాధాన్యత నిచ్చిందా? అలా అందమే తనకు ప్రధానమైతే అశోక్‌కుమార్‌కేం లోటుంది?

ఇతనెవరో... గుణం ఎలాంటిదో ?

చూడబోతే ధనవంతుడిలా ఉన్నాడు. ఈ ఇల్లు ఇతనిదేనా? ఇంతటి ధనవంతుడు తనని ఎందుకు చేసుకోటానికి అంగీకరిస్తాడు ? కరుణ తన కథంతా అతనికి చెప్పిందా?

"సార్ ... నూర్జహాన్ బేగం గారున్నారా?"

అతను పుస్తకంలోనుంచి తల తిప్పి ఆమె వంక చూశాడు.

ఆమె అతడి కళ్ళలోకి చూడలేక పోయింది. పెళ్ళిచూపులకు వచ్చిన యువకుడు కళ్ళల్లోకి చూడగానే తల వంచుకొనే యువతిలా సిగ్గుతో తల వంచుకొంది.

"ఓ! సారీ....కమిన్ ప్లీజ్! లోపలికి రండి.మీరు..." అతను లేచి ఆమెకు సీటు చూపి మర్యాద చేస్తూ ప్రశ్నార్థకంగా అన్నాడు.

తనెవరో ఏం చెప్పాలి? ఏమని చెప్పుకోవాలి?

"నేనూ..."

"మా నూర్జహాన్ స్నేహితురాలా ?"

"కాదండీ! నన్ను కరుణా శ్రీధరన్ గారు ఇక్కడికి పంపించారు."

"కరుణాశ్రీధరన్! అంటే .. ఆమె ఎవరు?"

లతకు ఇక అతనికి ఎలా, ఏం



చెప్పాలో తోచలేదు.

"సరేలెండి! నూర్జహాన్‌ను పిలుస్తా నుండండి"

అతను వెళ్ళబోతూ ఆగేడు.

అతని ప్రతి కదలిక ఎంత డ్రెమెటిక్‌గా, అందంగా, హుందాగా ఉంది.

"అన్నట్లు మీ పేరేమిటో అడగ వచ్చా?"

"లత"

"లత.. లత అంటే మీరేనా? ఓ.... వెరీ వెరీ హేపీ టు మీట్ యూ! అవునూ నేనెవరో పరిచయం చేసుకోలేదు కదూ? నా పేరు అరవింద్"

"అరవింద్" మెల్లగా గొణిగిందామె.

"ఏం? ఆ పేరు ఎక్కడన్నా విన్న గుర్తుందా?"

"ఊ" అని మెల్లగా అని తలూపింది.

"అయితే మీరు సినిమాలు చూస్తా రన్నమాట! మంచి టేస్టున్న సినిమా ప్రేక్షకులలో మీరూ ఒకరన్నమాట! యామ్ ఐ రైట్? మీకు నా పేరు వినగానే ఏ సినిమా గుర్తుకొచ్చింది? చెప్పండి"

"సంస్కరణ. నాకు బాగా నచ్చిన సినిమా అది"

"ఈజ్ ఇట్!? మీలాంటి ఒక్క మంచి అభిమానన్నా నా సినిమాకు ఉన్నందుకు నేను ఈ క్షణంలో గర్విస్తున్నాను. నా నష్టకష్టాలన్నిటికీ ఫలితం లభించి నట్లుగా సంతోషిస్తున్నా"

"అయితే సంస్కరణ దర్శక నిర్మాత అరవింద్, మీరూ ఒక్కరేనా?" ఆమె తలెత్తి ధైర్యంగా, ఆరాధనగా అతని వైపు చూసింది.

"ఏదో ఆదర్శానికి పోయి సినిమా తీసి చెయ్యి కాల్చుకొన్న ఆ మందభాగ్యుడిని,



దురదృష్ట జాతకుడిని నేనే"

సంస్కరణ సినిమా కథ క్లుప్తంగా లత మనసులో ఒక్కక్షణం తిరిగింది.

ఓ హరిజన యువతి పెళ్ళయ్యాక భర్తతో తొలిసారి అత్తవారింటికి పోతుంటుంది. మార్గమధ్యంలో భర్త చనిపోతాడు ఆ దృశ్యాన్ని ఓ యువకుడు చూస్తాడు. ఆమె స్థితికి జాలిపడ్తాడు. ఆమె ఇప్పుడు విధవ. హరిజన యువతి. అతను అగ్రకులస్తుడు. ధనవంతుడు. అయినా ఆ పేద హరిజన విధవ యువతిని పెళ్లి చేసుకొంటాడు. ఇటు అగ్రపక్షాలవారు, హరిజన పక్షాలవారు కూడా వారిద్దరినీ ఆదరించరు. వెలివేస్తారు. వారికి ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. వాటినన్నిటినీ ధైర్యంతో ఎదిరించి నిలబడ్తాడతను. చివరికి ఆ ఊరినే సంస్కరిస్తాడు. యువతలో చైతన్య జ్యోతిని వెలిగిస్తాడు.

సినిమాలో యువకుడిలా అరవింద్ తన కథ విని సంస్కర్త హృదయంతో తనని వివాహమాడటానికి ముందుకొచ్చాడా? ఎంత గొప్పవాడు? అదే జరిగితే తనెంత అదృష్టవంతురాలు?

ఆమెకు అతనిపై గౌరవభావం కలిగింది.

ఈలోగా నూర్జహాన్ బేగం అక్కడికొచ్చింది.

"ఓ! కాబోయే భార్యాభర్తలకు అపుడే పరిచయాలు కూడా అయిపోయినట్లున్నాయే! నాకు ఆ కాస్త పనికూడా లేకుండా చేసేరన్నమాట! అంతవరకేనా? పెళ్లి కూడా ఇంతలోనే చేసేసుకున్నారా?"

"నువ్వు లేకుండా నా పెళ్లేమిటి నూర్! నీ మాటలకు ఆ అమ్మాయి బెదిరిపోగలదు. ఈ సినిమా జీవిని చేసుకోవటం ఆమెకు ఇష్టమో కాదో ముందు కనుక్కో. అందులో నేను అసలే ఫ్లాప్ డైరెక్టర్ని!"

తర్వాత నూర్జహాన్ సారథ్యం వహించి ఇరువురితో సంప్రదింపులు జరిపింది. ఇరువురి మనసుల్ని తెల్సుకొంది. ఒకరికి ఒకరు నచ్చారు. పెళ్లి చేసుకోటానికి సిద్ధంగా ఉన్నారు.

"కానీ మిస్‌లతా! నేను నిన్ను వెంటనే పెళ్లి చేసుకోలేను. అందుకు కొన్ని చిక్కులున్నాయి. రెండుమూడు నెలలయితే కాని పెళ్లి చేసుకోలేను. అంతవరకూ నువ్వు నూర్జహాన్ వద్దే ఉండొచ్చు. లేకపోతే మద్రాసు వస్తే అక్కడ నీకు వసతి ఏర్పాట్లు ప్రత్యేకంగా చేయగలను. నిర్ణయం నీ ఇష్టంపైన ఆధారపడి ఉంటుంది"

పెళ్లి కాకుండానే అరవింద్‌తో మద్రాసు వెళ్ళటం ఎలా?

పోనీ ఇక్కడే ఉందామంటే ఈ నూర్జహాన్ ఎవరో ఏమిటో...

పైగా ఈలోగా పొరపాటున అశోక్ కుమార్ కళ్లపడితే? అసలు అతను తన ఆచూకీ కూపీతీసి వెతుక్కుంటూ వస్తే ఏం చెయ్యటం?

"నూర్జహాన్‌కూ,నాకూ ఉన్న బంధుత్వమేమిటో అసలు నీకు చెప్పలేదు కదూ? నూర్జహాన్ నా శిష్యురాలు. ఆమె ముస్లిం అని అనుకొనేవు. 'నూర్జహాన్' అనేది నేను చేసిన నామకరణం. నూర్జహాన్ అంత పాలనా సామర్థ్యం కలిగినది. నా సినిమాకు ప్రొడక్షన్ మేనేజర్. ఆమె సామర్థ్యం చూసి నేను పెట్టిన పేరు అది. ఆమె అసలు పేరు..."

"వద్దులెండి. అదంతా చెప్తే ఆ అమ్మాయి జడుసుకొంటుంది."

"నూర్జహాన్ దగ్గర నీకు ఎలాంటి ఇబ్బ





యాలు, భయమూ ఉండనక్కరలేదు మిస్ లతా! నా సోదరిలాంటిది.మన పెళ్లికి ముహూర్తం నిర్ణయించే వరకు నువ్వు ఇక్కడుంటేనే మంచిదని నా అభిప్రాయం."

"వద్దండీ! నేనూ మీతో మద్రాసు వస్తాను. మన మనసులు కలిసాయి. నిర్ణయాలు జరిగాయి. ఇక ముహూర్తాని దేముంది? కాబోయే భర్త పైన ఆమాత్రం నమ్మకం లేకపోతే ఎలా?"

ఆమె ఈ మాటలన్నీ అనాలనుకొంది. కానీ మొదటి రెండు వాక్యాలు అనగానే నోరు మూతపడిపోయింది.

"అయితే ఉండండి. ఈ శుభ సంపర్భంలో రింగులూ, పూలదండలూ కాక పోయినా, అమృతోపమానమైన కాఫీ కప్పులని ఎక్స్‌చేంజ్ చేసుకొందురు కానీ..." నూర్జహాన్ అంది.

ఆమె కాఫీ కప్పులు తీసుకురావటానికి లోపలికి వెళ్లింది.

లత తల వంచుకుని నిలబడింది-కొత్త పెళ్లికూతురు మొదటి రాత్రి కార్యం గదిలోకి వచ్చినట్లుగా. ఆమెకు కన్నెత్తి అరవింద్‌ను చూడటానికి సిగ్గుగా ఉంది.

ఓ అయిదు నిమిషాలు మౌనంగా గడిచింది.

అతను తనని పలకరించడేం? విడి చమా?

పలుకరిస్తే ఎంత బాగుండును! లాలనగా దగ్గరికి తీసుకొంటే...!

"లతా...ఐ లెక్ యూ...!లవ్ ఎట్ ది ఫస్ట్‌సైట్ అని దీన్నే కాబోలు అంటారు" అతను ఆమె భుజాలమీద చెయ్యివేసి చుబుకం పట్టుకుని మొహాన్ని ఎత్తుతూ లాలనగా అన్నాడు.

ఆమె అతడి కౌగిలిలో ఇమిడిపోతూ ఆనందంగా ఏడ్చింది!

* * *

హైదరాబాద్‌నుంచి మద్రాసుకు వెళుతుంటే లతకు అత్తవారింటికి వెళుతున్న అనుభూతి...ఆనందం కలిగింది.

సెంట్రల్ స్టేషన్‌లో దిగినప్పుడు—

అక్కడినుంచి వెళ్లి ఓ లాడ్జి గదిలో ప్రవేశిస్తున్నప్పుడు—

అదే అనుభూతి ...ఆనందం!

"లతా! నేను సినిమాలోకంలో బతికే మనిషిని. పెళ్లి చేసుకోకుండా నేను 'నా భార్య' అని నిన్ను ఎవరికి పరిచయం చేసినా నమ్మరు. పైగా రకరకాల అపనిందలు వేస్తారు. పత్రికలలో అవాకులు చెవాకులు రాసారు. పైగా నేనిప్పుడో కొత్త పిక్చర్ మీద వర్క్ చేస్తున్నా. ఈ స్థితిలో నామీద స్కేండల్స్ నాకు అసలే శ్రేయస్కరంకాదు. కనుక కొంతకాలం మనం రహస్యంగా జీవించక తప్పదు. నువ్వేం బాధపడకూడదు. సరేనా?" హైదరాబాదులోనే ఇలా చెప్పటంవల్ల లత అతను లాడ్జికి తీసుకెళ్లినా దాన్ని అత్తవారిల్లు లాగానే భావించింది.

వారంరోజులు గడిచింది.

లతను ప్రతిరోజూ వచ్చిచూసి పోతున్నాడు అరవింద్!

లాడ్జిలో లతకు ఎలాంటి భయమూ పడే అవసరం లేకపోయింది. బాయ్‌ల దగ్గరినుంచి యజమాని దాకా అంతా ఆమెను గౌరవంగా చూసేరు. వారం రోజులూ రాత్రిళ్లు ఆమె ఒంటరిగానే పడుకొంది.

ఆ రోజు సాయంకాలం—

ఉన్నట్లుండి వర్షం పట్టుకొంది.

కిటికీలోగుండా వర్షంతో తడిసే నగరాన్ని చూస్తూ కూర్చుని ఉంది లత.

తలుపుతట్టిన శబ్దం.

తెరిసే–

ఎదురుగా అరవింద్!

తడిసి ముద్దయి వున్నాడు.

"నడిచి వస్తున్నారా? అలా తడిసి ముద్దయ్యారేమిటి?" టవల్ తీసుకొని తల తుడుస్తూ అంది.

"ఊ! తడవకుండా రావాలంటే తల్లకిందులుగా నడిచి రావాలిట! నాకా విద్య చేతకాలేదుగా!"

అతను తడిబట్టలు విప్పేడు.

శరీరంమీద డ్రాయర్...బనీను!

పచ్చటి శరీరం! ఎంత అందంగా వున్నాడు!

"నువ్వలా చూస్తుంటే నాకు సిగ్గేస్తున్న దబ్బా! నీ చీరె ఒకటివ్వు. లుంగీ పంచెలా చుట్టుకుంటాను"

"ఇంత వర్షంలో తడుస్తూ రాక పోతేనేం?"

"ఇంత వర్షం కురుస్తున్నా రాలేదని నువ్వు కోప్పడ్తావని వచ్చాను"

చీరెను లుంగీగా చుట్టుకొని పక్క మీద కూర్చుని సిగరెట్టు వెలిగించి అసలు విషయం చెప్పేడు అరవింద్!

"లతా! నీకోసం ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకొన్నాను. రెండు గదుల ఫ్లాట్. రేపు ఉదయం గృహ ప్రవేశ ముహూర్తం బాగుందిట! తెల్లవారేసరికి మనం కొత్త ఇంట్లో చేరిపోవాలి"

"అదేమిటి? ఇక్కడ బాగానేవుందిగా నాకు!"

"నీకు బాగానేవుందనుకో. కానీ నిన్ను లాడ్జిలో వుంచటం నాకు బాగా లేదు. పైగా నేను బీదవాడిని. ఇక్కడ నీకు లాడ్జి ఖర్చు... అక్కడ నాకు లాడ్జి ఖర్చు, ఇద్దరికీ విడివిడిగా హోటల్ భోజనాలు, టిఫిన్, కాఫీలు...ఆలోచిస్తే త్వరలో ఆరిపోతాననిపించింది. ఇంట్లో అయితే స్వంత వంట – నీకు వంట చాతవుగా?"

"నేను ఆడదాన్నండీ!"

"గుడ్. అయితే ఇంకేం? ఏమాత్రం కాస్త అవకాశం దొరికినా నేను నీ చేతి భోజనమే తింటాను. ఓకే"

"ఓకే! కానీ ఈ రహస్యాలెందుకు? పెళ్లి..."

"ఆ విషయం నాకొదిలెయ్యి అన్నానా! సినిమావాళ్ళకు టైమ్ సెన్సు జాస్తి. నాకు మరీ. నువు చెప్పు. నిజానికి నాకిపుడు అర్జంటుగా కావల్సింది పెళ్లా, లేక ఓ పిక్చరుకు డైరెక్ట్ చేసే అవకాశమా?"

లత ఏం చెప్పగలదు?

"నా ప్రతిభ మీద నాకు నమ్మకం వుంది. మరొక్క అవకాశం వస్తే నా సత్తా ఏమిటో,నేనేమిటో నిరూపించుకుంటాను. ఆ తర్వాత నేను నిన్ను పెళ్ళిచేసుకుంటే నీకూ విలువ–నాకూ విలువ. ఇప్పుడు పెళ్ళిచేసుకొంటే విలువ వుండదు సరి గదా..వచ్చే అవకాశం పోయే ప్రమాదం వుంది. ఏం? పెళ్ళి చేసుకోనేమోనని భయమా? అలా మోసం చేస్తే నాకొచ్చే లాభం ఏమిటి? నాకు పెళ్లి, సంసారం కావాలి. నువ్వు నాకు అన్ని విధాలా నచ్చావు. నేను ఇంతకన్నా ఎదిగినా, తగ్గినా నా నిర్ణయం మారదు. నువ్వే నా భార్యవు. కాకపోతే అందుకు కాస్త టైమ్ ఇవ్వు. ప్లీజ్..."

"నాకు మీ మీద నమ్మకంలేక కాదండీ! నా మీదే నాకు నమ్మకం పోతోంది–





మిమ్మల్ని అలా చూస్తుంటే!"

"ఊ! యూసిల్లీ గాళ్! నీకన్నా అందంగా, ఆకర్షణీయంగా వున్నానా నేను? అన్నట్టు ఓ శుభవార్త. నేను ఎన్నాళ్ళుగానో ఆలోచించి పెట్టిన ఓ సబ్జెక్టును తియ్యటానికి డబ్బు పెట్టుబడి పెట్టే నాథుడివాళ్టికి దొరికేడు నాకు. స్క్రిప్టు రెడీగా వుంది. ఈ సినిమాతో మనిద్దరి దశా మారిపోతుంది. తెల్సా"

"అవన్నీ నాకు అక్కర్లేదండీ! నాక్కావాల్సింది మీతో వివాహం. మీరు నా భర్త. మీతో దరిద్రాన్ని కాని, ఐశ్వర్యాన్ని కాని దేన్నైనా పంచుకోగలను"

"ఆల్ రైట్. రేపు మనం కొత్త ఇంట్లో గృహప్రవేశం కాబోతున్నాం. ముందు అంతవరకూ ఓకే గదా?"

"ఓకే!"

"అయితే రేపు తెల్లారగట్ల నాలుగు గంటలకు వస్తాను. రెడీగా వుండు"

లత కిటికీలో నుంచి చూసింది. వర్షం జోరు ఎక్కువయింది.

"ఈ వర్షంలో ఇప్పుడు వెళ్తారా?"

"వెళ్ళక ఇక్కడ వుండి పొమ్మంటావా?"

"వద్దు తడుస్తారు. అసలే తడిసి వున్నారు. ఆరోగ్యం చెడిపోతుంది"

"కానీ... ఈ గదిలో.. నువ్వూ... నేనూ.. రాత్రంతా "

"మీరు కబుర్లు చెప్తుండండి నేను వింటూ కూర్చుంటాను. ఈలోగా తెల్లారుతుంది"

"అయితే ముందు సాపాటుకానిద్దాం పట్టు"

బాయ్‌ని పిల్చి భోజనం తెప్పించాడు అరవింద్.

భోజనమయ్యాక నిద్ర వస్తున్నదన్నాడతను.

"అయితే హాయిగా పడుకోండి" అంటూ ఆమె దిండూ, దుప్పటి తీసి కింద వేసుకొంటూ అంది.

"ఏమిటి! నువ్వు కింద పడుకొంటే నాకు మంచం మీద నిద్రపడుతుందా? అలాగయితే నేను కింద పడుకుంటాను. నువ్వు మంచం మీద పడుకో"

ఆ విషయమై కాసేపు వాదనలయ్యాక ఇద్దరికీ రాజీ కుదిరింది.

ఇద్దరూ మంచం మీదే పడుకోవాలి. ఇద్దరికీ మధ్య దిండు సరిహద్దు!

"ఆఖరికి దిండ్లా మన మధ్య అడ్డం? నిగ్రహం వుండాలిగాని!"

"నాకు నిగ్రహ శక్తి వుంది. పురుషులకే ఆ శక్తి తక్కువ"

"ఏంకాదు. పురుషుడి పైన మీ స్త్రీలు చేసే అపనింద అది. నిగ్రహా నిగ్రహ శక్తి పురుషుడికే జాస్తి!

"కాదు స్త్రీకే"

"సరే చూద్దాంగా"

"చూద్దాంగా"

ఎవరికి వాళ్ళు పక్కకు తిరిగి పడుకొన్నారు. కాని ఎవరికీ నిద్ర పట్టలేదు. ప్రేమో, భయమో తెలియదు మరి! అర్ధరాత్రయింది.

"లతా! నా నిగ్రహ శక్తికి ఇది పెద్ద పరీక్ష సుమా!"

"నాకూ అలాగే వుంది"

"నేను నిగ్రహం కోల్పోతే ఏం చేస్తావ్?"

"నేను కోల్పోతే, మీరేం చేస్తారు?"

ఇద్దరిలో ఎవరు నిగ్రహాన్ని ముందు కోల్పోయారో చెప్పటం కష్టం..."

మొత్తం మీద ఇద్దరూ కోల్పోయారు.

"లతా..."



"అరవింద్..."

అతడిని లత పెనవేసుకొందో, లతనే అతను పెనవేసుకుపోయాడో...

నాలుగు గంటలకు ఇద్దరూ లేచారు.

వర్షం తగ్గింది.

* * *

ఫ్లాట్ చిన్నదయినా కొత్తది. అక్కడ ఇరుగు పొరుగు ఫ్లాట్‌లలో చేరినవాళ్లు కూడా ఆ లొకాలిటీకి కొత్తవారు. ఇరుగు పొరుగువాళ్లతో లతకు పరిచయమయింది.

ముఖ్యంగా మీనాక్షి వాళ్ళ కుటుంబంతో అత్యంత సన్నిహితం ఏర్పడింది.

మీనాక్షి తమిళ వనిత. ఆమె భర్త తమిళనాడు ప్రభుత్వంలో ఏదో ఉద్యోగం చేస్తూ హఠాత్తుగా చనిపోయాడు. ఇద్దరు పిల్లలు. మీనాక్షి కూడా డిగ్రీ వరకు చదివింది. అంచేత వుద్యోగం వచ్చింది.

ఇద్దరు పిల్లలు చిన్నవాడు పెద్దవాడు రవికి అయిదేళ్లు, పిల్ల వసంతలక్ష్మికి మూడేళ్లు.

వసంతలక్ష్మి ద్వారా లతకు మీనాక్షి ఆరంభంలో పరిచయమయింది. వసంత 'ఆంటీ ఆంటీ' అని ముద్దుగా పిలుస్తూ ఎప్పుడూ లత ఇంట్లోనే ఉంటుంది.

మీనాక్షి తమిళంతోపాటు ఇంగ్లీషు, హిందీలు కూడా ధారాళంగా మాట్లాడుతుంది. లతకు తెలుగుకాక ఇంగ్లీషు తెల్సు. తప్పులు తప్పులుగానైనా తన భావాన్ని వ్యక్తం చేయగలదు.

ఇంగ్లీషు ద్వారా ప్రారంభమయిన మీనాక్షి, లతల స్నేహం త్వరలో మీనాక్షి లతకు తమిళం నేర్పటంతో, లత మీనాక్షికి తెలుగు నేర్పటంతో గట్టిపడింది. కాగా మీనాక్షి ఆఫీసు నుంచి రావటం లేటైనా పిల్లలు స్కూళ్ళ నుండి వచ్చి లత వద్ద వుండేవారు.

ఫ్లాట్‌లో చేరిన కొత్తల్లో అరవింద్ లత వద్దకు
అప్పుడప్పుడూ వచ్చేవాడు.

"మీ ఆయన ఎప్పుడో గానీ ఇంటికి రాడు. ఏమిటి ఉద్యోగం?"

మీనాక్షేకాదు ఇరుగు పొరుగువారు చాలామంది వేసిన ప్రశ్న.

సినిమా దర్శకుడనేసరికి వాళ్ళకు ఉత్సాహం పెరిగింది.

"సినిమా వాళ్ళను చేసుకొంటే ఇంతే సహ్హా! అతిథుల్లాగా పెళ్ళాల దగ్గరకి ఎప్పుడో వస్తుంటారు"

ఎలాగూ లతను, అరవింద్‌ను ఆ లొకాలిటీలో వాళ్ళంతా భార్యాభర్తలుగా గుర్తించేసి ముద్ర వేసేరు. ఇంకా ఎందుకీ దొంగబతుకు?

పైగా సినిమా తీస్తానంటూ ముందు కొచ్చిన ప్రొడ్యూసర్ వెనక్కి పోవటంతో అరవింద్ ఎప్పటికప్పుడు డబ్బుకు కటకటలాడసాగేడు.

ఇప్పుడతను వేరే ఎక్కడా ఉండటం లేదు. లత, అతను కల్సే కాపురం చేస్తున్నారు.

లతకు అతడిని పెళ్ళిచేసుకోమని కనీసం రిజిస్టరు పెళ్లయినా చేసుకోమని అడగాలనివుంది. కానీ అతనికి ఎప్పుడూ సమస్యలే... సినిమా ఆలోచనలే!

ఎప్పుడూ లత మొహంలోకి చూస్తూ కూర్చుంటాడు.

ఆ రోజు ఉన్నట్లుండి అతనో బాంబు పేల్చేడు

"లతా! నేను తీయబోయే సినిమాలో హీరోయిన్‌గా నువ్వే ఎందుకు నటించ కూడదు?"

తమాషాలాడుతున్నాడని ఆ రోజు

అతని మాటని సర్దాగా కొట్టిపారేసింది. నాలుగు రోజుల తర్వాత మళ్ళీ అదే ప్రశ్న!

"నాకు సినిమాలూ, కిరికిరీటాలూ ఏమీ అక్కర్లేదండీ! ఆ బురదలోకి నన్ను లాగకండి. నేను చాలా చిన్ననాటినుంచి కోరుకొన్నది ఒక్కటే-పెళ్లి, సామాన్య కుటుంబ జీవనం. ఆ రెండూ మీరు నాకు ప్రసాదించండి. నాకింకేమీ అక్కర్లేదు"

అరవింద్ మాట్లాడలేదా పైన.

కానీ ఆ మర్నాటినుంచి మరో పది హేను రోజుల దాకా ఇంటి మొహం చూడలేదు.ఎక్కడికి వెళ్తున్నది, ఎప్పుడు వచ్చేది ఏమీ చెప్పిపోలేదు.

ఆ పదిహేను రోజుల కాలంలోనే ఓ రోజు...

లత తాను తల్లిసవబోతున్నానని తెల్సుకొంది!

అయితే, తన కడుపులో పెరుగుతున్న బిడ్డకు తండ్రి ఎవరు?

తన గర్భానికి మూడు నెలలకు పైగా వయసుందని డాక్టరు చెప్పింది. కనుక రెండు నెలల క్రితం దాకా ముక్కూ మొహమన్నా తెలియని అరవింద్ అందుకు బాధ్యుడు కాడు...కానేకాడు.

మరెవరు?

అసలిదెలా జరిగింది ?

తనకి తెల్సి, భర్త అని భావించి అరవింద్‌కు మాత్రమే తన శరీరాన్ని అర్పించింది.

కానీ తనకి తెలీకుండా తనను గర్భవతిని చేసిందెవరు ?

శ్రీహర్ష...

ఆరోజు వర్షం రాత్రి..మధురానుభూతి! తను ఆఫ్ చేసిన సీలింగ్ ఫేను తిరుగుతోంది. తను మూసేసిన తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి. జాకెట్ హుక్స్, బ్రా హుక్ వూడిపోయి ఉన్నాయి.

ఛీ ఛీ...శ్రీహర్ష అలాంటివాడు కాదు. అతను పిరికివాడు కావచ్చు. కానీ మోస గాడు మాత్రం కాదు. అతనికి తనని అనుభవించటమే ధ్యేయమయితే తను ఎన్ని అవకాశాలు అతనికి యివ్వలేదు. చివరిరోజు తను నిద్రలో వుండగా అంత కక్కుర్తి పడ్తాడా? నో...నో!

అయితే అశోక్‌కుమార్ !

ఆ మధ్యాహ్నం...

దుర్మార్గుడు. సిగరెట్టు పొగ మొహం మీదకి ఊది మత్తు తెప్పించాడు. ఆ మత్తులో...!

నేలమీద రక్తం ఏమిటి?

ఆ రక్తం ఆ రోజు అక్కడికెలా వచ్చింది. ఆ రకం తనది కాదు. మరి?

అశోక్‌కుమార్ దుర్మార్గుడే,కాముకుడే.

అతనే చేసేడా ఈ పని ?

లేక శ్రీహర్ష తండ్రి...

కాక శ్రీధరన్....

నలుగురిలో ఎవరు ?

ఎవరో ఒకరై వుండాలి.

లేక...

ఆ ఆలోచనకే ఆమె మనసు గజగజలాడిపోయింది.

ఆమెకు తన శరీరం పైన అసహ్యమేసింది.

తన పొట్టలో పెరుగుతున్న బిడ్డపైన కోపం వచ్చింది. పొట్టలోనుంచి పొడిచి చంపేస్తే? కోపం...కసి..అసహ్యం!

ఆమె నాలుగు రోజులు మీనాక్షిని, వసంతలక్ష్మిని ఎవరినీ చూడలేదు. పచ్చి మంచినీళ్లు కూడా ముట్టుకోలేదు.

అయిదో రోజు ఆమెకు ఏడ్చేశక్తి,

ఆలోచించే శక్తికూడా పోయింది.

"ఆంటీ! హార్లిక్స్ తాగవూ? నువ్వు తాగకపోతే నేనుకూడా తాగనని మమ్మీకి చెప్పేవచ్చా" అంటూ హార్లిక్స్‌గ్లాసులు రెండు అక్కడ పెట్టి గడ్డంకింద చెయ్యి పెట్టుకుని కూర్చుండిపోయింది వసంత.

వసంత చేతితో ఇప్పించుకొని హార్లిక్స్ తాగింది.

"నువ్వు ఇప్పుడు గుడ్ ఆంటీవి నాలుగు రోజులుగా నీమీద నాకు కోపం



వచ్చిందీ తెల్సా?"

కాస్త ఓపిక వచ్చాక మళ్ళీ ఆలోచనలు ఆరంభమయ్యాయి.

అరవింద్‌తో ఈ నిజం ఎలా చెప్పాలి? చెప్తే ఏమంటాడు? ఏమనుకుంటాడు?

తను అతనితో పరిచయానికి ముందే కళంకిని అని తెలిస్తే తనపైన ఇప్పటి ప్రేమ వుంటుందా? అసహ్యించుకోడూ?

అసలు తను అతనితో నిజం చెప్పాలా, చెప్పకూడదా?

నిజం చెప్తే అతను నమ్ముతాడా?

అసలు నమ్మేలావుందా తన కథ?

తనేం పసిపాపా లేక పిచ్చిదా? అమాయకురాలన్నా కాదే? ఆలోచనలు వున్న వ్యక్తి. కోరికలున్న వ్యక్తి!

'నలుగురిలో ఎవరు నన్ను తల్లిని చేసేరో నాకు తెలియదు' అంటే ఎవరైనా నమ్ముతారా?

అలాగని అబద్ధం చెప్పగలదా? చెప్పి సత్యాన్ని కప్పిపుచ్చగలదా?

అసలు తాను అబద్ధం చెప్పదు... చెప్పలేదు.

నిజం చెప్తుంది. నమ్మితే నమ్మనీ— లేకపోతే పోనీ.

అతను నమ్మనప్పుడు...

అప్పుడు...

? ?

* * *

అర్ధరాత్రి...

తలుపు తట్టిన శబ్దమై ఉలిక్కిపడి లేచింది లత.

అవును. తలుపు తడుతున్నారు ఎవరో!

గడియారంలో రేడియమ్ డైల్ చీకట్లో మెరుస్తోంది.

రెండు గంటలు!

ఎవరా వచ్చింది?

"లతా..."

అమ్మయ్య! అరవింద్!

"వస్తున్నా!"

అరవింద్ హుషారుగా లోపలికి ప్రవేశించాడు. వస్తూనే "చెప్పకుండా పారిపోయానని కోపగిస్తారేమో అమ్మ గారూ... ఈ దాసుడిని మన్నించాలని మనవి" అంటూ వచ్చాడు.

లత తలవంచుకుని వంటగదిలోకి నడవబోయింది.

"వంటా గింటా ఏమీ అక్కర్లేదు



ప్రేయసీ! మనం హాయిగా భోజనం చేసి వచ్చాం. మనం అసలు ఇప్పుడు సంతోషంగా వున్నామోయ్. ఎందుకో చెప్పుకో చూద్దాం. పోనీ అసలు ఇన్నాళ్ళ మనం ఎక్కడికి వెళ్ళివుంటామో చెప్పుకో చూద్దాం"

"మీరే చెప్పండి"

"హైదరాబాద్. అక్కడినుంచి మీ ఊరు"

"మాఊరా?" "మాఊరేదో మీకెవరు చెప్పేరు?"

"నువ్వు చెప్పకపోతే తెలియదా? కరుణ చెప్పింది"

"కరుణా!"

'కరుణా శ్రీధరన్ ఎవరు?' అని ఆతనా రోజు నూర్జహాన్ ఇంట్లో అడగటం గుర్తుకొచ్చింది ఆమెకు.

కరుణ..నూర్జహాన్... అరవింద్...

అంతాకల్సి తనజీవితంతో నాటకం ఆడటం లేదుకదా?

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"నూర్జహాన్ బేగంగారు బాగున్నారా"

"నువ్వడగాల్సిన ప్రశ్న అదికాదు డియర్. మీరిప్పుడు ఎందుకింత సంతోషంగా వున్నారు అని! ఊ... నువ్వు అడక్కపోయినా నేనే సమాధానం చెప్పేస్తా. మనం ఓ కొత్త ప్రొడ్యూసర్ని పట్టేం. త్వరలో అతను మనింటికొస్తాడు. ఈ తడవ సినిమా తీసినట్లే ...అదేమిటి? నువ్వలాగ వున్నావేమిటి?"

అతని సంతోషంలో విషపుచుక్క చిలికించటం భావ్యమా?

"అబ్బే...ఎలాగవున్నాను. బాగానే వున్నా. నిద్రమత్తు. పైగా మీరు నాకు చెప్పకుండా వెళ్ళినందుకు కోపంవచ్చింది"

"నీకోపాన్ని పోగొట్టే మంత్రం నా దగ్గర వుందిగా! కమాన్"

* * *

చర్చిలో ఫాదర్ముందు 'కన్ఫెషన్' చేసినట్లు ఏదీ దాచుకోకుండా తన కథంతా అరవింద్కు చెప్పింది లత. కానీ ఎవరి పేర్లు మాత్రం చెప్పలేదు.

"దేశంలో అన్ని వృత్తి ధర్మాలు నశించాయి. బ్రాహ్మణులు చెప్పులవ్యాపారాలు చేస్తున్నారు. హరిజనులు పూజారులవుతున్నారు. శూద్రులు పెద్దపెద్ద వ్యాపారస్తులుగా మారేరు. వైశ్యులు యుద్ధాలు చేస్తున్నారు. వ్యభిచారం సామాజిక సహజ ధర్మమయింది.

"కానీ దేవదాసీ కుటుంబంలో పుట్టిన నేను వివాహం చేసుకొని సామాన్య కుటుంబ జీవితం గడుపుదామనుకొన్నాను. ఇదేమంత పెద్దకోరిక! నా వృత్తి ధర్మమంటే నేను అసహ్యించుకున్నాను. అది తప్పా? కానీ నా కుటుంబ చరిత్ర నన్ను చిన్ననాటి నుంచీ వెంటాడుతూనే ఉంది. నాకు తెలీకుండానే నేను పతితురాలు కావటానికి ఎవరు కారణం?"

ఆమె అంతా ప్రశాంతంగా చెప్పి ఆఖరికి ఆవేశాన్ని ఆపుకోలేక ఆమాటల్ని అని పెద్దగా రోదించసాగింది.

అరవింద్ చాలా సేపు మాట్లాడలేదు. సిగరెట్టుపైన సిగరెట్టు కాలుస్తూ ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"మీరు నన్ను వివాహం చేసుకొంటానన్నారు. వివాహం కాకపోయినా మిమ్మల్ని భర్తగా నేను మనసావాచా కర్మణా భావించాను. నా సర్వస్వాన్ని అర్పించాను. అటువంటి మీ ముందు కడుపులో బడబాసలాన్ని పెట్టుకొని నటించలేను. నిజం చెప్పాను. శిక్షించినా, దండించినా, ఆదరించినా నిరాదరించినా




మీరు విధించబోయే ఏ శిక్షనైనా మీ భార్యగా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను"

అరవింద్ లేచాడు.

మౌనంగా, ప్రశాంతంగా హుందాగా ఆమెవద్ద కొచ్చాడు.

"నేను నిన్ను శిక్షిస్తాను లతా! ఎలా? నీ నిజాయితీని మెచ్చుకోటం ద్వారా నిన్ను మరింతగా ప్రేమించటం నీకు నేను విధించబోయే దండన" అంటూ అతనామెను తనచేతుల్లోకి తీసుకొన్నాడు.

ఆమె అతని చేతుల్లోంచి జారి కాళ్ళ మీద పడింది.

* * *

ఆ రోజు ప్రొడ్యూసర్ వస్తున్నాడు.

. అరవింద్ ఊరికే హడావుడి పడిపోతున్నాడు.

లత ప్రొడ్యూసర్ గారికి మర్యాదలు చేయటానికి అవసరమైన సకల సంభారాలను సమకూర్చుకొంది.

ఇంటిముందు టాక్సీ ఆగింది.

ప్రొడ్యూసర్‌గారు మరో ఇద్దరు స్నేహితులతో టాక్సీ దిగారు.

అరవింద్ హుందాగా వాళ్ళను ఆహ్వానించి ఉచితాసనాలమీద కూర్చోపెట్టేడు.

"మీ 'సంస్కరణ' సినిమా నాకు చాలా బాగా నచ్చిందండీ. అప్పట్లో మిమ్మల్ని నేను అభిమానించేవాడిని. కానీ అపుడు నేను కేవలం ప్రేక్షకుడిని./ కానీ ఇపుడు ప్రొడ్యూసర్‌ని"

"మీ అభిప్రాయం నాకు అర్థమయిందండీ! 'సంస్కరణ' తీసినప్పటి అరవింద్‌ను కాదు నేనుకూడా. 'సంస్కరణ'లు కొందరికే బాగుంటాయి. కానీ సినిమా అందరికీ బాగుండేలా ఉంటేనే ప్రొడ్యూసర్‌కి, దర్శకుడికి, ఇతర కళాకారులకి తృప్తి. ఈసారి 'సినిమా' అలాంటిది. స్క్రిప్ట్, స్టోరీ వింటే మీకే అర్థమవుతుందిగా. ఉండండి. కాస్త టిఫిన్ కాఫీలు తీసుకొని ఆరంభిద్దాం"

"ఎందుకు ఇపుడే తీసుకొచ్చారు. కాస్సేపు ఆగి తీసుకొందాం. ముందు కథ చెప్పండి"

"ఆల్‌రైట్. ఎలాగూ ఇంటర్వెల్ ఉంది. అపుడే మనం కాఫీలు తీసుకొందాం"

అరవింద్ టేప్‌రికార్డర్ 'ఆన్' చేశాడు.

'టేక్‌వైజ్'గా కథ చెప్పటం ఆరంభించాడు.




"నౌ ఇంటర్వెల్" అంటూ కథను ఆపి ప్రొడ్యూసర్‌వేపు చూసాడు. ప్రొడ్యూసర్ మొహం ఇనప ముక్కలా ఏ భావం లేకుండా ఉంది. కానీ అతని వెంట వచ్చిన ఇద్దరి మొహాల్లో ఎంత ఆపుకొందామన్నా ఆపుకోలేని ఆనందరేఖలు నాట్యం చేస్తున్నాయి.

"ఎలా ఉంది కథ?" అని అడగలేదు అరవింద్.

ప్రొడ్యూసర్‌కి కథ నచ్చిందని అతనికి తెలుసు. అలా అడిగితే మాత్రం ప్రొడ్యూసర్ కథ నచ్చిందని చెప్పడు. మహా అయితే 'ఫర్వాలేదు. కానీ...' అని

ఆగుతాడు.

"లెట్ అజ్ హావ్ సమ్‌థింగ్ నౌ" అరవింద్ లేచి లోపలికి వెళ్లాడు.

అప్పుడు ప్రొడ్యూసర్ మిగతా ఇద్దరివేపు చూసాడు. ప్రసన్నంగా నవ్వి 'కథ బాగుందికదూ?' అన్నట్లు తల ఆడించాడు.

ఇదంతా లోపలినుంచి అరవింద్ గమనిస్తున్నాడని వాళ్ళకు తెలియదు.

"లతా! కాఫీ టిఫిన్‌లు తీసుకురా. అన్నట్లు ఇక వాడు మన ప్రొడ్యూసరే. మన కథ నచ్చింది. ముందు వాడికి పరిచయం చేస్తాను. రా! వెధవను కాస్త 'అయిస్' చేయటం మంచిది"

లత సందేహించింది.

"వద్దండీ! మీ ప్రపంచంలోకి నన్ను ఈడ్చకండి. దయచేసి ప్లీజ్..."

"లేదు. నా భార్యగా పరిచయం చేస్తాను నిన్ను"

లత మెత్తబడింది.

అతని వెంట నడిచి ముందు గదిలోకి వచ్చింది.

ఎదురుగ్గా ప్రొడ్యూసర్?

హఠాత్తుగా నల్లత్రాచు పామును చూసినట్లు నిలిచిపోయింది.

"ఈమె నా భార్య లత. వీరు..."

లత వైపు అప్పుడు చూసాడు అరవింద్.

"అదేమిటి లతా అక్కడే నిలబడిపోయావు. ప్రొడ్యూసర్‌గారు వీరు. కాఫీ టిఫిన్లు తీసుకురా"

కాఫీ టిఫిన్లు స్వీకరించటం అయింది.

"తర్వాత కథ చెప్పనా?"

"తొందరేముందండీ. ఇంటర్వెల్‌దాకా కథ విన్నాంగా. అంతవరకు బాగుందో లేదో, నన్ను ఆలోచించుకోనీయండి" అంటూ లేచాడు ప్రొడ్యూసర్.

* * *

అరవింద్ ఆ రోజు ఆమెను ఎప్పటికన్నా ప్రేమగా లాలించాడు.

"లతా! నిన్ను నేను అమితంగా ప్రేమిస్తున్నాను. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. అవునా?"

"ఊ"

"నన్ను ఎందుకు ప్రేమిస్తున్నావు?"

"మీరు నా భర్త అని భావిస్తున్నాను కనుక"

"నా భార్యగా నా అభివృద్ధిని నువ్వు, నీ భర్తగా నీ సుఖాన్ని నేనూ కోరుకొంటాం. అవునా?"

"ఏంటండీ ఈ ప్రశ్నలు?"

"నా భవిష్యత్తు నీ చేతిలో వుంది లతా! విధి నా అదృష్టంతో ఆడుకొంటోంది. ప్రతిసారీ ఓటమి మనదే అవుతోంది. ఈసారి నేను గెలవాలి. అందుకు నీ సాయం కావాలి"

తను చేయాల్సిన సహాయం ఏమిటి? ఏమిటి అడుగుతాడు అతను?

"హీరోయిన్‌గా నీచేత నటింపచేస్తే మొన్న వచ్చిన ప్రొడ్యూసర్ సినిమా తీయటానికి అంగీకరిస్తున్నాడు. కనుక నువ్వు..."

తను సినిమాలో నటించాలా?

దర్శకుడి భార్యనయివుండి!

"ఎంతో మంది ఎన్నెన్నో ప్రయత్నాలు చేస్తే కాని లభ్యం కాని ఛాన్సు నీ కాళ్ళ ముందుకు వచ్చింది లతా! కాదనకు"

ఎందరో ఆడపిల్లలు తారలు కావాలన్న వ్యామోహంలో వుండవచ్చు. జీవితాల్ని నాశనం చేసుకొంటూ వుండవచ్చు. కానీ తారల్ని చేసే ఏ దర్శకుడు




కాని, ప్రొడ్యూసర్ కాని, మహానటుడు కాని తమ భార్యల్ని, కూతుళ్ళని తారల్ని చేస్తున్నాడా?

తనని అగ్నిసాక్షిగా వివాహం చేసుకొని వుంటే అరవింద్ తనని ఈ కోరిక కోరివుండేవాడా?

"నిన్ను భర్తగా శాసించటం లేదు లతా! నీ తత్వం, జీవితాదర్శం నాకు తెల్సు. నీకు ఇలాంటివి ఇష్టం లేదు. కాని ఈ ఒక్కసారికి అంగీకరించు. నాకు దర్శకుడిగా పేరొస్తుంది. పరిశ్రమలో నిలదొక్కుకుంటాను. అప్పుడు మనం బహిరంగంగా వివాహం చేసుకొందాం. ఆ తర్వాత ఓ ప్రసిద్ధ దర్శకుడి భార్యగానే వుందువుగాని"

ఆశ...

ఎర...

అది లత వీక్‌పాయింట్!

"కానీ మీ ప్రొడ్యూసర్.. వాడు... ఎవరో తెల్సా అండీ. నా పాలిటి విలన్ ఆ నలుగురిలో ఒకడు"

"నేను ఊహించాను లతా! నీవు తనకు తెల్సునని అతనన్నప్పుడే నేను నీ కథలో అతని పాత్ర ఏమిటో ఊహించాను"

"అతను పగపట్టిన పామండీ! తన పగని ఇలా తీర్చుకోటానికి వచ్చాడు"

"నా దగ్గర వున్నంత కాలం ఇలాంటి పాములు నిన్నేం చేయలేవు లతా! సినిమా తియ్యటానికి ఒక్కసారి మా ఇద్దరి మధ్య ఎగ్రిమెంట్ అయితే వాడి పిలక నా చేతుల్లోకి వస్తుంది. హీరోయిన్‌వి కూడా నువ్వే అయితే వాడిని మనం ఇష్టం వచ్చినట్టు ఆడించవచ్చు. వాడి పీక మన చేతుల్లోకివచ్చిందాకా కొంచెం ఓపికపట్టాలి లతా! ఏ అవమానాన్నైనా భరించాలి. ఇది మనిద్దరి భవిష్యత్తుకు సంబంధించిన సమస్య

"సరేనండీ. మీ కోసం నేను ఏం చేయటానికైనా సిద్ధమే"

"గుడ్. కానీ ఇక్కడే ఆ దుర్మార్గుడు మరో చిన్న మెలిక పెట్టేడు. నీ అంగీకారాన్ని నువ్వు స్వయంగా అతని వద్దకి వెళ్ళి చెప్పాలిట. అదీ ఎప్పుడో తెల్సా? రేపు రాత్రి"

లతకు అంతా అర్థమయింది.

అశోక్‌కుమార్ ఆనాడు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకోబోతున్నాడు. బహిరంగంగా తనని పొందటానికి ఉచ్చువేసేడు.

తను అక్కడికి వెళ్తే పోయేదేమిటో ఆమెకు తెల్సు ... మానం!

ఆ మానం ఎప్పుడో పోయిందిగా!

ఇప్పుడు కొత్తగా పోయేదేముంది?

వచ్చేదేమిటో తెల్సు - అరవింద్ కోరిక తీరుతుంది.

తనతో పరిచయానికి ముందే గర్భిణి అని తెల్సికూడా అతను తనను పన్నెత్తు మాట అనలేదు. కాగా తనని స్వీకరించాడు.

అతని సంస్కారానికి, సంస్కరణాభిలాషకు అది నిదర్శనం కాదా?

మరి అతని కోసం తను అశోక్ కుమార్ చేతిలో పరాభవాన్ని పొందితేనేం? ఆ మాత్రం త్యాగం చేయలేదా తాను?

కానీ ఏ భర్త అయినా తన భార్యను ఇలాంటి కోరిక కోరగలడా?

"వెళ్ళమంటారా?" కొంచెం వ్యంగ్యాన్ని మేళవించి అంది ఆమె. "ఆలోచించి చెప్పండి. వెళ్తే నాకు జరుగబోయేదేమిటో ఊహించుకొని చెప్పండి"

"అయినా తప్పదేమో లతా! నేను ఇంతకన్నా ఏమీ చేయలేని అసమర్థుడిని.

నన్ను క్షమించు" అతను ఏడవసాగాడు.

అతని ఏడుపు ఆమెకు సినిమా ఏడుపులా అసహజంగా కన్పించింది.

* * *

ఆరంభించిన నెలరోజుల్లో సినిమా షూటింగు మొత్తం పూర్తి చేసేడు అరవింద్. నామకరణం అయింది-'ఆకాశ దీపాలు'.

ఆ నెలరోజుల్లో లతను గురించిన కథలు అనేకం ప్రచారంలోకి వచ్చాయి.

మూడునెలల గర్భవతిచేత హీరోయిన్ వేషం వేయిస్తున్నారని...

దర్శకుడికి, హీరోయిన్‌కి ఇల్లీగల్ కాంటాక్టు వుందనీ...

ప్రొడ్యూసర్‌కి, లతకు పాత పరిచయాలున్నాయనీ...

"ఏమిటండీ దర్శకుడుగారూ!సినిమా రిలీజ్ కాకముందే హీరోయిన్ మీద ఇన్ని స్కాండల్స్ ప్రచారంలోకి వస్తే, ఇక సినిమా ఎవరు చూస్తారండీ. పత్రికల్లో ఆ రాతలు రాసేవాళ్ళ నోరు మూయించండి బాబూ. ఎంత ఖర్చయినా ఫర్వాలేదు." అని ఒకరంటే...

"మీకు సినిమా రంగంలో అనుభవం లేదు. మీ అదృష్టం బాగుండి హీరోయిన్ పైన ఇన్ని స్కాండల్స్ కానీ ఖర్చు లేకుండా ప్రచారమైనందుకు సంతోషించండి. ఆడదానికి నిజజీవితంలో అయితే ఇలాంటి స్కాండల్స్ బల్లెపు పోట్లు. కానీ సినిమా జీవితంలో అభివృద్ధికి సోపానాలు. మీరేం భయపడకండి" అన్నాడు.

అరవింద్ స్కాండల్స్‌ను ఖండించలేదు. సరిగదా తెలివిగా వాటిని పెంచే స్టేట్‌మెంట్స్ ఇప్పించాడు.

లత పత్రికలకు సంబంధించినవారికెవరికీ ఇంటర్వ్యూలు ఇవ్వలేదు.

ఆమెకు 'మహానటి'నన్న గర్వమని రాసేయి పత్రికలు.

"మన మీద యిలా అవమానకరంగా రాస్తుంటే మీరు ఎలా ఊరుకోగలుగుతున్నారు? మీరూ, నేనూ భార్యాభర్తలమని..."

"ఆగాగు ఏమన్నావ్? మీరూ, నేనూ భార్యాభర్తలం" అంటే నేను భార్యా, నువ్వు భర్తా అని చెప్పమంటావా? పిచ్చి లతా. సినిమా ఇండస్ట్రీ అంటే ఏమిటో నీకు తెలియదు. నేను చెప్తున్నాగా. మనకి మంచి కాలం రాబోతోంది. ప్రజలకు సస్పెన్సంటే ఇష్టం. నువ్వూ, నేనూ భార్యాభర్తలమనీ, నీకు మూడు నెలల గర్భమనీ మనమే చెప్పుకొంటే సస్పెన్సేం వుంటుంది? అదే మనం మాట్లాడమనుకో. మూడునెలల గర్భవతి హీరోయిన్ వేషం ఎలా వేసిందో చూడటానికి వస్తారు.ఆ తర్వాత పొట్ట ఎత్తుగా కన్పించిందా లేదా అని వాదించుకుంటారు. అది తెల్సుకోటానికి సినిమాను మళ్ళీ మళ్ళీ చూస్తారు. ఇదంతా బిజినెస్ టెక్నిక్‌లే"

సినిమా షూటింగు అంతా అయిపోయాక లత హఠాత్తుగా మాయమయింది. పత్రికలవాళ్లు ఎంత ప్రయత్నించినా ఆమె జాడ తెలియలేదు.

దానిమీద మళ్ళీ ఊహాగానాలు...

డబ్బింగ్ అయిపోయింది. ఎడిటింగ్ అయిపోయింది. హీరోయిన్ పాత్రకు గాత్రదానం చేసిన అమ్మాయి డైలాగులు బాగా చెప్పేలా ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు అరవింద్.

పిక్చర్ రషెస్ చూసినవాళ్లు సిని

 

మాను మెచ్చుకోసాగేరు.

హీరోయిన్ నటనను, దర్శకుడి ప్రతిభను ప్రత్యేకంగా మెచ్చుకున్నారు.

డిస్ట్రిబ్యూటర్లు ముందు ఎవరూ పిక్చర్‌ని రిలీజ్ చేయటానికి ముందుకు రాకపోయినా అరవింద్ ఆ ప్రాబ్లమ్‌ను సాల్వు చేసేడు.

సినిమా రిలీజ్ కాకముందే హీరోయిన్‌కి డిమాండ్ వచ్చింది.

కానీ ఆమె ఏదీ?

అడ్రస్ ఎవరు చెబుతారు?

అర్ధరాత్రి...

బెడ్‌రూమ్ లైట్ డిమ్‌గా వెలుగుతోంది.

అంతా నిద్రిస్తున్నారు.

మేలుకొని కళ్లు తెర్చి పక్క బెడ్ వైపు చూస్తూ పడుకున్నది లత ఒక్కతే!

ఆమె దృష్టి 'కోమా'లోవున్న పక్క బెడ్ మీద స్త్రీ పైనా, పక్కనే చిన్న తొట్టిలో వున్న పాపపైనా వుంది.

'షి ఈజ్ వెరీ వీక్! బట్ లెటజ్ ట్రై ఫర్ హర్ హెల్ప్"

డాక్టరు ఆ పాప పుట్టగానే అన్న మాటలు గుర్తుకొస్తున్నాయి లతకు.

ఆ శిశువు...బతుకుతుందా?

ఊహు...

ఇందాక డాక్టర్ మొహంలో, నర్సు మొహంలో అదే భావం...

ఆ శిశువు తండ్రి మొహంలో అదే భీతి...ఆరాటం...

ఆ శిశువు త్వరగా చనిపోతే ఎంత బాగుండును?

అలా ఆలోచనగా చూస్తున్న ఆమె ఒక్కసారి వులిక్కిపడింది.

ఆ శిశువులో చలనంలేదు.

శ్వాస ఆడుతోందా?

ఆమె మెల్లగా లేచింది.

ఆ శిశువువద్దకు వెళ్ళి ముక్కువద్ద చెవి ఆనించింది. చెయ్యిపెట్టి చూసింది. చెయ్యి, పొట్ట పట్టుకుని చూసింది.

తర్వాత దీనంగా బెడ్‌మీద పడుకుని వున్న ఆ శిశువు తల్లివైపు చూసింది.

ఆ తల్లికి బిడ్డలు కావాలని కోరిక. అది ఎంత గాఢమైనదో లతకు తెలుసు.

"మీ ధనం, డాక్టర్లు పోయే ప్రాణాన్ని ఇవ్వలేరమ్మా. కానీ ప్రాణంపోయిన నీ శిశువుకు నేను ప్రాణం పోసాను. బిడ్డలు కావాలన్న నీ కోరికను నేను తీరుస్తాను"

ఆమె ఆ మృత శిశువును ఎత్తుకుని తీసుకొచ్చి తన బెడ్‌మీద పడుకోబెట్టుకుంది.

తన బెడ్‌మీద శిశువును తీసుకెళ్ళి ఆ తొట్టిలో పడుకోబెట్టింది.

బెడ్ పక్కన వున్న షెల్ఫ్‌లోనుంచి ఓ టాబ్లెట్ తీసుకొని మింగి నిశ్చింతగా పడుకుంది.

* * *

మళ్ళీ ఆమెకు మెలుకువ వచ్చీరాగానే అనుకోకుండానే బిడ్డకోసం ఆత్రంగా చేతులు చాచింది.

"అయాం సారీ!"

ఆమె లేడీ డాక్టర్ వైపు చూసింది. నర్సువైపు చూసింది.

ఆఖరుగా అతని వైపు చూసింది.

ఆ తర్వాత పక్కబెడ్ వైపు చూసింది.

ఆ బెడ్ మీద పేషెంట్ తన బిడ్డకు పాలిస్తోంది.

"విధి చాలా క్రూరమైనదమ్మా. మొదటి అనుభవమే నీకు చేదు అనుభవమవటం దురదృష్టం. విచారించకు" ఓదార్పుగా అందామె.

డాక్టర్ అతనితో ఏదో అంది.

అతను ఆమెను భుజం పట్టుకొని పక్కనుండి లేపేడు.

లత వెళ్ళబోతూ పక్కబెడ్ మీద శిశువును చూసింది. దగ్గరికి వెళ్ళి ఆ బిడ్డను చేతుల్లోకి తీసుకొని ముద్దుపెట్టు కొంది.

"మీ పాప చాలా బాగుందండీ. మీరు అదృష్టవంతులు"

బిడ్డను తల్లి చేతికిచ్చి అవతలకి అడుగువేయబోతుండగా ఆ తల్లి లత చేయిపట్టుకొని ఆపింది.

చేతిలో ఓ కాగితం పెట్టింది.

"అందులో నా అడ్రస్ ఉందమ్మా! అప్పుడప్పుడు వచ్చిపోతుండు"

ఆమె వచ్చి వాకిట్లోవున్న కారు ఎక్కింది.

కారు ప్రాతఃకాలపు ఎండలో తళతళా మెరుస్తూ నగరంలో ముఖ్యవీధుల గుండా వెళ్తోంది.

అతను ఆమె భుజంపైన తన కుడి చేతినివేసి దగ్గరికి తీసుకున్నాడు.

"లతా! భగవంతుడు ఇదీ మన మంచి కోసమే చేసేడేమో! విచారించకు. ఆ గతాన్ని పూర్తిగా మర్చిపో. కొత్త జీవితం నీ కోసం ఎదురు చూస్తోంది"

ఆమె మాట్లాడలేదు.

"హాస్పిటల్‌లో నీ పక్క బెడ్ పేషెంట్, ఆమె బిడ్డ ఇద్దరూ కూడా చచ్చిబతికేరని డాక్టర్ చెప్పింది. కానీ నిజజీవితంలోనే నువ్వు చచ్చి మళ్ళీ బతకబోతున్నావు"

"అంటే...?"

"'ఆకాశదీపాలు' హిట్ అయింది. కానీ అంతకు ముందే నిన్ను ఎవరో హత్య చేసినట్లు వార్త లోకానికి తెల్సింది. ఆ హత్య చేసింది ఎవరో కాదు. నేనుట. ఆ వార్తను నేను ఖండించాననుకో. కానీ చనిపోయావనుకొన్న నిన్ను, ఓ హిట్ పిక్చర్ హీరోయిన్ను నేనివాళ బతికించి ప్రేక్షకలోకానికి ప్రజెంట్ చేయ బోతున్నా. చిత్రలోకానికే ఇది సెన్సేషల్ న్యూస్ కాబోతోంది. నువ్వే చిత్రలోకానికి భవిష్యత్ తారవు. నేనే ప్రఖ్యాత దర్శకుడిని"

ఆమె మౌనవ్రతాన్ని వదలలేదు!

* * *

ఇరవై ఏళ్ళ తర్వాత...

'ఫిలిం సొసైటీ' అన్న బేనర్ ఆ థియేటర్ ముందు వేలాడుతోంది,

థియేటరు ముందు తొక్కిసలాట లేదు. ప్రదర్శించబోతున్న సినిమా

'సంస్కరణ!'

జనం ఆ సినిమా తమకి కానట్లు పెదవి విరిచిపోతున్నారు. అందులో ఒక్క దర్శకుడి పేరు తప్ప నటీనటుల పేర్లు ఎవరికీ తెలియదు.

సభ్యులు కార్లలో, స్కూటర్లపై, ఆటోలలో వచ్చి లోపలికి పోతున్నారు.

సినిమా ఆరంభమయింది. రెండు గంటల తర్వాత అంతమయింది కూడా.

రాధిక, ప్రతాప్ థియేటర్‌లో నుంచి బయటికి వచ్చి పార్క్ చేసివున్న కారులో ఎక్కారు.

రాధిక డ్రైవింగ్ సీటులో కూర్చుంది.

"ఎలా వుంది సినిమా?" ప్రతాప్ కాస్సేపయ్యాక రాధిక నడిగేడు.

"క్రితంసారి సినిమా చూసినపుడు ముందుగా అభిప్రాయం నేను చెప్పేను. ఈ సారి ఆ వంతు నీది"

"మరి ప్రశ్న అడగలేదేం?"

"అడిగేదాకా నువ్వు ఆగలేదేం? నువ్వు తొందరపడితే నాది తప్పా? ఎలా వుంది ఇపుడు చెప్పు"

రాధిక, ప్రతాప్‌లు ఇద్దరూ సినిమాలు ఎక్కువగా చూస్తారు.

ఇద్దరికీ బోలెడంత డబ్బుంది. అందముంది. తెలివితేటలున్నాయి. వాళ్ళ ఆనందాన్ని చూసి సంతోషించే పెద్దలున్నారు. రాధిక తండ్రి ఇటీవలే చనిపోయాడు.

రాధిక యమ్మే లిటరేచర్ ప్రీవియస్ చదువుతోంది. సంగీతం, సాహిత్యం, సినిమాలు, నాటకాలు... ఏవన్నా అభిరుచే. కానీ ఎందులోనూ ప్రవేశం లేదు.

ప్రతాప్ తండ్రికి బిజినెస్‌లో సాయంగా ఉంటూ మేనేజ్‌మెంట్‌లో ఏదో కోర్సు చదువుతున్నాడు. టెన్నిస్ ఆడటం, సినిమాలు చూడటం తప్ప అతనికి మరే ప్రపంచమూ తెలీదు. సినిమాలయినా రాధికతోనే చూస్తాడు. బాగోగుల గురించి వాదనలు చేస్తాడు. నిజజీవితంలో అతనిది బిజినెస్ ప్రవృత్తి అయినా సామాజిక, సాంస్కృతిక విషయాల్లో సంస్కరణ దృష్టి ఉంది. సమాజాన్ని మార్చటానికి సినిమా ఓ మంచి సాధనమని అతని అభిప్రాయం.

"నాకు చాలా బ్రహ్మాండంగా ఉంది. ఇరవయి ఏళ్ళ క్రితమే అంతటి సామాజిక చైతన్యంతో సినిమా తీసారూ అంటే... ఓ...ఐ కాంట్ బిలీవ్! చాలా ఉన్నత మైన విలువలు గల సినిమా. నాకే ఏమిటి ఏపాటి కాస్త బుర్ర ఉన్నవాళ్ళకయినా ఈ సినిమా నచ్చితీరాలి"

రాధిక ముక్కు ఎగరేసింది. కళ్ళు ఇంతవి చేసి ప్రతాప్ వేపు వింతగా చూసింది.

"వాట్ డూ యూ మీన్? సినిమా నాకు నచ్చలేదు. అయితే నేను ఏపాటి బుర్రలేనిదాన్ననా నీ ఉద్దేశ్యం?"

ప్రతాప్ మెల్లగా నవ్వేడు.

ఆ నవ్వు అంటే రాధికకు చాలా ఇష్టం.

"బ్యూటిఫుల్! అలా నువ్వు నవ్వినపుడు నాకు ముద్దొస్తావ్"

"ఊ! ముద్దు పెట్టుకోరాదూ...నేను వద్దన్నానా?"

"అబ్బ ఆశ! ఆ రోజు రానియ్. అపుడు ఒకటేమిటి..."

"ఆ రోజు ఎప్పుడొస్తుందో?"

"ఎదురు చూడటంలో తీపి ఉంది కదూ?"

"ఊహూ. లేదు. నాకు కల్సిపోపటంలో తీపి ఉంది" అంటూ ఆమెను

 

దగ్గరికి లాక్కోబోయాడు ప్రతాప్.

"ఊ. దూరం, దూరం. ఇది సినిమా కాదు. జీవితం"

ప్రతాప్ నవ్వినపుడు వాళ్ళ మధ్య మామూలుగా జరిగే సంభాషణ అది. కాని ఇవాళ రాధికకు ప్రతాప్ నవ్వు చూడ గానే ముద్దేయలేదు.

ఆ నవ్వుకు అర్థం తనకి బుర్ర లేదని చెప్పటమేగా?

ఆమెకు చిరుకోపం వచ్చింది.

ఆ కోపం అందమైన ఆమె ముక్కు చివరికి చేరింది.

మూతి అదో విధంగా ముడి పడింది అది అలకకు చిహ్నం!

అలా రాధిక మూతి ముడుచుకుంటే, ఆమె ముక్కుచివర కోపం ఉంటే... అతనికి సర్దాగా ఉంటుంది.

"మూతి ముడుచుకొంటే నువ్వు మరీ అందంగా ఉంటావు రాధీ! ఆ ముక్కును, మూతిని చూస్తుంటే నాకు సత్యభామ గుర్తుకొస్తుంది తెల్సా?"

"సత్యభామను మీరెప్పుడు చూసారు పాపం!"

"ఎప్పుడయితేనేం కాని... అలా అసూయపడకు. అలక, అసూయ, చిరు కోపం... అందమైన ఆడవాళ్లకు ఆభర ణాలే సుమా!"

"చాల్లే బడాయి. నాకు కోపం వచ్చింది. నీ కవిత్వానికి నేనేం నవ్వాను తెల్సా?"

"నిన్నెలా నవ్వించాలో నాకు తెల్సుగా"

"ఎలా?"

"ఇలా..."

అతను ఆమె ముక్కు పట్టుకో బోయాడు. బుగ్గమీద ముద్దు పెట్టుకోబో యాడు. ఆమె తప్పించుకొంటే వెంట బడ్డాడు.

"రాధీ... రాధీ! నీ ముక్కును కొరి కెయ్యాలనిపిస్తోంది. అలకతో పొంగిన ఆ బుగ్గమీద ముద్దును ప్రింట్ చేయాలని ఉంది. ప్లీజ్, ప్లీజ్..."

"ఛీ...మరీ ఇంత సిగ్గులేని మగా ళ్లంటే నాకు అసహ్యం బాబూ. ఇదేం సినిమా అనుకొన్నారా? యదార్థజీవితం"

ఇదికూడా వాళ్ళ మధ్య మామూలుగా జరగాల్సిన సంభాషణే!

కానీ ఇవాళ రాధిక అందుకు అవకాశ మివ్వలేదు.

"మహా తాటికాయంత బుర్ర నీకే ఉంది. కానీ ఏం లాభం? అందులో మట్టి కూడా లేదాయె. మైనపుముద్ద"

ప్రతాప్ మళ్ళీ నవ్వేడు.

"ఉడుకుమోతనం అని దాన్నే అంటారోయ్. నీకు నచ్చకపోతే ఎందుకు నచ్చలేదో చెప్పరాదూ?"

"నీవు ఎందుకు నచ్చిందో చెప్పేవు కనుకనా? బుర్ర లేకుండా ఇతరులకు బుర్ర లేదంటం మాత్రం తెల్సు"

"శాంతించు,దేవీశాంతించు. బుద్ధి గడ్డి తిని తొందరపడితి. ఆగ్రహించకు ఈ బుర్రలేని దీనుణ్ని"

ఆమె నవ్వింది. అతనూ నవ్వేడు.

"ఎందుకు నచ్చలేదో ఇప్పుడు చెప్తారా దేవిగారు"

"మా ఇల్లు వచ్చిందని గ్రహించి కారు దిగుతారా అయ్యగారు" అంటూ కారు ఆపింది రాధిక.

"అరె! అప్పుడే వచ్చిందా మీ ఇల్లు?"

"ఊ! నా అభిప్రాయం కావాలంటే

లోపలికి రావాలి నువ్వు. నాతోబాటు భోజనం చేస్తే అప్పుడు చెప్తాను"

"సారీ రాధీ! నాన్నగారు నాకోసం ఎదురు చూస్తుంటారు. ఫోను చేసి సాయంకాలం ఎప్పుడొచ్చేదీ చెప్తాగా!"

"ఆల్ రైట్ రామచంద్రా! నీ పితృభక్తికి మెచ్చి అనుమతి ఇచ్చుచుంటిని"

కారు కదిలింది. వెళుతున్న కారునే చూస్తూ కాస్సేపు నిల్చొని లోపలికి ప్రవేశించింది రాధిక.

"రాధీ! నిన్ను చూడటానికి ఎవరొచ్చారో చెప్పుకో చూద్దాం" తల్లి ఆమెను చూస్తూనే అంది.

ఎవరు?

ఆమె కళ్లు అటూ ఇటూ వెతికేయి.

టేబిల్ మీద రకరకాల ప్రెజెంట్స్!

వాకిలి దగ్గర చెప్పులు!

"నాకు తెల్సులే మమ్మీ! మాధురీ ఆంటి వచ్చింది కదూ?"

* * *

రాధిక గొంతు విని మాధురి లోపలి నుండి ఆత్రంగా బయటికొచ్చింది.

అయితే రాధిక ఎప్పటిలాగా ఉత్సాహంగా ఆమె వద్దకి రాక మాధురినే చూస్తూ అలాగే నిలబడింది.

"అదేమిటే...అలా మొద్దులాగ నిలబడిపోయావ్?" తల్లి కలుగచేసుకొంది.

"ఆంటీమీద నాకు కోపం వచ్చింది" అంది మూతి ముడిచి రాధిక.

"ఏమ్మా...ఎందుకు? నేనేం తప్పు చేసేను?" మాధురి రాధిక దగ్గరికొచ్చి తల మీద చెయ్యి వేసి ఆప్యాయంగా నిమురుతూ ప్రేమగా అడిగింది.

"సినిమా తారలు ముసలివాళ్లయినా గ్లామరస్‌గా మేకప్ చేసుకొంటారు. అవునా?"

"అవును. నేనూ చేసుకొన్నానుగా?"

"ఏం చేసుకొన్నావు? తల వెంట్రుకలకు 'డై' అయినా చేయలేదు. అమ్మమ్మలా వున్నావు. 'గంధర్వ కన్య'లో హీరోయిన్‌లా వున్నావా? ముసలిదానిలా కన్పించాలని నీకింత కోరిక ఎందుకు ఆంటీ?"

"అది సినిమా మాయా ప్రపంచం తల్లీ! బయట కూడా ఆ వేషాలు వేయనా? ఆ బతుకుతో విసిగి వేసారినప్పుడే కదా మామూలు వేషంలో సేద తీర్చుకొనేది?"

"కానీ ఈ వేషంలో ఎవరైనా చూస్తే నీ ఇమేజ్ పోదూ?"

"నాకా హీరోయిన్ యిమేజ్ అక్కర్లేదు బేబీ! సహజంగా బతకాలని వుంది. ఆ సినిమా జంఝాటంలోనుంచి బయటపడాలని తాపత్రయపడుతున్నాను"

"అయినా నువ్వు త్వరగా ముసలిదానివయిపోతున్నావ్ ఆంటీ! క్రితంసారికీ, ఈసారికీ నీలో భేదం కన్పిస్తున్నది"

"వయసు పైనబడుతున్నదేకాని తరిగిపోవటంలేదు కదమ్మా..."

"వయసు! వయసు. అసలు నీ వయసు ఎంతేమిటి...మహా ముప్పై అయిదు లేకపోతే నలభై-అంతేగా!"

మాధురి జవాబుగా నవ్వింది.

"సినిమా హీరోయిన్లని ఏమైనా అడగవచ్చుకాని వయసు అడగవచ్చా! తప్పుకాదూ? మాధురి నాకన్నా దాదాపు ఇరవై ఏళ్ళు చిన్నది" పార్వతమ్మ అంది.

"అసలింతకీ నీవయసెంత మమ్మీ!"

"నీకన్నా నలభై ఏళ్ళు పెద్ద"

"అయితే నా వయసెంతటా?"

"నాకేం తెల్సు? నీకే తెలవాలి"

"కన్నతల్లివి. నీకు కాకపోతే నాకు తెలుసుందా"

పార్వతమ్మ ఉలిక్కిపడి మాధురి వైపు చటుక్కున చూసింది.

మాధురి మొహంలో ఓ క్షణం నీలి నీడ తెర!

అంతలోనే ఆ తెర తొలిగిపోయి ఆమె మొహంలో నవ్వు వెలసింది.

"మీ అమ్మకు తన వయసు, నా వయసు చెప్పటమే ఇష్టంలేదమ్మా! ఇక నీ వయసు చెపుంధా? ఆ విషయాలకేంకాని నీ కోసం ఈసారి ఏం తీసుకొచ్చానో చూడు"

రాధిక బల్లమీది ఆ వస్తువుల వైపు చూడకుండా తల తిప్పుకుంది.

"వచ్చినప్పుడల్లా ఇలా ప్రెజెంటేషన్స్ తీసుకొస్తే నాకు కోపం వస్తుందని చెప్పేనా? నేనేం చిన్నపిల్లనా యింకా?"

మాధురి నవ్వింది ప్రేమగా—

"కాదమ్మా పెద్దదానివయ్యావు. ఆ సంగతి మీ అమ్మకు, నాకు కూడా తెల్సు. కానీ నువ్వు మాకు ఎప్పటికీ చిన్నదానివేనమ్మా! నా కంటితో చూసే శక్తి నీకుంటే ఎంత బాగుండును!"

మాధురి కళ్లు రాధికనే చూస్తున్నాయి.

* * *

టెలిఫోన్ రింగ్ అవుతోంది.

మాధురి బెడ్ మీద పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటోంది.

అది చాలా అధునాతనమైన ఎయిర్ కూల్డ్ గది. కిటికీకి తెరలు వేలాడుతున్నాయి. ఓ బల్లమీద టెలివిజన్, మరో వైపు ఓ అద్దాల బీరువాలో అందంగా పేర్చి వున్నాయి...కప్పులు షీల్డులు. మరోవైపు మాధురి బెడ్‌కు తలవైపుగా నిలువెత్తు వెంకటేశ్వరస్వామి పటంవుంది. మాధురిపడుకున్న సింగిల్ బెడ్ అందంగా వుంది. బెడ్ పక్కనే టీపాయ్ వుంది.

మాధురి చెయ్యిచాపితే అందేటంత దూరంలో వుంది ఫోను. అయినా ఆమె చెయ్యిచాపి ఫోను అందుకోలేదు.

ఫోను మోగుతూనే వుంది.

మాధురి దృష్టి పుస్తకంమీదనేవుంది.

గది తలుపులు నెట్టుకుని పనిమనిషి వచ్చింది. ఆమె చేతిలోని 'ట్రే'లో ఓ గ్లాసు నిండా ఫ్రూట్ జ్యూస్ వుంది.

పనిమనిషి నిశ్శబ్దంగా వెళ్ళి టీపాయ్ మీద గ్లాసును పెట్టింది. మాధురి అప్పటికీ దృష్టి మరల్చలేదు.

"అమ్మగారూ ఫోన్..."

మాధురి పుస్తకంనుంచి దృష్టి మరల్చకుండానే 'ఊ' అంటూ చేతితో సౌంజ్ఞ చేసింది.

"హలో....ఊ... మాధురిదేవిగారిల్లేనండీ...నేనూ పనిమనిషినండీ...ఊ... వారు...వారు..."

"మీరు వున్నారా లేదా అని అడుగుతున్నారండీ" అంది పనిమనిషి కంగారుగా—మాట్లాడేకొనసని చేతితో మూసి.

"ఏమిటీ! మీ అమ్మగారు ఇంట్లో లేరని చెప్పమంటున్నారా!" ఫోనులోనుంచి అవతలి కంఠం ఎగతాళిగా అంది.

బిత్తరపోయి ఏంచేయాలో తోచనట్లు మాధురి వైపు చూసింది పనిమనిషి.

"అసలు ఎవరు మాట్లాడుతున్నారో కనుక్కోకుండా ఏమిటే మాట్లాడుతున్నావ్?" అంటూ పుస్తకం మూసి మంచంమీదనుంచి లేచింది.

"అసలు మీరెవరండీ!" పని మనిషి గట్టిగానే అడిగింది ఫోనులో.



"మీ అమ్మగారి మొగుడినని చెప్పు. మీ అమ్మగారు ఎక్కడికైనా వెళుం దేమో! అరవింద్ బయలుదేరి మరో పది నిమిషాల్లో వస్తున్నారని చెప్పు."

ఫోనులో మాటలు మాధురికి కూడా విన్పించాయి.

"నేను ఇంట్లో లేనని చెప్పు"

కానీ అప్పటికే అవతల వైపు అరవింద్ ఫోన్ పెట్టేసేడు. పనిమనిషి బెరుకు బెరుకుగా మాధురివైపు చూస్తూ నిలబడింది. ఆ పనిమనిషి కొత్తగా చేరింది ఆ ఇంట్లో.

"నువ్వెళ్ళు"

ఫోను క్రెడిల్ మీద పెట్టేసి పనిమనిషి 'బతుకు జీవుడా' అనుకొని బయటపడింది.

మాధురి బెడ్ మీదనుంచి లేచింది.

నిలువుటద్దంలో తనని తాను చూసుకొంది.

మొహాన ఏ విధమైన మేకప్ లేదు. చీరకూడా సామాన్యంగా వుంది.

అలా సహజంగా వుండటం అంటే మాధురికి ఇష్టం.

అయినా తాను ఎంత అందంగా వుంది?

తన అందాన్ని చూసుకొని ఆమె ఆనందించలేదు. పరవశించిపోలేదు. భయపడింది. అసహ్యించుకొంది.

డ్రెసింగ్ టేబిల్ ముందు కూర్చుంది. టేబిల్ మీద మేకప్ సామాను వుంది. అందులోనుంచి ఓ బ్రష్ తీసింది. తీస్తూ–

'అరవింద్' అని గొణుక్కుంది.

అరవింద్ అద్దంలో కన్పించాడు.

ఆమె వెనక్కి తిరిగి చూసింది.

తలుపు వేసే వుంది. గదిలో ఎవరూ లేరు.

అద్దంలో చూస్తే–అరవింద్.

ఆమె అద్దంలో ఆ అరవింద్ బొమ్మను చెరిపేయటానికి ప్రయత్నించబోయింది.

మేకప్ చేసుకొంటున్నదన్నమాటే గాని ఆమె మనస్సు వెనక్కి పోయింది. ఎక్కడికో...ఎప్పటికో...

ఒక పెద్ద బిల్డింగు. ప్రవేశ ద్వారం పక్కన గోడకున్న పాలరాయి మీద 'అరవింద్ సినీ దర్శకుడు' అని వుంది.

ఆ బిల్డింగ్‌లో విజిటర్స్ రూమ్ కిటకిటలాడుతోంది. పత్రికా ప్రతినిధులు, కెమేరామేన్లు... కాఫీలు, డ్రింక్స్ తాగటం ముగించారు. రణగొణగా మాట్లాడుకొంటున్నారు.

ఒక్కసారిగా ఆ హాలులో నిశ్శబ్దం ఆవరించింది. అరవింద్ లోపలినుంచి వచ్చాడు. ఖరీదైన డ్రెస్ వేసుకొని వున్నాడు. అందరికీ చేతులు జోడించి నమస్కరించాడు.

"ఫ్రెండ్స్! నా ఆహ్వానాన్ని మన్నించి ఈ చిన్న పార్టీకి విచ్చేసిన మీ అందరికి ముందుగా నా ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను. నేను దర్శకత్వం వహించిన 'ఆకాశదీపాలు' చిత్ర విజయానికి కారకులైన అందరికీ వినమ్రుడినై నమస్కరిస్తూ ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

అయితే 'ఆకాశ దీపాలు'లో ప్రథమంగా హీరోయిన్ పాత్ర వహించి మీ అందరి ఆదరాభిమానాలతో పాటు ఇండస్ట్రీలో ఎందరో నిర్మాతల, దర్శకుల దృష్టిని ఆకర్షించిన లత, చిత్ర నిర్మాణం

పూ ర్తయిన దగ్గరినుంచీ ఎవరికీ కనిపించక పోవటంతో అనేక మంది అనేక విధాలుగా అనుకోటం సహజం. మీ అందరికీ తెల్సు— చిత్రరంగానికి లతను పరిచయం చేసింది నేను. ఆమె అంతర్ధానంపై వచ్చిన అనేకానేక పుకారు కథల్లో నేను ఆమెను హత్య చేసేనన్న కథ కూడా వుందని, ఆ కథకు బాగా ప్రచారం వచ్చిందని కూడా మీకు నేను వేరే చెప్పనవసరం లేదు. ఆ కథను నేను ఇంత వరకు ఖండించక పోవటంతో ఆ కథకు బలం కూడా వచ్చింది. అయితే ఇవాళ మీ అందరికీ విన్నవిస్తున్నాను. నేను నిరపరాధిని. పైకి వస్తున్న ఓ కళాకారిణిని అసూయతోనో, మరే విభేదంతోనో హత్య చేసేటంత కిరాతకుడిని కాను నేను. నేను మనిషిని— అందునా కళాకారుడిని"

పత్రికా విలేఖరులలో కలకలం... తలకోమాట మాట్లాడుతున్నారు— తమలో తాము.

"సోదరులారా. నా స్టేట్‌మెంట్‌ను మీరు నమ్మకపోవటం సహజం! అందుకే ఇన్నాళ్లు నేను నాపై వచ్చిన నిందను ఖండించలేదు. కానీ ఇవాళ ఆ సమయం ఆసన్నమయింది"

మళ్లీ కలకలం...

"నేను హంతకుడిని కాను. ఎందుకంటే..."

అతను ఓ క్షణం ఆగేడు. శ్రోతల్లో సస్పెన్స్!

"ఎందుకంటే— లత అసలు హత్య చేయబడలేదు కనుక"

"లత...లత...లత.. అయితే ఎక్కడుంది ఆమె?" ఎన్నో కంఠాలు అరిచాయి.

"తొందరపడకండి.నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాలంటే ఆమెనుఫిజికల్‌గా జనానికి చూపాల్సిన అవసరం వుంటుం దాని నాకు తెల్సు. అందుకే ఆమెను వెతికి పట్టుకొన్నాను. చిత్రాల్లో నటించటం ఇష్టం లేక ఎవరితో చెప్పకుండా ఎవరో స్నేహితురాలి వద్దకి పారిపోయిన ఆ 'మహానటి'ని వెతికి పట్టుకొచ్చాను. ఆమెను అతికష్టంమీద నటించటానికి అంగీకరింపజేసి తీసుకువచ్చాను. ఆమె కథానాయికగా నేను దర్శకత్వం వహించి స్వంతంగా పిక్చర్ నిర్మించబోతున్నాను అని ప్రకటించటానికి సంతోషిస్తున్నాను"

అందరూ చప్పట్లు కొట్టారు.

"ఇప్పుడు ఆ 'మహానటి'ని మీరు స్వయంగా చూడబోతున్నారు. ఆమెను చూడండి. చూసి ఆశీర్వదించండి. ఇదిగో"—అంటూ లోపలికి వెళ్ళబోయి ఆగేడు.

"మరోవిషయం. 'ఆకాశదీపాలు'లో లత నటిగా చిరంజీవి. కానీ ఆ పేరుగలామె చనిపోయిందని చాలామంది అనుకుంటున్నారు. కానీ నేను అలా అనుకోడంలేదు. అయినా ప్రజాభిప్రాయాన్ని మన్నించి ఆమె పాతకొత్త పేర్లు రెండూ కల్సివచ్చేటట్లుగా 'మాధురీ లత'గా మీ అందరీ అనుజ్ఞతో ఆమెకు నామకరణం చేసి, ఆ 'మహానటిని' చిత్రసీమకు అంకితం చేయబోతున్నాను"

చప్పట్లు ... ఉత్సాహం ... కోలాహలం.

ఫొటోగ్రాఫర్‌లు తోసుకుంటున్నారు అరవింద్ లోపలినుంచి 'మాధురీ లత'ను భుజంపై చెయ్యి వేసి నడిపించుకొంటూ వచ్చాడు.



ఎన్నో ఫ్లాష్‌లు వాళ్ళ మొహాలమీద వెలిగేయి!

* * *

"నాకు ఈ పేరు ప్రఖ్యాతులు, ప్రచారం, ధనం ఏమీ అక్కర్లేదని మీకు ఎన్నోసార్లు చెప్పేను. వీటన్నిటికన్నా నేను విలువనిచ్చేది వివాహానికి. పిక్చర్ పూర్తి అయ్యాక మనం వివాహం చేసుకొందామన్నారు. పిక్చర్ సక్సెస్ కూడా అయింది. దర్శకుడిగా మీకు, నటిగా నాకు పేరుప్రఖ్యాతులొచ్చాయి. మీరు అప్పుడే పది పిక్చర్లకు దర్శకత్వానికి అంగీకరించారు. స్వంత పిక్చర్ తీయబోతున్నారు. ఇకయిప్పుడు మన వివాహానికి అభ్యంతరం ఏమిటి మీకు?"

అరవింద్ మాధురి వైపు చూసి నవ్వాడు. ఆప్యాయంగా ఆమె భుజంపై చేతులు వేసేడు. గడ్డం పట్టుకొన్నాడు ప్రేమగా. ఆమె కళ్ళలోకి చూస్తూ తియ్యగా అన్నాడు-

"నీకు చిత్రసీమ విషయం తెలియదు లతా! నిజానికి నిన్ను పెళ్ళిచేసుకొని నా ధర్మపత్నిగా నలుగురికీ చెప్పుకోవాలని నీకన్నా నాకెక్కువ ప్రబలాటంగా వుంది. నిజానికి ఇవాళ నాకున్న ఈ ఖ్యాతి, పేరు, ధనం అంతా నీ వల్లనే వచ్చాయి. నిన్ను చూసిన క్షణం నా జీవితంలో పవిత్రమైనది. అయితే ఇప్పుడు మనం పెళ్ళి



చేసుకుంటే మనిద్దర్నీ కూడా గంగలో ముంచేయగలదు ఈ ఫీల్డు. ఫీల్డుని మనం శాసించేరోజు త్వరలో వస్తుంది. అప్పుడు పెళ్లిచేసుకొందాం. అందాకా నువ్వు ఓపిక పట్టాలి. పిక్చర్ ఫీల్డులో వివాహిత స్త్రీలకు ఏ కొద్దిమందికో తప్ప విలువలేదు లతా. చూసావుగా-నీ చావు విషయంలో ఎంత సంచలనం సృష్టించి ప్రచారం సంపాదించానో? అలాగే మన పెళ్ళి చిత్రసీమలో ఓ మహోన్నత ఘట్టంగా కీర్తించే పరిస్థితి త్వరలో వస్తుంది. ఈలోగా మన మీద 'స్కేండల్స్' ఎన్నో ప్రచారంలోకి రావచ్చు. నిజానికి అవన్నీ నిజాలే అనుకో. అయినా మనిద్దరిమధ్య లైంగిక సంబంధం వుందని అంగీకరించకూడదు. అదే సస్పెన్స్. అలాంటి కథల వల్లే సినిమా పత్రికలవాళ్ళు బతుకుతారు. మనకు ప్రఖ్యాతి వస్తుంటుంది"

"మీరు సినిమా ఫీల్డునే దృష్టిలో వుంచుకొంటున్నారు. నా కోరిక, నా స్థితి మీరు అర్థంచేసుకోరేం? నేను సాధారణ స్త్రీని"

"ఊహూ. నేను ఒప్పుకోను. నువ్వు అసాధారణ స్త్రీవి. నీలో అసామాన్య ప్రజ్ఞా ప్రాభవాలు నీకు తెలీకుండానే నిక్షేపం అయివున్నాయి. వాటినన్నింటినీ నేను వెలికి తీసుకొస్తాను. అవి రత్నాలు, ముత్యాలు, వజ్రాల్లా ప్రకాశించేలా

చేస్తాను"

"నాకీ ఆశలువద్దు. నాకు కావల్సింది పెళ్లి...సంసారం...మాతృత్వం"

"అన్నీ వస్తాయిగదా! నేను ఇస్తాను కదా! తొందరపడకు దేవీ"

వాకిట్లో టాక్సీ ఆగింది. సూర్యకాంతం దిగింది.

లత సినిమా నటి అయ్యాక తల్లికి తన విషయాలు తెలుపుతూ ఉత్తరం రాసింది. ఆమెను తన దగ్గరికి రమ్మని కూడా ఆహ్వానించింది.

"రవికి మన వృత్తి అంటే ఎంత అసహ్యమో నీకు తెల్సు. వాడు గతాన్ని మర్చిపోయి గౌరవంగా జీవించటానికి తగు ప్రయత్నాలు చేసుకొంటున్నాడు. ఒకసినిమానటిని తన అక్కగా చెప్పుకోటంకూడా వాడికి ఇష్టం లేదు. పైగా ఇంట్లోనుంచి లేచిపోయి కుటుంబానికి తలవంపులు తెచ్చేవని వాడికి నువ్వంటే కోపంగా వుంది. నేను ఆశలన్నీ వాడిమీదే పెట్టుకొని వున్నాను. వాడి ఇష్టానికి వ్యతిరేకంగా నీదగ్గరికి ఎలా రాగలను లతా! వచ్చినా నాకు విలువేముంది? ఫలానా 'సినిమా నటి తల్లి' అంటారు. అంతేగా?"

అలా జవాబిచ్చిన సూర్యకాంతం ఇవాళ పిలవని పేరంటంగా ఎందుకొచ్చింది?

అశోక్‌కుమార్ తరపున రాయబారిగా వచ్చినట్లు తెల్సుకోటానికి ఎంతోసేపు పట్టలేదు.

"మీ నాన్నగారు నిన్ను సినిమానటిని చేయమనలేదు లతా! మన వృత్తిధర్మానికి విరుద్ధంగా పెండ్లిచేసి నిన్నొకరి ఇంటిదాన్ని చేయమన్నారు. అలా నేను చేస్తానన్న ఆశతోనే నీకు పుట్టబోయే బిడ్డలకు కొంత ఆస్తికూడా రాసిపోయారు. ఆయన చివరికోరిక తీర్చటం మన ధర్మం కాదా లతా!" అంటూ సూర్యకాంతం ఓ పత్రాన్ని లతకు అందించింది.

"విద్యాపతిగారు నా తండ్రిగారా?"

"అవును. ఆయన నా భర్త. నేను ఆయనపట్ల నా వృత్తిధర్మాన్ని ఎన్నడూ తప్పలేదు. ఆయన చివరికోరికే తీర్చలేకపోయాను. ఇప్పటికన్నా నిన్నో ఇంటిదాన్ని చేద్దామనే ఇప్పుడొచ్చాను" అంటూ అసలు విషయం బయట పెట్టింది.

అశోక్‌కుమార్ ఆమెను శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకోటానికి అంగీకరించి ముందుకొచ్చాడు.

'ఆకాశదీపాలు' సినిమా నిర్మాత అశోక్‌కుమారే అయినా లాభాలన్నీ అరవింద్ పొందేడు. చిత్రజగతుకి అశోక్ కుమార్ కొత్తకావటంవల్ల పేరుపొందిన పంపిణీవాళ్ళెవరూ చిత్రాన్ని తీసుకోటానికి ముందుకు రాలేదు. అరవింద్ ఎవరినో పట్టుకొని పిక్చర్ రిలీజ్ చేయించాడు. అతనికి సినిమా బాగా పోతుందని తెల్సు. అయితే అంతా కొత్తవాళ్ళన్న భయంతో ఎవరూ ముందుకు రాలేదు.

అరవింద్ చిన్న డిస్ట్రిబ్యూటర్లను జిల్లాల స్థాయిలో పట్టుకొన్నాడు. వాళ్ళ డబ్బుతో అశోక్‌కుమార్ నుంచి తను పిక్చర్ కొని మళ్ళీ వాళ్ళకే అమ్మేడు జిల్లాలవారీగా.

పిక్చర్ హిట్ అయింది. అయినా అశోక్‌కుమార్‌కు ఎక్కువ లాభించలేదు. డిస్ట్రిబ్యూటర్లకూ అంతంతమాత్రమే. అరవింద్ మాత్రం ప్రొడ్యూసరయ్యాడు.

తనని మోసంచేసిన అరవింద్ అంటే అశోక్‌కుమార్‌కి మంట. అతడి అదృష్టానికి కారణం లత. ఆ లతను అతని నుంచి




వేరుచేసి తనదాన్ని చేసుకొంటే ఆ అదృష్టం తన వద్దకే వస్తుంది. అరవింద్ పై పగ చల్లారుతుంది.

అయితే లతను తనదాన్నిగా చేసుకోవటం ఎలా?

హీరోయిన్‌గా తన పిక్చర్‌లోకి బుక్ చేసుకోటానికి తను పెట్టిన కండిషన్‌ను ఆమె అసహ్యించుకొంది. తనంటే మొదటి నుంచీ అసహ్యం. తానారాత్రి ఎంత రాక్షసంగా ప్రవర్తించిందీ లత మరచిపోదు.

'ఆకాశదీపాలు' హిట్ అయి పెద్ద తారల లిస్టులో చేరిపోయాక తనకు 'ఇంటర్వ్యూ' ఇవ్వటానికే నిరాకరించింది. ఇక ఎలా ఆమెను తనదాన్నిగా చేసుకోవడం?

సూర్యకాంతాన్ని ఆశ్రయించాడు.

విషయం తెలిసి అరవింద్ కంగారు పడ్డాడు. ఇప్పుడు లత అశోక్‌కుమార్‌ను పెళ్ళిచేసుకొంటే తన బేలెన్స్ పిక్చర్ ఫీల్డులో తప్పుతుంది. అంచనాలు తారుమారవుతాయి.

అందేత లతను లాలించాడు.. బుజ్జగించాడు... ఆశలు పెట్టాడు. అరచేతిలో వైకుంఠం చెప్తూ ప్రమాణాలు చేసేడు.

"అమ్మా! నీకన్నా, నాన్నగారికన్నా వివాహాన్ని అధికంగా కాంక్షించింది నేనే. నాకు మన దేశంలోని వివాహ వ్యవస్థ పైన అత్యంత గౌరవం వుంది. మన వృత్తిపైన తమ్ముడికన్నా మించి ద్వేషం, అసహ్యం వున్నాయి. అయితే ఏం లాభం? నేను స్త్రీని. స్త్రీగా పుట్టటమే నేను చేసుకొన్న పాపం. అందుకే నా చిన్న కోరిక తీరలేదు. ఇప్పటికే నా జీవితం అనుకోకుండా చాలా మలుపులు తిరిగింది. తాళి కట్టకపోయినా అరవింద్ నా భర్త అనుకొన్నాను ... అనుకుంటున్నాను. జీవితంతో మరో ప్రయోగం చేయటానిక్కూడా నేను అలసిపోయానమ్మా. దయచేసి నన్ను క్షమించు"

సూర్యకాంతం కోపంగావెళ్ళిపోయింది.

ఆ తర్వాత ఎన్నో ఏళ్లు గతించిపోయాయి. కాలం అందరి శరీరాలని కొరుక్కుతింది. కాని లత అందం ఏమాత్రం తరగలేదు. వయసును జీర్ణం చేసుకొని అందం అలాగే నిలబడిపోయింది.

అంతా ముసలితనాన్ని కప్పుకోటానికి, వయసును మరిపించటానికి మేకప్‌లు చేసుకొంటారు.

కాని లత?

వయసుకు తరగని తన అందాన్ని కప్పుకోటానికి మేకప్ చేసుకొంటుంది!




తలలో నెరసిన వెంట్రుకలు—కళ్ళకింద నల్లటి చారలు...

ముసలితనం కూడా తన మొహానికి అందాన్నిస్తున్నదేం? తనకు అక్కర్లేని ఈ అందం తనని వదిలి వెళ్ళదేం?

"మార్వలెస్! ముసలి మేకప్ చేస్తే ఎలా వుంటావో నేనే టెస్ట్ చేయిద్దామనుకొంటున్నాను. నువ్వే ఆ పని చేసేవ్! నా మనసులోని ఆలోచనను నీకు ఏ దివ్య

వాణి సందేశంగా పంపింది మాధురీ డియర్?"

ఆ పొగడ్తలను ఆమె స్వీకరించ లేదు.

అరవింద్ పొగిడేడంటే ఏదో పని వుందన్న మాటే!

"మళ్ళీ నాతో ఏమిటి పని?"

"పనిలేకపోతే నీ దగ్గరికి రాకూడదా?"

"నీ పనులు నెరవేర్చుకోటమే తప్ప, నీకు ఇతరుల అభిలాషలు, కోరికలు పట్టవని నాకు తెల్సులే"

"కోప్పడకు డియర్! నీ కోరిక తీర్చబోతున్నానని చెప్పటానికే వచ్చాను."

"హాఁ" మాధురి నిరాశగా నవ్వింది. "ఈ డైలాగు నాకు చాలా పాతది. నా శరీరం కూడా నన్ను మోసం చేయకపోయినట్లయితే, నా వయసుకు నేనిలా వుండి వుండవల్సినదాన్ని. ఈపాటికి నా కొడుకు లేక కూతురు పెళ్ళిని గురించి ఆలోచించాల్సినదాన్ని. ఇంకా నా పెళ్ళిని గురించే ఆలోచించుకోవాల్సి రావటం ఏ జన్మలో చేసుకొన్న పాపమో కదూ?"

"బరువు డైలాగులు చెప్పడంలో నువ్వు అందెవేసిన చెయ్యివి అని నాకు తెల్సు డియర్! కానీ బరువు డైలాగులు సినిమాల్లో చెప్తుంటే బాగుంటాయి. కానీ నిజజీవితంలో కాదు. నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నానని చెప్పేగా? నమ్మవేం!?"

"నమ్మి ఆనందంతో తబ్బిబ్బు అయిపోనా? నీకు ధన్యవాదాలు చెప్పుకోనా? నటించటం నా వృత్తి. నటింపచేసే వృత్తిని నువ్వు స్వీకరించావ్. కానీ నిజజీవితంలో కూడా నాచేత నటింప చెయ్యలేవు. నువ్వు నటిస్తే నేను ఆనందించను. అంత వెర్రిదాన్ననుకోకు. ఏం పని మీద వచ్చావో అది చెప్పు."

"చట్టరీత్యా కాకపోయినా మనం భార్యాభర్తలం మాధురీ! అలా మనం ఎంతో కాలం కలిసి జీవించాం. ఆ విషయాన్ని మర్చిపోయినట్లు మరీ ఇంత బిజినెస్ లైన్‌గా మాట్లాడటం నాకు నచ్చలేదు"

"చెప్పేనుగా. నువ్వు జీవితంలో నటిస్తావ్. నాకు కెమేరాముందు నటించటమంటేనే అసహ్యం... ఇక జీవితంలో ఏం నటిస్తాను? కాగా ఈ భార్యాభర్తల ఆట ఆడి ఆడి విసిగేసిందని ఎప్పుడో చెప్పేనుగా?"

"కానీ నిన్ను నా భార్యగా నేను ఇప్పటికీ భావిస్తున్నాను. అందుకే నిన్ను అగ్నిసాక్షిగా, చిత్రసీమ సాక్షిగా పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. మరొక్క మూడునెలలలో ముహూర్తం. దానికి ముందు నాదో చిన్న రిక్వెస్టు"

ఆమె మాట్లాడలేదు.

"ఎన్నో ఏళ్లు సినీరంగాన్ని సుప్రసిద్ధ దర్శకుడిగా ఏలేను నేను. కానీ ఇటీవల నా పిక్చర్స్ వరుసగా ఫ్లాప్ అయ్యాయని నీకు తెల్సు. అది ఆసరాగా తీసుకొని పరిశ్రమలో నా శత్రువులు నాకు 'ఫ్లాప్ డైరెక్టర్' అని బిరుదులిస్తున్నారు. ఎన్నో హిట్ చిత్రాలని తీసిన నేను 'ఫ్లాప్ డైరెక్టర్'గా చిత్రరంగం నుంచి విరమిస్తే చరిత్రలో నాకు స్థానం లేకుండాపోతుంది. అంచేత జీవితంలో చివరి పిక్చర్ హిట్... సూపర్‌హిట్ పిక్చర్ ఒక్కటి తీసి కళామతల్లి సేవనుంచి గౌరవంగా విరమించుకొందా మనుకొంటున్నాను. అందుకు నీ సహాయం అర్థిస్తున్నాను"

మాధురి ఇటీవల పిక్చర్స్‌లో నటించడం బాగా తగ్గించేసింది. బోలెడంత





ధనం ఉంది. ఆ ధనమంతా ఏం చెయ్యటం? తనకెవరున్నారని అస్తులు సంపాదించేదానికి ఆరాటపడటం?

అయితే ఇంట్లో ఊరికే ఉంటే కాల క్షేపం ఎలా అవుతుంది. పుస్తకాలు చదవటం అలవాటు చేసుకొంది. అన్ని విధాల నచ్చిన సినిమా అయితే సంవత్సరానికి రెండో మూడో సినిమాలలో నటించటానికి అంగీకరిస్తోంది. కానీ అరవింద్ ప్రమేయం ఉన్న సినిమాలలో మాత్రం నటించనని ఏనాడో ఆమె ఖరాఖండీగా చెప్పేసింది.

దాన్నిగురించి చిత్ర పరిశ్రమలో కొన్నాళ్ళు రకరకాల పుకార్లు చెలరేగాయి. ఆ పుకార్లతో అరవింద బిజినెస్ చేసేడు కూడా.

మళ్ళీ ఇప్పుడు తనని నటించమని అర్థిస్తున్నాడు.

మాధురి తల అడ్డంగా ఊపింది.

"అలా అనకు మాధురీ! ఇది నాకు దర్శకుడిగా పునరుజ్జీవనం అయితే, నీ నట జీవితానికి ఆ సినిమా కలికితురాయి అవుతుంది. అంత క్లిష్టమైన పాత్ర. నువ్వు తప్ప ఎవరూ నటించలేరు"

"నేను నటినని ఇంతవరకూ అనుకోవటంలేదు"

"నీ ప్రతిభ నీకు తెలీదులే. నా కొత్త సినిమా ఓ స్త్రీ జీవితకథ! ఆధారంగా నిర్మించబడుతుంది. కథానాయిక ఆ స్త్రీయే. వా స్తవ జీవిత చిత్రీకరణ. సాధ్యమయినంత వరకు పాత్రలన్నీ నిజ జీవితంలోవే తీసుకోవాలనుకొంటున్నాను."

"అంటే...?"

"అంటే...మాధురీ! నీ జీవిత కథను సినిమా తియ్యాలన్న కోరిక నాకు కలిగింది. అదో క్లాసిక్. కాగా చిత్రజగత్తులో కొత్త ప్రయోగం. నీ పాత్ర నువ్వు, నా పాత్ర నేను...అలా ఎవరి పాత్రలు వారే ధరిస్తారు. కరుణా శ్రీధరన్, సూర్జహాన్, శ్రీధరన్, మీ అమ్మ, ఆఖరికి అశోక్ కుమార్... నేచురల్ సెట్టింగులో నేచురల్‌గా..."

"నా జీవితంతో ఇంతవరకు చేసిన బిజినెస్ చాలలేదా? ఇంకా ఎందుకు ఆడుకొంటావ్?"

"నీ కథ మన పెళ్ళితో శుభం పలుకుతుంది.ఆ మరుసటి రోజే నిజజీవితంలోనూ మన పెళ్లి జరుగుతుంది. పబ్లిసిటీ వేల్యూ ఎంత బాగా ఉంటుందో ఆలోచించు"

"మిస్టర్ అరవింద్! పెళ్ళి చేసుకోమని తప్ప నిన్నింతవరకూ నేనేమీ అభ్యర్థించలేదు. ఇక ఇప్పుడా కోరికను నేను ఎన్నటికీ కోరను. ఇప్పుడు నిన్ను చివరి కోరికగా ఒక్కటి కోరుకొంటాను. నా జీవితాన్ని తెరకెక్కించకు. ప్లీజ్"

"లోకంలో జనమంతా తమ తమ కథలను, అనుభవాలను రచయితలకు చెప్పి కథలుగానో, నవలలుగానో రచించమని కోరుకొంటుంటారు. నువ్వు చెప్పకుండానే నేను సినిమా తీస్తానంటున్నాను. సంతోషించి సహకరించాల్సిందిపోయి..."

"సంతోషం!సహకారం! నాజీవితంలో నలుగురికి ఉపయోగపడే విశేషం ఏముందని సినిమా తీస్తున్నావ్? నా జీవితంలోఏంచూసుకొని నేనుసంతోషించాలి? సినిమా తీసి ఏ మహత్తర ప్రయోజనాన్ని సాధించబోతున్నావని నేను నీతో సహకరించాలి? నేను సహకరించను. కాగా నీ ఆలోచనను వ్యతిరేకిస్తాను"

ఇద్దరిమధ్యా వాగ్వివాదం పెరిగింది. ఘర్షణకు దారితీసింది.

"నీకు ఆలోచించుకోటానికి ఓ వారం

రోజులు గడువిస్తున్నావు మాధురీ!నువ్వు నాతో సహకరించావా వెల్ అండ్ గుడ్! సినిమా చివర్లో సినిమాలో మన పెళ్ళి దానితోపాటు నిజజీవితంలో మన పెళ్ళి-కూడా జరుగుతుంది. లేదా...నన్ను అనవసరంగా రెచ్చగొట్టి నాలో మృగాన్ని కదపకు. రాక్షసుడు నిద్రలేస్తే రక్త హోమం జరుగుతుంది. ఆలోచించుకో"

* * *

'ఒక ప్రసిద్ధ సినిమానటి నిజజీవితం ఆధారంగా ప్రసిద్ధ దర్శకుడు అరవింద్ చిత్ర నిర్మాణం. అందులో అరవింద్ ఓ ప్రముఖపాత్ర నటించటం విశేషం. కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలతో పాటు అరవింద్ దర్శకత్వం వహించి, నిర్మించే ఈ చిత్రం చిత్రసీమలో సంచలనంతీసుకు వస్తుంది. చాలావరకు నిజజీవితంలో పాత్రల్నే సినిమాలో నటింపచేయాలన్న దర్శకుడి ప్రయత్నం విజయవంతమయితే ఇది ప్రపంచ చలనచిత్ర పరిశ్రమ చరిత్రలోనే ఓ రికార్డు సృష్టించగలదు. ఇంతకూ ఎవరా ప్రసిద్ధ సినిమానటి?ఏమా జీవిత కథ? వివరాలకు ఎదురు చూడండి'

రెండు రోజుల తర్వాత అన్ని పత్రి కల్లోనూ ఈ వార్త వచ్చింది. ప్రజల్లో పెద్ద సంచలనాన్ని కలిగించింది.

ఎవరా ప్రసిద్ధనటి? ఆమె జీవితం ఎలాంటిది?

ఊహాగానాలు ఆరంభమయ్యాయి.

సరిగ్గా ఆరోజే ఫిలిమ్ సొసైటీవారు ఓ చర్చా కార్యక్రమం నిర్వహిస్తున్నారు. ఆ కార్యక్రమానికి అధ్యక్షుడుగా అర వింద్‌ని ఆహ్వానించారు. చర్చలో సభ్యు లెవరైనా పాల్గొనవచ్చు. "ఆధునిక సినిమా—సమాజ ఆరోగ్యం" అన్నది చర్చనీయాంశం.

సరిగ్గా అనుకున్నసమయానికి రాధిక ఇంటి ముందు ప్రతాప్ కారు హారన్ మోగింది.

"కమింగ్ బాయ్" అంటూ రాధిక హుషారుగా నడచి వెళ్ళి కారు ఎక్కింది.

"అరవింద్ సినిమా తీస్తున్నాడుట! వార్త చూసావా?"

"ఊ... అరవింద్ ఏ పని చేసినా విశిష్టంగానే ఉంటుంది"

"ఆ పిక్చర్స్ ఫ్లాప్ అయినా విశిష్టం గానే ఫ్లాప్ అవుతాయి"

"అమ్మాయ్! గెలుపు వోటములు, కష్టసుఖాలు కావడిలో కుండలని ఏదో సినిమాలో పాటవుంది. వినలేదూ? ఇంతకీ ఆ ప్రసిద్ధనటి ఎవరంటావ్?"

"ఎవరో వెంకమ్మ! ఎవరైతే నాకేం"

"చూడబోతే మా అభిమాన దర్శకు డంటే నీకు మహా మంటలాగుందే! ఈవేళ మన సొసైటీకి ముఖ్య అతిథిగా వేంచేసు న్నారు మా దర్శకుడు. కాస్త ఆయ నంటే మర్యాద చూపటం మన విధి."

"ఆయన్ని అమర్యాద చేయాల్సిన అవసరం నాకేమిటి! నేను వున్నదున్నట్టు మాట్లాడతాను. నీలాగా పొగడటం చేత కాదు"

"అంటే - చర్చలో తమరు పాల్గొన బోతున్నారన్నమాట!"

"ఏం తప్పా ? నాలాంటి వాళ్ళంతా నోరుమూసుకొని కూర్చొబట్టే ఈ సినిమా వాళ్ళు చెప్పిందల్లా వేదంగా చలామణి అయిపోతోంది. నేను నా విప్లవ కంఠాన్ని ఈవాళ విప్పుతున్నా"

చర్చా కార్యక్రమాన్ని ఆరంభిస్తూ అరవింద్ సినిమా కళను గురించి మాట్లాడేడు. తాను తీసిన సంస్కారణను

గురించి, తాను ఎలా వృద్ధిలోకి వచ్చిందీ వివరించాడు. ప్రజల్లో సదభిరుచుల్ని పెంచటానికి ఫిలింసొసైటీల ఆవశ్యకతను నొక్కి వక్కాణించాడు.

చర్చలో చాలా మంది పాల్గొన్నారు. అందరూ అరవింద్ తీసిన మసాలాహిట్ సినిమాలను మెచ్చుకొంటూ తమ అభిప్రాయాలను పొగడ్తలరూపంలో చెప్పేరు.

రాధిక వంతు వచ్చింది.

"రాధీ ! పోనీ నువ్వు మాట్లాడకపోతేనేం ? తీరా స్టేజీమీదకెళ్ళాక ఫంక్ తింటావేమో ! నాకు భయంగా వుంది" ప్రతాప్ అన్నాడు మెల్లగా.

రాధిక నిజానికి ఆక్షణంలో భయపడుతోంది. కానీ ప్రతాప్ ఆమాట అనగానే మొండి ధైర్యం వచ్చింది. ధైర్యంగా స్టేజీ మీదకెళ్ళింది.

కానీ జనాన్ని చూడగానే మళ్ళీభయం. నోరు తెరుపుడు పడలేదు ముందు. నోరు తెరిచేక కూడా ఆమె మాట్లాడింది ఎవరికీ విన్పడలేదు.

"మైక్ మైక్" జనం అరిచారు. మైక్ శృతి పెరిగింది. అందుకు నిదర్శనంగా శబ్దంకూడా వచ్చింది.

కానీ రాధిక గొంతు మాత్రం విన్పించలేదు.

"మైక్ మైక్"

"మైక్ బాగానేవుంది. మాట్లాడేవాళ్ళ గొంతే..." మైక్ యజమాని కాబోలు మరో మైక్‌లో పెద్దగా అరిచాడు.

"భయంలేదు. బిగ్గరగా మాట్లాడమ్మా" అరవింద్ మృదువుగా ధైర్యం చెప్తూ అన్నాడు.

రాధిక ప్రతాప్ వైపు చూచింది.

అతను ఆమెను దిగిరమ్మని సంజ్ఞ చేసేడు.

రాధికకు పట్టుదల పెరిగింది. ధైర్యం వచ్చింది మళ్ళీ.

గట్టిగా ఉపన్యాసం ఆరంభించింది. ముందు నిదానంగా ఆరంభమయిన ఆమె ఉపన్యాసం క్రమంగా వుత్సాహం కాస్తంత ఆవేశంతో మేళవింపబడి సాగింది. అంతవరకు ఎగతాళిగా అల్లరి చేసిన జనం నిశ్శబ్దంగా, ఉత్సాహంగా వినసాగేరు.

"ఇది ఫిలిం సొసైటీ నిర్వహిస్తున్న చర్చా కార్యక్రమం అని మనం మర్చిపోయినట్లున్నాం. అరవింద్‌గారు తీసిన మసాలా సినిమాలను పొగిడేం. ఆయన మంచి దర్శకులే. కానీ ఆయన తీసిన సినిమాలు 'సమాజ ఆరోగ్యానికి' ఎంతవరకు దోహదం చేసేయి అనేదే నా ప్రశ్న. ఆయన తీసిన సినిమాలు చాలా వరకు ప్రొడ్యూసర్లకు డబ్బు, ఆయినకు ఖ్యాతి తెచ్చిపెట్టి ఉండవచ్చు. కానీ ఆ బిజినెస్ ప్రాసెస్‌లో సమాజ ధోరణిని ఎంత పెడదారి పట్టించారోనని ఆయన ఒక్కసారి ఆలోచించారా? ఆయన్నే చిత్తశుద్ధితో నా ప్రశ్నకు సమాధానం ఇవ్వమనండి"

సభ్యులలో కలకలం రేగింది. అరవింద్ రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు-- చిరునవ్వు మొహానికి పులుముకొని !

"నా అభిప్రాయాన్ని మీ నెత్తిన రుద్దటానికి నేను ప్రయత్నించను. ఈ అభిప్రాయం కేవలం ఏదోమాట్లాడాలని చెప్తున్నదికాదు. ఆయన తీసిన సినిమాల్లో సమాజాన్ని అనారోగ్యపరచే అంశాలను కొన్నింటిని ఉదాహరణగా పేర్కొంటాను" అంటూ కొన్ని ధోరణులను పేర్కొంది.

"ఇది కేవలం వ్యాపార ధోరణి అవలంబించేవారు సమాజానికి చేస్తున్న హాని. ఇక ఆయన తీసిన 'సంస్కరణ' సినిమాను గురించి. అది 'వాస్తవిక జీవిత చిత్రీకరణ' అని దర్శకులు చెప్పేరు. మనలో కూడా చాలా మందికి ఆ అభిప్రాయం వుంది. కాని విధవ అయిన ఓ హరిజన యువతిని వివాహం చేసుకొనే అగ్రవర్ణ యువకులు ఎందరున్నారు ఈనాడు అన్నది నా ప్రశ్న. అలా చేసుకొని కష్టాల నెదుర్కొని నిలబడటమే కాకుండా ఆ ఊరు మొత్తాన్ని సంస్కరిస్తాడు అందులో హీరో. రామాయణ గాథలో రాముడు ఆదర్శ నాయకుడు. అలాగే ఈ సినిమాలో ఆ హీరో ఆదర్శ నాయకుడు అంటే నాకు అభ్యంతరం లేదు. కానీ ఆ సినిమాకు వాస్తవిక చిత్రణ అన్న ముసుగు ఎందుకు? ఇలాంటి నినాదాల ముసుగుల్ని తొలగించి సినిమాలను, వ్యక్తుల్ని, సంఘాన్ని ఆరోగ్యవంతంగా నడిపించే సినిమాలను ఆదర్శవంతంగా తీయాల్సిన అవసరం వుంది. అలాంటి ఆదర్శవంత మైన, ఆరోగ్యకరమైన సినిమాలకు తనే మైనా తీసేనా అని అరవింద్‌గారు కొత్త సినిమాను తీసేముందు ఒక్కసారి తనని తాను సింహావలోకనం చేసుకోవల్సిందిగా మనవి చేస్తున్నాను"

అరవింద్‌ను అనవసరంగా పొగిడిన వారు సైతం రాధిక ఉపన్యాసంలోని హేతువును అర్థం చేసుకొన్నారు. అరవింద్ స్వయంగా రాధికను స్టేజ్ మీద నుంచి పొగిడేడు. తనామెతో వివరంగా మాట్లాడి సలహాలు తీసుకోగలననీ, ఇలాంటి మార్గదర్శకత్వం చూపగల యువతీయువకుల అవసరం ఈనాడు ఎంతైనా వుందనీ అంటూ చర్చా కార్యక్రమాన్ని ముగించాడు.

ఆ తర్వాత విడిగా మాట్లాడినప్పుడు కూడా అరవింద్‌తో ఎలాంటి బిడియం, సంకోచంలేకుండా ఫ్రాంక్‌గా మాట్లాడింది.

"ఈనాటి నటీనటులని గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"హాలీవుడ్‌లో నటీనటులున్నారు.






తెలుగు చలన చిత్ర పరిశ్రమలో 'స్టార్స్' ఉన్నారు. వారు ఏది చేస్తే అది నటన కింద చెలామణి అవుతోంది. పిల్లి మొగ్గలు, గంగిరెద్దు ఆటలు నటన కిందకి వస్తుందని నేననుకోను. తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ఇవాళ మంచి నటులను పేర్కొనవల్సి వస్తే నేను కొందరు దర్శకులను, ఛాయాగ్రాహకులను మాత్రమే నటులుగా పేర్కొంటాను"

"అంటే...?"

"అంటే ఏమిటో, నేనంతకన్నా వివరించను సార్. ఆ అవసరం కూడా లేదనుకొంటాను"

"హాలీవుడ్ నటీనటుల్లో మీకు కన్పించిన ప్రత్యేకత ఏమిటి?"

"నటనలో వాస్తవికత. ఆ సినిమాలు కొన్ని ఫెంటాస్టిక్ నాన్సెన్స్‌గా వున్నా నటీనటుల నటన మాత్రం అత్యంత వాస్తవికంగా ఉంటుంది. అందుకు ఉదాహరణలు చూపమంటారా?"

"అక్కర్లేదు. కానీ నటించటానికి మీకు అవకాశం వచ్చిందనుకోండి. మీరెలా నటిస్తారు?"

"వాస్తవంగానే. అలా నటించలేక పోతే..."

"మీరు నటించలేరని నా ఉద్దేశం"

"ఏం? నటన మీరు తయారుచేసే పిండి బొమ్మల గుత్తాధిపత్యం అనుకొన్నారా? కీలు బొమ్మల..."

"అయితే మీకు నేను నా సినిమాలో హీరోయిన్ వేషం ఇస్తాను. నటిస్తారా?"

"ఎందుకు నటించను? కానీ నాకు కథ నచ్చాలి. నా పాత్ర నచ్చాలి"

అరవింద్ అప్పుడు పేల్చేడు ఓ పెద్ద బాంబు!

"అయితే నా తరువాతి పిక్చర్‌లో హీరోయిన్‌గా మిమ్మల్ని ఈ క్షణంలో బుక్‌చేసుకొంటున్నాను. నటిస్తారా?"

"ఓ యస్"

* * *

రాధిక, ప్రతాప్‌లకు అరవింద్ చెప్పిన కథ నచ్చింది.

"సినిమావాళ్ళు తయారుచేసే కథలకు కాళ్ళు, చేతులు ఎలాగూ ఉండవు కదా? నువ్వేం కంగారుపడకు. సినిమాలో నటిస్తానన్నావు కానీ, కథ నచ్చాలన్న కండిషన్‌కూడా పెట్టేవుగా? ఆ కథ మనకు నచ్చదు....నువ్వు సినిమాల్లో నటించవు"

రాధిక ఆ రోజు వేడిలో నటిస్తానంది కాని ఆ తర్వాత నాలిక కరచుకొంది. ఆలోచిస్తే అదంతా అరవింద్ ప్లాన్ వేసి తనని 'సినిమా ట్రాప్'లోకి దించినట్లు కూడా గ్రహించింది.

తనకి సినిమాల్లో నటించాలన్న ఉత్సాహం లేదు.తన తల్లికిలేదు. ప్రతాప్‌కి లేదు. ఆంటీకి ఇంకా చెప్పలేదు.

"కథ నచ్చిందనే ఆశిస్తున్నాను. ఈ టెస్టులో నేను నెగ్గేను కనుక నేను పెట్టే కెమేరా టెస్టులో మీరు నెగ్గాలి. అప్పుడు కాంట్రాక్టుమీద సంతకాలు"

రాధిక, ప్రతాప్‌లు ఇద్దరూ ఊపిరి పీల్చుకొన్నారు. అయితే నటించకుండా పోవటానికి ఇంకా అవకాశం ఉందన్న మాట!

"కెమేరా టెస్టులో నువ్వు తప్పక ఫెయిల్ అవుతావు. కంగారుపడకు"

మేకప్‌లు చేసేరు. ఫొటోలు తీసేరు. ఎన్నో.. లెక్కపెట్టలేదు. ప్రతాప్‌ను ఆ గదిలోకి ఆహ్వానించలేదు.

"ఈ మేకప్‌లు దేనికి? నన్ను నన్నుగా తీయరా?"

"మా కథ ఓ సినిమా నటి నిజ జీవితానికి సన్నిహితంగా ఉంటుందని చెప్పేనుగా? ఆ నటిలాగా మేకప్‌చేస్తే తయారవుతావో లేదో చూసుకోవద్దూ?"

రాధికకు ఆ నటి ఎవరో తెల్సుకోవాలనిపించింది. అద్దంలో చూసుకొందామనుకొంది. అద్దం ఏదీ?

"టెస్ట్‌కాగానే ఫొటోల కాపీలే ఇస్తాను.

అద్దంలో ఎందుకు చూసుకోటం?"

కెమేరా టెస్టులు అయిపోయాయి.

"ఫలితం రేపు ఉదయానికి ఫోనులో తెలియచేస్తాను. మీరు ఆ పాత్రకు సప్సు తారనే నా ఊహ. విష్ యూ గుడ్‌లక్!"

ఇంటికి వస్తుంటే దారిలో రాధిక దిగులుగా కూర్చుంది కారులో.

"ఎన్ని మేకప్‌లు చేస్తే మాత్రం నువ్వు ఎవరో నటిలా ఎలా తయారవుతావ్! ఈ టెస్టులో నీకు జీరో మార్కులొస్తాయ్. ష్యూర్"

మాట తప్పకుండా ఆ రొంపిలో నుంచి ఎలా బయటపడాలా అని ఆలోచిస్తున్నది రాధిక.

"ప్రతాప్! మాధురి ఆంటీకి ఇంత వరకు ఈ విషయం చెప్పలేదు. పోనీ ఆమెకు చెప్పి సలహా తీసుకొందామా?"

"ఆ ప్రపంచంలో ఉన్నవ్యక్తి. ఆమె సలహాకి చాలా విలువ ఉంది. కానీ సలహా అసలు ఇస్తుందా అని"

"మా ఆంటీ విషయం నీకు తెలీదులే. ఆమె నా శ్రేయోభిలాషి. నీకు పని ఉందన్నావుగా? నన్ను ఆంటీ ఇంటిదగ్గర డ్రాప్ చేసిపో"

కారు మాధురి ఇంటిముందు ఆగింది.

రాధిక మాధురి ఇంటికి ఎప్పుడూ రాలేదు. రాధికకు అలాంటి కోరిక ఏనాడూ కలగలేదు. మాధురి ఆహ్వానించనూ లేదు.

ఇవాళ మొదటిసారి ఆ ఇంట్లోకి ప్రవేశించబోతోంది. హఠాత్తుగా వెళ్ళి ఆమెను సర్‌ప్రయిజ్ చేస్తే?

"మీరెవరండీ ... ఎవరు కావాలి?" సర్వెంట్ మెయిడ్ అడిగింది.

"నా పేరు రాధిక. మా ఆంటీని చూడటానికి వచ్చాను. నన్ను గురించి నువ్వెప్పుడూ వినలేదా?"

పనిమనిషి ఆ ఇంటికి కొత్త. విన్నానంటే ఏం చిక్కో...వినలేదంటే ఏం చిక్కో?

"మిమ్మల్ని అమ్మగారు రమ్మన్నారా?"

"ఊ"

"అయితే కూర్చోండి. వెళ్ళి చెప్పివస్తాను"

"నువ్వు ఈ ఇంటికి కొత్తలాగుందే?"

ఆ డైలాగు పనిమనిషి మీద బాగా పనిచేసింది.

లోపలకి ప్రవేశం లభించింది

లోపలికి వెళ్ళిన రాధికకు మాధురి దర్శనం త్వరగానే లభ్యమయింది.

మాధురిని చూస్తూనే రాధిక ఆశ్చర్యంతో నోటమాటరాక నిలబడిపోయింది. మాధురి కూడా ముందు కంగారుపడ్డా తమాయించుకొంది

మాధురి పాతికేళ్ళ యువతిలా సహజ సౌందర్యంతో వుంది.!

"రాధీ రామ్మా...!అలా నిలబడిపోయావేం?"

"ఆంటీ... నువ్వు!"

"ఆశ్చర్యపోకమ్మా! నువ్వు చూస్తున్న ఆంటీ మేకప్ చేసుకొని వుంది. నువ్వు ఇప్పుడు సినిమా నటి ఇంట్లో ఉన్నావు. ఇక్కడ వాతావరణం అంతా కృత్రిమమే అని గుర్తుంచుకో"

రాధిక ఫిలిం సొసైటీలో తను మాట్లాడినదగ్గరనుంచి ఫొటోలు తీసిందాక అంతా పూసగుచ్చినట్లు చెప్పింది.

"నువ్వు ఆ సినిమాలో నటించవద్దు రాధీ!అసలు ఈ సినిమా గాలే నీకు తగలకూడదు. ఆ సినిమా కథలో హీరో

యిన్‌లా కాకూడదు నీ జీవితం. హాయిగా పెళ్ళిచేసుకొని సంసార జీవితాన్ని అను భవించాలి. నీకెందుకు... అరవింద్‌తో నే మాట్లాడుతాగా! నువ్వు వెళ్ళు. జరిగిన దంతా మర్చిపో"

"అసలింతకీ కథలో సినిమా హీరోయిన్ ఎవరో నీకు తెల్సా ఆంటీ?"

"తెల్సునమ్మా. నాకేకాదు చిత్ర సీమలో అందరికీ తెలుసు. ఎందుకంటే చిత్రసీమలో అందరికీ దాదాపు అలాంటి కథలు వుంటాయి కనుక! ఆ కథను మర్చిపో తల్లీ. నీ జీవితాన్ని గురించి ఆలోచించుకో"

"నేను మాట ఎలా తప్పను ఆంటీ"

"మాటలకు ఏమాత్రం విలువలేని పరిశ్రమమ్మా యిది! నీ నైతిక స్థాయిలో ఈ సమస్యను ఆలోచించకు. అరవింద్‌కు నీతి నియమాలు అసలు లేవు. అతని నైతిక స్థాయిలో ఆలోచించు. అతను నీ ఉద్రేకాన్ని తనకు అనుకూలంగా ఎలా తిప్పుకొన్నాడో గ్రహించలేవా?"

ఫోను మోగింది. రాధిక పక్కనే వుంది ఫోను.

మాధురి ఫోను ఎత్తింది.

"హలో..."

"హల్లో లతా...నోనో మిస్ మాధురీ లతా! అయామ్ యువర్ హజ్‌బెండ్ హియర్. పిక్చర్‌లో ఏక్ట్‌చేసే విషయంలో ఏం నిర్ణయించుకొన్నావ్?"

మాధురి రాధిక వైపు చూసింది. ఫోనులోనుంచి వచ్చే మాటలన్నీ రాధికకు విన్పిస్తున్నాయి. కానీ ఏం చెయ్యటం?

"నీ నిర్ణయం నువ్వు చెప్పలేవు. కానీ నా నిర్ణయం చెప్పనా? నీ రోల్‌కు నా పిక్చర్‌లో నీకు ఛాన్సు యివ్వటంలేదు. యూ ఆర్ టూ ఓల్డ్-ఓల్డ్ వైఫ్. కొత్త పిల్లను పట్టేను. స్వీట్ సిక్స్‌టీన్! అందుకే నీ కథకు కొత్త ముగింపుకోసం ఆలోచిస్తున్నాను-అఫ్‌కోర్స్ సినిమాలో అనుకో"

"మీతో చాలా విషయాలు మాట్లాడాలి. ఓసారి వెంటనే ఇక్కడికొస్తారా?"

"ఏమిటి కథ? కాంపతీసి పిక్చర్‌లో ఏక్ట్‌చేస్తానంటావా ఏమిటి? నో వేకెన్సీ! లేక...నా మీద గాలి మళ్ళిందా? ఊఁ!"

"మీరు వస్తున్నారా లేదా?" కరుగ్గా అడిగింది మాధురి.

"సారీ. బిజీ... వెరీ వెరీ బిజీ. కొత్త హీరోయిన్ దొరికిందిగా? ఊఁ..."

"మీరనుకుంటున్న హీరోయిన్ మీ పిక్చర్లో నటించదు. దట్సాల్"

ఫోను పెట్టేసింది కోపంగా.

సంభాషణంతా రాధిక మౌనంగా వింటోంది.

రాధికను చూసేక కాని మాధురికి తాను చేసిన తప్పేమిటో అర్థం కాలేదు. అర్థమయ్యాక సిగ్గు, భయం...

"నేను వెళ్ళొస్తాను ఆంటీ" ఏమీ వినసట్లు, తెలియనట్లు పరమ సహజంగా అంది రాధిక.

"మంచిది రాధికా! నీ సినిమా విషయం నేను చూసుకొంటాలే. నువ్వు ఆ విషయం పూర్తిగా మర్చిపో. నేను రేపు ఇంటికొచ్చి అన్ని విషయాలు మాట్లాడుతాగా! అన్నట్లు కారుందా లేక..."

"ఉంది ఆంటీ. థాంక్స్"

వాకిలిదాకా వెళ్ళి వీడ్కోలివ్వటానికి కూడా శక్తి లేనట్లు బెడ్ మీద కూలబడింది మాధురి!

* * *

రాధిక కాంపౌండ్‌వాల్ గేటు దాటి బయటికొచ్చింది.

ఆమె మనసంతా ఆందోళనగా ఉంది.

ఏంచేయాలో నిర్ణయించుకోలేక మనసు దోలాయమానంగా ఉంది.

ఖాళీగా పోతున్న టేక్సీని పిలుద్దామని 'టేక్సీ' అని అనబోయి మళ్ళీ మాను కొంది.

ఫోనులో మాటలే ఆమెకు విన్పిస్తు న్నాయి. ఫోనులో మాట్లాడిన వ్యక్తి ఎవరో ఆమె సులభంగానే పోల్చుకోగలి గింది.

ఫోనులో విన్పించిన మాటలతోపాటు తల్లి ఒకనాడు అన్నమాటలు స్టీరియో సౌండ్‌లో విన్పించసాగాయి.

ఆనాడు-

అరవింద్ ఆమెను, ప్రతాప్‌ను కూర్చో పెట్టి సినిమా కథ చెప్పేడు. ఇద్దరికీ ఆ కథ నచ్చింది.

పెళ్ళికోసం ఆరాటపడే ఓ వేశ్యా కుటుంబంలోని కన్య జీవితం -

వివాహమన్నది ఈనాడు కన్యలు అందరికీ సమస్యే!

అందునా ఆ కుటుంబాల స్త్రీలకు మరీ సమస్య.

ఇంటికొచ్చాక తల్లికి జరిగింది చెప్పింది.

"ఒద్దమ్మా! నువ్వు సినిమాల్లో నటిం చటం నాకు ఇష్టం లేదు. మనకసలు అంత అవసరమేమిటి? సినిమాల్లో నటీ మణుల జీవితాలు కర్పూరపు ముద్ద ల్లాంటివమ్మా.. కొవ్వొత్తుల్లాంటివి. నువ్వు గృహిణివి కావాలి"

"నాకూ ఇష్టం లేదమ్మా! కానీ మాట అన్నాను కదా? కథ నచ్చదేమో అను కొన్నాం. కానీ కథ మంచిది. ఇక తప్పించుకోటం ఎలా?" అంటూ కథను కూడా చెప్పింది.

"ఈ కథ నీకు నచ్చిందామ్మా? స్త్రీ జాతికి పనికివచ్చే అంశం. వారిని ...ళితం చేసి కార్యోన్ముఖుల్ని చేసే అంశం ఉంది ఆ కథలో? పైగా ఆ కథ వాస్తవ జీవితం ఆధారంగానని ప్రచా రమా? అది సత్యం కాదు తల్లీ.. అసం పూర్ణ వాస్తవం అది. వాస్తవంగా జరిగిన కథకు, నీకు చెప్పిన కథకు చాలా వ్యత్యాసం ఉంది. ఎందుకంటే ముఖ్య మైన సంఘటనలు నీ కథలో లేవు"

"అంటే...ఆ కథ ఏమిటో నీకు తెల్సా?"

"తెల్సునమ్మా! కాని చెప్పమని అడక్కు. చెప్పను. ఎందుకంటే నువ్వు తెల్సుకోవాల్సిన అవసరం లేదుకనుక"

రాధిక రోడ్డు దాటి అవతలకి వెళ్ళింది. కాస్తంత దూరంలో ఉన్న ఓ కొట్లోకి ప్రవేశించింది. కానీ ఆమె దృష్టి అంతా మాధురి కాంపౌండ్ గేట్‌మీదే ఉంది.

"ఎక్స్‌క్యూజ్ మీ! షల్ ఐ యూజ్ యువర్ ఫోన్!"

షాపులో హిప్పీ అవతారంతో ఓ యువకుడు వున్నాడు. వాడు రాధిక మాధురి ఇంట్లోనుంచి రావటం చూసాడు.

రాధికను తినేట్లు చూస్తూ "చేయండి. కానీ ఏవూరు మనది? సినిమాల్లో చేర టానికి వచ్చారా? నాకు తెల్సిన ప్రొడ్యూ సర్..."

ఆ యువకుడు ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు. అతని మాటలు రాధికకు విన్పించటం లేదు. నెంబర్ డయల్ చేసింది.

"హలో..ప్రతాప్"

"ప్రతాప్ ఇంట్లో లేదమ్మా! ఎవరూ.. రాధికా?"

"అవును ఆంటీ! షాప్‌కి వెళ్లాడా?"

"తెలీదమ్మా! ఏం పనా?"

"అర్జంటు పని. ఇంటికొస్తే, మాధురి అనే సినిమాతార ఉందే...ఆమె ఇంటి వద్దకి రమ్మన్నానని చెప్పండి. నేను అక్కడే వున్నాను"

షాపుకు ఫోను చేసే అక్కడ ప్రతాప్ లేడు. అంకుల్‌తో కూడా అవే మాటలు చెప్పింది.

ఇంటికి ఫోను చేసింది. తల్లి రిసీవ్ చేసుకుంది.

"మమ్మీ! అప్పుడు చెప్పిన కథ అసంపూర్ణమని అన్నావు కదూ? పూర్తి కథ ఇవాళ తెల్సుకోబోతున్నాను"

సరిగ్గా అప్పుడే ఓ కారు మాధురి కాంపౌండులోకి దూసుకుపోవటం చూసిందామె.

"హల్లో ... రాధీ! ఎక్కడనుంచి మాట్లాడుతున్నావ్? కథేమిటి? నువ్వు ముందు ఇంటికి రామ్మా" ఫోనులో తల్లి ఆత్రంగా అంటోంది. కానీ రాధిక తల్లికి జవాబివ్వకుండానే అర్ధాంతరంగా ఫోను పెట్టేసింది.

"వాట్ మేడమ్! మీరేదో కంగారులో ఉన్నట్లున్నారు! షల్ ఐ హెల్ప్ యూ!"

"థేంక్యూ" అంటూ రూపాయనోట్లు ఆ యువకుడి ముందున్న కౌంటర్ పైన ఉంచింది.

"జస్ట్ ఎ వర్డ్ మేడమ్! సారీ. వన్ వర్డ్ విని వెళ్ళండి మిస్. నాకు తెల్సిన నలుగురయిదుగురు ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు ఉన్నారు. ఐ విల్ హెల్ప్ యూ. ఫ్రీ సర్వీస్..."

ఆమె మళ్లీ మాధురి బంగళాలోకి ప్రవేశించింది.

వరండాలోకి ప్రవేశిస్తుండగా ఓ గది లోంచి పనిమనిషి రావటం గమనించి తలుపు వెనక దాక్కొంది.

పనిమనిషి గేటు తెర్చుకొని వెళ్లింది. ఆమెచేతిలో పదిరూపాయలనోట్లున్నాయి.

ఆమె నేరుగా మాధురి బెడ్‌రూమ్‌వద్ద కెళ్లింది. మెల్లగా తలుపునెట్టింది. ఉలిక్కిపడింది. అందుకు కారణం లోపలి నుంచి హఠాత్తుగా విన్పించిన సంగీతం! సుబ్బలక్ష్మి పాడిన అన్నమాచార్య కీర్తన!

గదిలో ఎవరూ లేరు. కాని బెడ్ పక్కన టీపాయ్ మీద 'టూ యిన్ వన్' రికార్డరు వుంది.

టేప్‌ను ఆఫ్‌చేసింది. చుట్టూ చూసింది.

ఇంతలో ఎక్కడో మాటల శబ్దాలు విన్పించాయి.

టీపాయ్ మీద నాలుగైదు కాసెట్‌లు వున్నాయి. అందులో ఒకటి రికార్డు చేయనిది.

టేప్ రికార్డరులో వున్న కాసెట్‌ను బయటకితీసి కొత్త కాసెట్‌ను లోపల పెట్టి రికార్డు స్విచ్‌ని నొక్కింది.

బయటికి రాబోతుంటే మాటలు దగ్గరయ్యాయి.

మాధురి గొంతు దీనంగా విన్పిస్తోంది.

వాళ్లు వస్తున్నారు.

ఆమెకు ఏం చెయ్యటానికి తోచలేదు.

బయటకు వెళ్లే మార్గంలేదు.

ఆమె అటూయిటూ చూసి షీల్డులు అవీ పెట్టివున్న బీరువావెనక దాక్కొంది!

"అరవింద్! రాధిక జోలికెళ్ళకు. ఆ అమ్మాయిని ఈ మురికి కూపంలోకి లాగకు. ప్లీజ్...ప్లీజ్...!"

అరవింద్ నవ్వుతూ బెడ్ మధ్యగా కూర్చున్నాడు. చేతిలో విస్కీ సీసాను టీపాయ్ మీద పెద్దశబ్దంతో పెట్టేడు.

"ఆ మాటను అరిగిపోయిన రికార్డులా

చాలా సేపటి నుంచి చెబుతూనే వున్నావు. కానీ అసలు ఆ పిల్లకు, నీకు ఏమిటి సంబంధం? ఆ ప్రశ్నకు ముందు సమాధానం చెప్పు"

కాస్సేపు నిశ్శబ్దం!

"ఆమె నా స్నేహితురాలి కూతురు"

అరవింద్ బిగ్గరగా నవ్వేడు.

"ఇంత పెద్ద సినిమా నటివయ్యావ్! కానీ ఏం లాభం? ఒక్క అబద్ధాన్ని అతికినట్లు అందంగా చెప్పలేకపోయావ్! ఈ ఫొటోలు చూడు. మేకప్ చేస్తే చిన్నప్పుడు నువ్వున్నట్లే వుంది రాధిక! ఈ ఫొటోను చూడు. మొదటిసారి నేను నిన్ను చూసినపుడు నువ్వెట్లా వున్నావో అలాగేవుందికదూ? అందుకే నాలో అనాటి అనుభవాలు కోర్కెల రూపంలో ప్రవహిస్తున్నాయ్! మొన్న నువ్వు ముసలి మేకప్ వేసుకొన్నావ్. రాధికకు ముసలి మేకప్ చేయించి ఈ ఫొటో నేను తీయించాను. మేకప్ చేసుకొన్న నీకు, ఈ ఫొటోలో రాధికకు భేదం కనిపెట్టగలవా? ఊహూ! ఈ బొమ్మలు చూసినవాళ్లెవరూ రాధికని అనుకోరు. నీవేననుకొంటారు. ఆ పిల్లను మొదటిసారి చూసినప్పుడే ఆమె మొహంలో రహస్యంగా దాగివున్న నీ 'కట్స్'ను నేను స్పాట్ అవుట్ చేసేను. అందుకే ఆ పిల్లను ట్రాప్‌చేసి పట్టేను. కానీ ఆ అమ్మాయి నీ స్నేహితురాలి కూతురని తెలీదులే! కాని మహానటిగా పేరుతెచ్చుకొన్న నీ రూపంలో మరోనటి! ఎంతపబ్లిసిటీ వేల్యూనో తెల్సా? బిజినెస్‌కు బిజినెస్సు — కొత్త అనుభవానికి కొత్త అనుభవం! చేతుల్లోకి వచ్చిన అదృష్టాన్ని జారవిడుచుకోటానికి నేనేం వెర్రివాడినా? గాంధీగారిలాగా మహాత్ముడినా? ఆఫ్టరాల్ ఓ మనిషిని. నిన్నింత నటిని చేసేను. ఎన్నెన్నో సుఖాల నిచ్చాను. పైగా తాళికట్టని పతిదేముణ్ని నీకు. ఇలాంటి కోరిక కోరటం పతివ్రత లక్షణం కాదు కానీ ... త్వరగా వెళ్లి ఫ్రిజ్‌లో ఐస్ వాటర్, ఓ బాటిల్ పట్టుకురా! నాకు బోల్డంత ఆనందంగా వుందీ క్షణంలో"

"ఆఖరి కోరికగా నిన్ను అభ్యర్థిస్తున్నాను. రాధిక..."

"ఊఁ" అతను అయిష్టంగా మూలిగాడు.

"నాకు ఆ పేరు గుర్తు చెయ్యకు. మృగంలేస్తుంది. నీ అభ్యర్థనలు ఇప్పుడు విసను. ముందు మందు... ఆ తర్వాత నీ పొందు. ఆ పిదపే అభ్యర్థనలు...ప్రార్థనలు...... కోరికలు... ఎట్‌సెట్రా... ఎట్‌సెట్రా...ఊఁ...వెళ్ళు"

ఆమె కదిలింది అయిష్టంగానే... గత్యంతరం లేనట్లే!

అరవింద్ విస్కీబాటిల్ అందుకొన్నాడు. పళ్లమధ్యన కార్క్ పెట్టి వూడదీసేడు.

దాన్ని బల్లమీద పెట్టి అల్లంత దూరంలో వున్న గ్లాసులని చూసాడు. లేచివెళ్ళి రెండు గ్లాసుల్ని తీసుకొచ్చి టీపాయ్ మీద పెట్టబోతూండగా...

అతని దృష్టి టూయిన్‌వన్ పైన బడింది!

ఇదంతా బీరువా వెనుక నుండి గమనిస్తున్న రాధిక గుండె గుభేలుమంది!

అరవింద్ టూయిన్‌వన్‌ని చేతిలోకి కాజువల్‌గా తీసుకొని మంచం పక్కన పెట్టేడు.

రాధికకు టెన్షన్ పెరిగి అంతలోనే తగ్గింది. 'హమ్మయ్య' అన్నట్లు అనుకో



కుండానే నిట్టూర్చింది!

అరవింద్ విస్కీ బాటిల్ తీసుకొని అలాగే ఓ గుక్క 'రా' తాగేడు.

"అబ్బ!" అంటూ గొంతు సవరించుకొన్నాడు. "మాధురీ! ఐస్ వాటర్ క్విక్" అంటూ అతను సీసా పట్టుకొనే అయస్తూ రూమ్ బయటికి వెళ్ళేడు.

'అతను వాకిట్లోకి ఎందుకు వెళ్లేడు? నిజంగా ఐస్‌వాటర్ కోసమేనా! లేక అతనికి ఎవరో ఆ గదిలో వున్నారని అనుమానం వేసిందా?' అలాంటి ఆలోచన రాధికకు వచ్చింది. కానీ ఆలోచించే వ్యవధి లేదు.

రూమ్ బయట పడాలి.

ఇంకా స్వల్పట్లో ఆ గదిలో మూడో వ్యక్తి చూడకూడని విషయాలు జరుగబోతున్నాయి!

ఆమె బీరువా వెనుక నుంచి బయట కొచ్చింది.

రికార్డయిన టేప్‌ను తీసికెళ్ళాలా? అక్కడే ఉంచాలా?

క్షణంలో సగం సేపు ఆలోచించి టేప్ తీసింది. మరో టేప్‌ను లోపల పెట్టి రికార్డు స్విచ్ నొక్కింది.

రికార్డయిన టేప్‌ను హాండ్‌బాగ్‌లో వేసుకొని చకచకా బయటికి వస్తుండగా రూమ్ డోర్ పుష్ చేసుకొని అరవింద్ వచ్చాడు.

"హల్లో మేడమ్! మీరు... ఇక్కడ.. ఎంత సేపయింది వచ్చి?"

"ఇప్పుడే. మాధురీదేవి మా ఆంటీ... ఆ...!"

"ఊఁ! ఎప్పుడూ చెప్పేరుకాదే? గుడ్! నేను ఇక్కడ పని చూసుకొని మీ ఇంటికి వద్దామనుకొంటున్నా. అన్నట్లు—అయామ్ హేపీ టు యిన్‌ఫామ్ యూ...మీరు మా కెమేరా టెస్ట్‌లో ఫస్టుక్లాస్‌లో ఉత్తీర్ణులయ్యారు. యూ ఆర్ మై హీరోయిన్ నౌ. అదే మా పిక్చర్లో హీరోయిన్ మీరిప్పుడు. అవిగో మీ ఫోటోలు.... కూర్చోండి చూపిస్తా"

"థాంక్యూ సర్! కానీ నేను అర్జంటుగా మా ఆంటీతో మాట్లాడాలి. ఫోటోలు తర్వాత చూస్తాను"

"ఓ యస్. అలాగే! కానీ మేము సినిమా వాళ్ళం. లక్షలతో బిజినెస్ చేసేవాళ్ళం. కొన్ని పిచ్చి సెంటిమెంట్లు వుంటాయ్. అర్థం లేనివే అనుకోండి. కానీ సెంటిమెంట్లలో అర్థం వెతకటమెందుకు? అలాంటి సెంటిమెంట్ నాకొకటి వుంది. అదేమిటంటే హీరోయిన్‌ను మనసులో సెలెక్ట్ చేసుకోగానే, ఫస్ట్ మీటింగ్‌లో కాంట్రాక్టుమీద సంతకం పెట్టించుకోటం, అడ్వాన్సుగా కొంత డబ్బివ్వటం! ఆ పద్ధతి నాకు అచ్చివచ్చింది. అందుకని



సెంటిమెంట్. మిమ్మల్ని మనసులో సెలెక్ట్ చేసుకొన్నాక మీతో ఫస్ట్ మీటింగ్ ఇది. కనుక ఇదిగో అడ్వాన్సుగా కొంత డబ్బు. కాంట్రాక్టు మీద సంతకం పెట్టి తీరిక చేసుకొంటారా? ప్లీజ్. కాంట్రాక్టు ఫారమ్ తయారు చేయించే తెచ్చాను. అసలు మీ ఇంటికి వస్తూ మధ్యలో మాధురీ దేవిగారితో ఓ మాట మాట్లాడిపోదామని వచ్చాను"

"అలాగే పెడ్తానుసార్. కానీ ముందు మా ఆంటీ..."

అరవింద్ డోర్ వేసేడు. లాక్ చేసేడు.

"అదేమిటి? తలుపు వేసారెందుకు?"

"ఎయిర్ కండిషన్డ్ రూమ్ కదూ? తలుపు వేసేనే బాగుంటుంది. సంతకం పెట్టండి. పాపం త్వరగా వెళ్ళాలేమో!"

"నేను మా అమ్మను కన్సల్ట్ చేసి కాని సంతకం పెట్టను"

"అలాగే కన్సల్ట్ చేయండి. అదుగో ఫోన్"

"ఫోనులో కాదు. మీరు ఓ గంట తర్వాత మా ఇంటికి రండి"

"అలాగే. ఇద్దరం కల్సే వెళ్దాం ఇక్కడ 'పని' ముగించుకొని"

"'పని' ఏమిటి? నాకసలు మీ సినిమా లోనే కాదు-సినిమాల్లో నటించడమే ఇష్టంలేదు. మా ఆంటీకి ఆ విషయం చెప్పేను. ఆమెను కన్సల్ట్ చేయవచ్చు మీరు"

"ఊ...అప్పుడే ప్రముఖ హీరోయిన్ అయినట్లే మాట్లాడుతున్నావే? నీకిష్టంలేక పోయినా నువ్వు నా పిక్చర్లో నటించి తీరాలి. ఎందుకంటే ఇప్పటికే మీ అంగీ కారాన్ని ఆధారంగా తీసుకొని మీ మీద చాలా ఖర్చుపెట్టాం. పబ్లిసిటీ కూడా ఇచ్చాం"

"బెదిరిస్తున్నారా?"

"ప్రోత్సాహపడమన్నా పడ్తాను. నా కభ్యంతరంలేదు. ఇది సినిమాలోకంతల్లీ! లక్షలతో బిజినెస్సు. మాటకు కట్టుబడక పోతే లక్షలు నష్టం. ఇది కాలేజీ కాదు గదా!"

"అయితే ఆ కాగితం ఇవ్వండి సంతకం పెడ్తాను"

"యూ ఆర్ ఎ గుడ్ గర్ల్!"

అతను కాగితం ఇచ్చాడు.

డోర్ తట్టున్న చప్పుడు...

రాధిక కాంట్రాక్టు మీద సంతకం చేసింది. ఆ కాగితాన్ని చూసుకొని మడిచి జేబులో పెట్టుకొన్నాడు అరవింద్!

"తలుపు తియ్యండి. నేను త్వరగా వెళ్ళాలి"

"నువ్వెళ్ళటం ఎందుకు? మాధురే వస్తుందిగా మాట్లాడవచ్చు"

అరవింద్ డోరు వైపు కాకుండా బెడ్ వైపు నడిచాడు.

రెండు గ్లాసుల్లో కాస్తంత విస్కీ పోసేడు.

"ఊ....లెటజ్ సెలబ్రేట్-ది హేపీ అకేషన్ విత్ ఎ సిప్"

"మిస్టర్ అరవింద్!"

"అండ్ లాటర్-ఎ కిస్" అతను ఆ మాట అనే ముందే టేప్ రికార్డర్‌ను పైకెత్తి పీకనొక్కేసేడు. ఆ మాట అని లోపల నుంచి కాసెట్ తీసేడు.

"ఇంతకు ముందు రికార్డయిన కాసెట్ కూడా ఇస్తే- ఈ పూట రెండు సీన్స్ రికార్డింగ్ పూర్తి అయినట్లవుతుంది" అర వింద్ మెల్లగా నవ్వుతూ అన్నాడు.

అంటూ టెలిఫోన్ వైర్స్ డిస్‌కనెక్ట్ చేసేడు!

"అసలు మీ ఉద్దేశం ఏమిటి?"

"ఆ డైలాగు నాది... నేనడగాల్సిన ప్రశ్న. సమాధానం నువ్వుచెప్పాలి"

డోర్ మీద శబ్దం పెద్దదయ్యింది.

"నన్ను వెళ్ళనిస్తారా లేదా?"

"వెళ్తే తిరిగి రావన్న భయంలేకుండా చేసుకొని నిన్ను క్షేమంగా మీ ఇంట్లో దిగబెడ్తాను"

"అంటే... ?"

"నాసినిమాలో హీరోయిన్‌గా సంతకం చేసేవు. నేను నీ జీవితంలో హీరోగా ఎంట రవుతాను. అంతే...అది నాకు రక్షణ. నీకు రక్షణ. మన సినీజీవితానికి రక్షణ"

"యూ..." ఆమె కోపంగా రెండు చేతులూ ఎత్తింది. ఎత్తిన ఆ రెండు చేతుల్ని గట్టిగా పట్టుకొన్నాడతను.

"నేను గొడవ చేసుకోవాలనుకోలేదు. ఇప్పుడూ అనుకోవడం లేదు. నేను నిన్ను కామించలేదు. కానీ నువ్వే అనవసరంగా రాంగ్ ఎంట్రెన్స్‌చేసి గొడవచేసుకొంటు న్నావు. నిదానంగా ఆలోచించు. ఇప్పుడు నా రహస్యాలు చాలా వరకు నీ దగ్గర వున్నాయి. ఇలాగే నిన్నొదిలితే నువ్వు ఊరుకొంటావా? దేశమంతా ప్రచారం చేస్తావు. అలాంటి శక్తి నీకు లేకుండా నేను చేయాలికదా...! అందుకు మార్గం ఆలో చించుకోవాలికదా! ఏమంటావ్? ఊ..రా. తీసికో ఈగ్లాసు..." అతను గ్లాసు తీసు కొని తాగుతూ అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. మెల్లగా టీపాయ్ వద్దకు వెళ్ళి గ్లాసుతీసుకొంది. ఆ గ్లాసును గురిచూసి అద్దాల కిటికీకి వేసి కొట్టింది. పెద్ద చప్పుడు చేస్తూ విండో పేన్ పగి లింది.

ఈలోగా ఆమె సీసాను చేతిలోకి తీసు కొంది.

"దుర్మార్గానికి జడిస్తే అధర్మం జయి స్తుంది. నేను మాధురిలా భయస్తురాలిని కాను. పద. తలుపుతియ్"

"అమ్మా... రాధీ! ఏంటమ్మా ఈ గొడవ? నువ్వెప్పుడొచ్చావ్"మాధురి గ్లాస్ పగలటంవల్ల ఏర్పడ్డ రంధ్రంలో నుంచి చూస్తూ ఆత్రుతగా అంది. అంటూనే ఆ గ్లాస్‌ను అవతల వైపునుంచి మరికొంచెం పగలగొట్టింది. అలా ఏర్పడ్డ ఖాళీలో నుంచి చెయ్యి లోపలకి పెట్టి కిటికీ డోర్ బోల్ట్ తీసే ప్రయత్నం చేస్తోంది. కానీ కిటికీ తెరుచుకోలేదు.

"ఆంటీ! కిటికీ తెరిచే ప్రయత్నంచేయకు. అతను డోర్ తెరిచేలా నేను చేస్తాను. డోర్ తెరిచేక నిన్నేంచేయకుండా జాగ్రత్త పడు. వీడు పాము. అవసరమైతే కొట్ట టానికి ఏదన్నా ఆయుధం సంపాదించు కొని సిద్ధంగా ఉండు"

అరవింద్ మెల్లగా డోర్ దగ్గరికి చేరుకొన్నాడు. అతడినే చూస్తూ చేయెత్తి సీసాను పట్టుకొని రాధిక అతనికి బారెడు దూరంలో ఉంది.

కిటికీ తలుపు తెరుచుకొన్నట్లు శబ్దం అయింది. వేడీ, వెలుగూ లోపలికి ప్రవే శించాయి.

అయితే అదే సమయంలో "అమ్మా" అంటూ బాధగా అరిచింది మాధురి.

"ఏమయింది ఆంటీ?" రాధిక ఆత్రు తగా వెనక్కి తిరిగింది— అసంకల్పితం గానే.

అదే ఆమె చేసిన పొరపాటు!

నిజానికి మాధురికి ఏమీ కాలేదు. బోల్ట్ వూడిరాగానే ఆ ఊపుకి ఆమె చెయ్యి పగిలిన అద్దం పెంకుకి గీచు కొంది. ఆ బాధకు అనుకోకుండా

'అమ్మా' అని అంది. కిటికీ తెర్చుకొన్న ఊపుకి స్లిప్ అయి అటు పక్క కింద పడింది. అంతే. అంతలోనే ఆమె లేచింది.

కిటికీలోనుంచి లోపలికి చూసింది.

లోపలి ఆ దృశ్యం...

రాధిక వెనక్కి తిరిగీ తిరగ్గానే అరవింద్ వెనకనుంచి ఆమె చేతిలోని సీసా లాగేసుకొన్నాడు. దానిని కింద పారేసి ఆమెను వెనకనుంచి వొడిసి పట్టుకొన్నాడు.క తెరపట్టువేసి ఆమె చేతుల్ని, చూపుల్ని, నోటినీ అచేతనం చేసేడు.

ఆ పొజిషన్‌లోనే ఆమెను బెడ్ దగ్గరికి నడిపించుకొని-కాదు నెట్టుకొంటూ తీసుకువెళుతున్నాడు

"అరవింద్! రాధికను వొదులు. ప్లీజ్. లేకపోతే పోలీసుల్ని పిలుస్తాను"

"పోలీసుల్ని పిలుస్తావా? నువ్వాపని చేస్తావని నాకు తెల్సు. అందుకనే నీ ఇంటి సింహద్వారం తలుపులు తాళం వేసేను. నీ సర్వెంట్‌ను ఇంట్లో లేకుండా చేసేను. ఫోన్ డిస్‌కనెక్ట్ చేసేను. ఇది ఏ పిల్లిపిల్లకు పుట్టిందో కాని పులిపిల్లలా గాండ్రిస్తోంది. నాలో మృగాన్ని రెచ్చగొట్టింది. దీనికోరలుపీకేస్తేకానీనాకు,దానికి కూడా భద్రత లేదు. చూడు-దీని పొగరెలా అణుస్తానో!"

అతనామెను బోర్లాగా బెడ్‌మీదికి నెట్టేడు.

రాధిక గింజుకొంది. పెద్దగా మూలుగుతూ అరిచింది.

"అరవింద్! నీకు పుణ్యముంటుంది. దానినేం అఘాయిత్యం చేయకు. రాధిక...రాధిక మన కూతురు" దీనంగా అంది మాధురి.

అరవింద్ ఉలిక్కిపడలేదు. రాధిక పైన పట్టు సడలించలేదు. పైగా నవ్వేడు.

"నువ్వా డైలాగును అంటావనే అనుకొంటున్నాను మాధురీ! ఇది నీకూతురు కానీ నా కూతురుకాదు. ఎవరిద్వారా దీన్ని కడుపులోకి తెచ్చుకొన్నావో, దాని తండ్రి ఎవరో గుర్తుతెచ్చుకో. పాపం రేపు అది 'నా తండ్రి ఎవరు మమ్మీ?' అంటే ఏం చెప్తావు? అశోక్‌కుమార్...శ్రీధరన్ ఇంకా అడ్రస్ తెలియని వ్యక్తులు... ఊ: ఎందరో?"

హఠాత్తుగా మాధురీలత కళ్లముందు నల్లటి తెరపడింది.




అవును... అవును! రాధిక తండ్రి ఎవరు?

నల్లటి తెరమీద భూతప్రేత పిశాచాల్లా తెల్లటిబొమ్మలు...

తన సినిమా భవిష్యత్తు కోసం అశోక్‌కుమార్‌కు తన శీలాన్ని లంచంగా అరవింద్ అర్పించినరోజు...

"అశోక్‌కుమార్! నువ్వే గెలిచేవని అంగీకరిస్తున్నాను. ఎలాగయినా మగవాడివి-అందునా ధనవంతుడివి. కానీ నేనడిగే ఒక్క ప్రశ్నకు నిజమైన సమాధానం చెప్పు. అందువల్ల నువ్వుగాని, నేనుగాని నష్టపోయేదేమీ ఉండదు. ఎందుకంటే నీకు లొంగిపోవటానికి వచ్చినదాన్ని గదా నేను" అందానాడు తను.

"అడుగు నిజం చెప్తాను. ఎందుకంటే అదృష్టం బాగుంటే మనిద్దరం ఒకే వృత్తిలోకి దిగబోతున్నాం. ముందు ముందు పరస్పర సహకారాలు అవసరం కదా?"

"ఆ రోజు...ఆ మధ్యాహ్నం...నా గదిలోకి వచ్చావే...అప్పుడు నన్నేం చేసేవ్?"

"నిన్ను జడిపించి ఆడుకొన్నాను. ఇలా ఇక నీ జీవితంతో ఆడుకొంటానని సాంపిల్ చూపించాను. అంతేగాని నిన్నేం చేయలేదు. ఎందుకంటే- స్పృహ తప్పిన వాళ్ళు శవాలతో సమానమని నా ఉద్దేశం. నేను మనుషులతో ఆడుకొంటాను. శవాలతో కాదు. అది నా అహంకార ప్రవృత్తికే విరుద్ధం"

"మరి -ఆ రక్తం...?"

"ఆ రక్తం...సిగరెట్టు పీకెలు... తలుపు వేసి మాయం కావటం... అన్నీ నిన్ను జడిపించే ఆటలో భాగాలే! నన్ను నమ్ము"

అశోక్‌కుమార్ బొమ్మ ఫేడ్‌అయింది.

'ఆకాశదీపాలు' శతదినోత్సవ వేడుక...

హైదరాబాద్‌కు పట్టుబట్టి లాక్కు వెళ్లాడు అరవింద్.

కరుణ, శ్రీధరన్‌లు వచ్చారు. ఫంక్షన్ అయ్యాక తమ ఇంటికి డిన్నర్‌కు ఆహ్వానించారు.

డిన్నర్ అయ్యాక అరవింద్ కరుణ రూమ్‌లోకి వెళ్లేడు-ఏకాంత సంభాషణ!

తను శ్రీధరన్ గదిలోకి వెళ్ళింది.

"మిస్టర్ శ్రీధరన్! మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలని వచ్చాను. నిజం చెప్తారుగా?" అంటూ తన అనుమానాన్ని చెప్పింది.

శ్రీధరన్ భారంగా నిట్టూర్చాడు!

"కరుణ నా ఎదుట పదిమంది మగాళ్ళతో తిరగటం ఫేషననుకొంటున్నది. నేనూ ఆ పని చేస్తే? ఆమె తన తప్పు తెలుసుకోవచ్చుగా! నేను తనని రక్షించుకోటానికిఆరాటపడుతున్నట్లేనన్ను పరాయి స్త్రీల నుండి రక్షించుకోవడానికిఆరాటపడ వచ్చుగా?అందుకే కావాలని కరుణ చూసే విధంగా ఆ రాత్రి మీ గదిలోకి వచ్చాను. కానీ మీ శీలాన్ని, పాతివ్రత్యాన్ని దొంగతనంగా హరించాలన్న ఉద్దేశ్యంతో మాత్రం కాదు. నా భార్యను సంస్కరించుకోటానికి.అయాం ఏ ఫూలిష్‌లవర్. కాని మీ పట్ల మనసా వాచా కర్మణ్యా నేనెప్పుడూ కామవాంఛ చూపలేదు. ఆల్వేస్ ఐ ట్రీటెడ్ యూ యాజ్ మై సిస్టర్ లతా...నిజం. నన్ను నమ్ము"

ఆ దృశ్యం ఫేడ్ అయింది.

మరో దృశ్యం...

సినిమా షూటింగు జరుగుతోంది.

ఇద్దరు జూనియర్ ఆర్టిస్టలతో తన సీన్...

అసిస్టెంట్ డైరక్టర్ అల్లంత దూరంలో జూనియర్ ఆర్టిస్టులకు ఏమో చెప్తున్నాడు. .

అందులో ఒకామె తననే చూస్తుండటం గమనించింది మాధురి.

మాధురి తన వైపే చూడటం గమనించి ఆమె నమస్కరించింది. చనువుగా దగ్గరి కొచ్చింది.

"నేను గుర్తున్నానామ్మా? సుగుణమణిని"

సుగుణమణి...సుగుణమణి.

ఆ పల్లెటూరికి శ్రీహర్షకోసం తను వెళ్ళటం-అతని తండ్రి ... ఆ...

షూటింగ్ తర్వాత సుగుణమణిని తన ఇంటికి తీసుకెళ్ళింది.

"నేనా రోజు జరిగిందంతా మొదటి నుంచి చూస్తూనే వున్నా గా? శ్రీహర్ష తండ్రి గారు మిమ్మల్నేం చేయలేదండీ! చేస్తే నేనూరుకొంటానా? అసలాయనగారు చాలా మంచివారండీ. అర్ధాంతరంగా గుండె ఆగి చచ్చిపోబట్టిగాని లేకపోతే నా గతి ఇలా పట్టేదా?" సుగుణమణి ముక్కు చీదింది. కళ్లు తుడుచుకొంది.

"అయితే అలా ఎందుకు ప్రవర్తిం చాడంటావ్?"

మిమ్మల్ని బెదరగొట్టటానికండీ. నాకంతా ముందే చెప్పేరు. లేకపోతే మీరు శ్రీహర్షగారిని పెళ్ళి చేసుకోమంటారని, యాగీ చేస్తారని భయపడ్డారు. అతడిని మిమ్మల్ని విడదీయటానికి ఆ నాటకం ఆడేరు. అసలదంతా ఆయన పుర్రెలో పుట్టిన బుద్ధి కాదండీ! ఆయన మంచివారు. ఆ ఇంట్లో ఆడవాళ్ళపని. వాళ్ళవి ఒట్టి వెధవ బుద్ధులండీ. నన్ను దిక్కులేని దాన్నిచేసి వెళ్ళగొట్టేరు. చూస్తున్నారుగా నా స్థితి. అమ్మగారూ... మీరు పైకొచ్చారు. నాకో మంచి వేషం ఇప్పించరూ?"

ఆ సీన్ డిసాల్వ్ అయింది.

తెరమారింది. నల్లటి తెర తెల్లగా మారింది.

దాని పైన టెక్నికలర్‌లో శ్రీహర్ష బొమ్మ!

శ్రీహర్ష...!

శ్రీహర్ష అలాంటి పని చేస్తాడా?

ఆరోజు వర్షం రాత్రి... అతడిని చివరి సారిగా కలుసుకొన్న రాత్రి... ఆ సంఘటన...

గుర్తుకు రాబోయి వెనక్కి వెళ్ళింది.

అతను అలాంటివాడు కాదు.

మరెవరు?

రాధికకు తండ్రి ఎవరు?

క్షణంలో సగంసేపే ఈ ఆలోచనలు!

మాధురి అంతలోనే వాస్తవంలోకి వచ్చింది. జరుగబోతున్న ప్రమాదాన్ని గుర్తించింది.

"కానీ అరవింద్! నా కూతురు నీ కూతురు కాదా అరవింద్... నువ్వు నా భర్తవి కదా?"

"అనఫిషియల్‌గా! అయితే మాత్రం నీ కూతురు నా కూతురు ఎలా అవుతుంది? అలాంటి సెంటిమెంట్లేమీ నాకు లేవు. కాగా అన్నలు చెల్లెళ్ళను పెళ్ళి చేసుకొనే ఆచారం కొన్ని జాతుల్లో వుంది. అలాగే కూతుళ్ళను కామించిన తండ్రులూ లేక పోలేదు. వావివరసల పట్టింపులు నాకు లేవు. ఇక బోగందానివి నీకేమిట్టా?"

"అరవింద్...!"

మాధురి కళ్ళు చింతనిప్పులయ్యాయి. బిగ్గరగా అరుస్తూ చేతికందిన గాజు పెంకును అతని మీదికి విసిరింది.

గాజుపెంకు అతనికి తగల్లేదు. వెళ్ళి ట్యూబ్‌లైటుకు తగిలింది.

గదంతా చీకటి!

రాధిక అరుస్తోంది.

మాధురి అరుస్తోంది.

ఆడపులిలా మాధురి వంట గదిలోకి పరుగెత్తింది. పెద్ద ఇనుప రాడ్ కన్పించింది. దాన్ని తీసుకొని పరుగెత్తింది.

తలుపు తాళం దగ్గర ఒకే ఒక్కదెబ్బ వేసింది.

తలుపు తెరుచుకొంది.

బయటి వెలుగు లోపలకి ప్రవేశించింది.

ఆ మసక వెలుగులో...

ఆమె అరవింద్ రాధిక పట్ల చేస్తున్న

అత్యాచారాన్ని చూసింది.

ఆమె మెదడు మొద్దుబారిపోలేదు. ఆలోచించి ఓ నిర్ణయాన్ని క్షణంలో తీసుకొంది. చేతిలో చువ్వను శూలంలా పైకెత్తింది.

అంతే! 'ఆంటీ' అన్న కేకతో ఆ గది గోడలు దద్దరిల్లిపోయాయి.

సరిగ్గా అదే సమయంలో అక్కడి కొచ్చిన ప్రతాప్, షాపులో హిప్పీ యువకుడు ఆ దృశ్యాన్ని చూసి...

మంచు బొమ్మలయ్యారు!

* * *

'ప్రఖ్యాత సినీ దర్శకనిర్మాత అరవింద్ హత్య!'

'సుప్రసిద్ధ సినీతార మాధురీదేవి హంతకురాలా?'

'సంచలన చిత్రదర్శకుడి దుర్మరణంతో చిత్రసీమలో సంచలనం-సంక్షోభం'

'చిత్రసీమలో ప్రముఖుల నోళ్ళకు సీళ్లు! చిత్రసీమనే 'స్టిల్' చేసిన హత్యోదంతం.'

వార్తాపత్రికలు... సినిమా పత్రికలు పోటీపడి హత్యను గురించి రకరకాల హెడ్డింగులతో 'స్టోరీస్' ప్రచురించాయి. ప్రత్యేక ప్రతినిధులు ఇన్‌వెస్టిగేట్ చేస్తూనే వున్నారు. రోజుకో కొత్త స్టోరీ.

పత్రికల్లో వార్తలు చూసి సూర్యకాంతం ఓ రోజు దిగింది.

"ఇదేమిటి తల్లీ?"

"జీవితం అమ్మా. ఆడదాని జీవితం"

"అసలేం జరిగింది?"

మౌనమే సమాధానం.

"పోనీ ముందు ముందు ఏం చేద్దామనుకొంటున్నావ్? ఈ 'ఊబి' నుంచి బయటపడే ప్రయత్నాలేమన్నా చేస్తున్నావా? పోనీ నీ తమ్ముడికి ఓ ఉత్తరం రాయరాదూ? ఎలాగైనా మగపిల్లవాడు, సాయంగా వుంటాడుగా?"

"వద్దమ్మా! నా బతుకు ఇలా వంటరి పోరాటంతో సాగనియ్యి. తమ్ముడినెందుకు ఈ రొంపిలోకి దించటం? నువ్వేమనుకోనంటే ఓ మాట చెప్తాను. నువ్వు కూడా వెళ్ళిపో!"

సూర్యకాంతం మొహం మాడ్చుకొంది.

"అదేమిటే! ఆపదలో వున్నావు కదా, తోడుగా వుందామని వస్తే వెళ్ళమంటావు"

ప్రసంహణమయిపోతూ అసల్లు విషయాన్ని సూచించింది సూర్యకాంతం.

"బోలెడంత డబ్బు సంపాదించావు కదా! అదంతా ఏం చేద్దామనుకొంటున్నావు? అహ-నీ ధనానికి ఆశపడి అడుగుతున్నాననుకోకు. ముందు చూపు మంచిది గదాని..."

"అన్నీ సమయం వచ్చినపుడు తెలుస్తాయిగదమ్మా!"

సూర్యకాంతం రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

కోర్టులో కేసు విచారణ కొస్తోంది.

"మన తరఫున వాదించటానికి లాయర్..."

మెల్లగా నవ్వి అవసరం లేదన్నట్లు తల అడ్డంగా వూపింది మాధురి.

కేసు విషయంలో ఆమె మనసులో ఆలోచన ఏమిటో రాధికకు, ప్రతాప్‌కు కూడా చెప్పలేదు.

ఈలోగా హిప్పీ యువకుడిని పట్టుకొని ఓ పత్రికవాళ్లు అతను చూసిన 'స్టోరీ'ని కొనేసుకున్నారు. అలా ఆ స్టోరీ పత్రికల

కెక్కింది. పోలీసులు అతడిని పట్టుకుని స్టేట్ మెంట్ రికార్డు చేసుకొన్నారు.

"రాధీ. మీ అమ్మనోసారి పిల్చుకు వస్తావా?"

పార్వతమ్మ, ప్రతాప్, రాధిక కల్సి వచ్చారారోజు

"రాధీ! నాదో చిన్న కోరిక. తీరుస్తావా?"

"చెప్పు ఆంటీ.."

"ప్రతాప్! నువ్వు?"

"చెప్పండి"

"నా కేసు విషయం మీరిద్దరూ పట్టించుకోకండి. అసలిందులో మీ ప్రసక్తి రావడం నాకిష్టం లేదు. ఈ కేసు ఆరంభమయేలోగా మీరిద్దరూ పెళ్ళి చేసుకోండి. అది నా కోరిక"

రాధిక, ప్రతాప్‌ల వివాహం ఆ తర్వాత పదిహేను రోజుల్లో జరిగిపోయింది. బంధువులకే ఆహ్వానాలు పరిమితం.

* * *

ఆ రోజు కేసు విచారణకు వచ్చింది.

కోర్టు లోపల, బయటకూడా ప్రేక్షకులతో కిటకిటలాడిపోతోంది.

ముద్దాయి మాధురీలతాదేవి బోనులో నిలబడింది.

ప్రాసిక్యూషన్‌వారు కేసును విచారించారు.

మాధురీదేవి అరవింద్‌ను హత్య చేసిందని ప్రాసిక్యూషన్ కథనం.

ముద్దాయి తరఫున డిఫెన్సు లాయరు ఏం వాదించబోతాడో అని అంతా ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

జడ్జీగారు మాధురినే చూస్తున్నారు. ఆమె బోను ఎక్కిన దగ్గరనుంచి తల వంచుకొనే ఉంది.

"మీ తరఫున వాదించటానికి లాయరును పెట్టుకొంటారా?"

"అవసరం లేదు"

"మీరే స్వయంగా వాదించుకొంటారా?"

"వాదించుకోను"

"కోర్టువారే మీ తరఫున వాదించటానికి ప్లీడరును నియమించే ఏర్పాటు చేస్తాము. మీకు అభ్యంతరం లేదుగా?"

"నా తరఫున వాదించే అవసరంలేదు. జరిగింది ఈ కోర్టువారికి, ఈ సమాజమనే విస్తృతమైన కోర్టుకు క్లుప్తంగా చెప్పుకునే అవకాశాన్ని నాకివ్వండి చాలు"

"ఆ అవకాశం మీకు ఎలాగూ ఇస్తాం! కానీ మీరు చెప్పబోయే ముందు మీ తరఫున ఒక ప్లీడరును నియమించటం మంచిదికదా? ఇది కోర్టు. ఒకసారి మీరు చెప్పిన మాటను వెనక్కి తీసుకోలేరు లతాదేవిగారూ..."

మాధురి ఉలిక్కిపడింది! ఆ పిలుపు..



ఆ గొంతు...?

ఛటుక్కున తలయెత్తి జడ్జీగారివైపు చూసింది.

జడ్జీగారు తలవంచుకొని సీరియస్‌గా కాగితాలు చూస్తూ...

"నిందితురాలు తనవైపు వాదించటానికి లాయర్‌ని నియమించుకొనే విషయం ఆలోచించుకొనేందుకు ఒకరోజుగడువిస్తూ కేసును రేపటికి వాయిదా వేయట మైనది"

జడ్జీగారు కోర్టును అడ్జర్న్ చేసి ఛాంబర్‌లోకి వెళ్ళారు.

* * *

ప్రేక్షకులు గుసగుసలాడుతూ చర్చించుకొంటూ లేచారు!

మర్నాడు...

మొదటిరోజు వాతావరణమే...

"ప్లీడరు నియామకం విషయంలో మీరేం ఆలోచించుకొన్నారు?" జడ్జీగారు కాగితాలను చూస్తూనే ముద్దాయిని ప్రశ్నిం చారు.

"ఏం ఆలోచించమంటారు?"

"ఒక నిరపరాధి శిక్షింపబడేకన్నా నలుగురు అపరాధులు ప్రాణాలతో తప్పించుకోటంమేలు–అని న్యాయస్థానాలు విశ్వసిస్తాయి. అంచేత మీరు వద్దంటున్నా ఆలోచించుకోటానికి వ్యవధి ఇచ్చాను. నేరంచేయటానికి కాని, చేయకపోవటానికి కాని అనేక కారణాలుండవచ్చు. న్యాయశాస్త్రంలో సుశిక్షితులయిన వాళ్ళకే నేరస్వరూపం అర్థమవుతుంది. దానిని బట్టి వారి వారి వాదన వుంటుంది. కోర్టు నడిగితే మీరు న్యాయవాది సహాయం తీసుకోటం అవసరం అని సలహా ఇస్తుంది"

"కోర్టువారి ఔదార్యానికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. కానీ నా దృష్ట్యా ఇందులో వాదించటానికి ఏమీలేదు. వాద ప్రతివాదనల పేరిట,అప్పీళ్ళ పేరిట వృధా కాలయాపనలు చేయటం నాకు ఇష్టం లేదు. ఇప్పటికే పత్రికల పుణ్యమా అని ప్రజలలో అనవసరపు వుత్సుకత పెరి గింది. నేను సినిమా నటిని కావటంవల్ల నా వ్యక్తిగత జీవితంపై అనేక కథలు ప్రచారంలోకి వచ్చాయి. ఇంకా ప్రజల్లో ఇలాంటి నీచవుత్సుకతను పెంచి పత్రికలు బిజినెస్ పెంచుకొనే దానికి దోహదం చేయటం నాకు ఇష్టంలేదు. నాబోటి అభాగ్యుల ప్రైవేటు జీవితాలు తెల్సుకోవా లన్న అభిరుచిని పెంచటం సమాజానికి ఆరోగ్యమా? నాలాంటివాళ్ల జీవితాలు సమాజానికి ఎన్నడూ ఆదర్శప్రాయం కాబోవు. అంచేత మా జీవిత చరిత్రలు మాతో కాలిపోవటమే మేలు కదా? దయచేసి సత్యాన్ని కోర్టుకు చెప్పుకొనేం దుకు అదీ చాలా క్లుప్తంగా – నాకు అనుమతి ఇవ్వవల్సిందిగా ప్రార్థిస్తున్నాను"

"పర్మిషన్...గ్రాంటెడ్" జడ్జిగారి మాటలు నూతిలోనుంచి వచ్చినట్లు విన్పిం చాయి.

ప్రమాణంచేయటం అయింది.

జనం మాధురీదేవి చెప్పబోయే మాటల్ని వినటానికి ఉత్సుకతతో ఎదురు చూస్తున్నారు.

"నేను ఈ దేశంలోని చాలా మంది సగటు ఆడవాళ్ళలో ఒకదాన్ని. చిన్న తనంనుంచి నేను కోరుకొన్నది ఒక్కటే, అసహ్యించుకొన్నది ఒక్క విషయాన్నే! అది నేను పుట్టిన కులవృత్తిని. నేను పుట్టింది కళావంతుల కుటుంబంలో. నేను

కోరుకొన్నది పెళ్ళిని, కుటుంబజీవితాన్ని.

ఒక యువకుడు నా వయసును, అందాన్ని కొనుక్కోటం తన హక్కు అన్నట్లు ప్రవర్తించాడు.

మరో యువకుడు...!"

ఆమె ఆగింది. తల మెల్లగా ఎత్తి జడ్జీగారివైపు చూసింది. ప్లీడర్లవైపు, ప్రేక్షకుల వైపు చూసింది.

"ఆ యువకుడు నన్ను ప్రేమించానన్నాడు. అతని అమాయకత్వం, మంచితనం నన్ను పరవశింపచేసేయి. అతడిని నేను భర్తగా వరించాను. మానసికంగా నేను అతనికి భార్యనయ్యాను. కానీ అతను..."

ఆమె ఆగింది.

"పాపం. అతనూ మనిషే! నాఎదుట ఉన్నంతసేపు అతను ప్రేమమైకంలో వాస్తవాన్ని మర్చిపోయాడు. కానీ వాటిని తనవారు గుర్తుకు తెచ్చినప్పుడు అతను పిరికివాడయి పాపం పారిపోయాడు. అతని పిరికితనాన్ని నిందించనా.. మంచితనాన్ని పొగడనా?

అతను పారిపోవటంతో ముందు అతడిని అన్వేషిస్తూ, తరువాత వివాహ జీవితాన్ని అన్వేషిస్తూ వెళ్ళి అనేక వింత అనుభవాలను పొందేను. మెరిసేదంతా బంగారం కాదని అనుభవ పూర్వకంగా తెల్సుకొన్నాను.

విధి చివరికి నన్ను అరవింద్ దగ్గరికి నెట్టింది.

అరవింద్ నన్ను పెళ్లిచేసుకొన్నాడు.

మా పెళ్ళికి మేళతాళాలు, తలంబ్రాలు, తాళిబొట్టుకాని, రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకాలు కాని, పూలదండలు మార్చుకోటంకాని లేవు. కాఫీకప్పుల మార్పిడితో మా పెళ్లి జరిగింది. అందుకు సాక్షి ఒక్కవ్యక్తే!

అరవింద్‌ను నేను ప్రేమించలేదు. కానీ అతను నాభర్త అనుకొన్నాను కనుక ప్రేమించాను... గౌరవించాను. అతను నన్ను బహిరంగంగా పెళ్ళి చేసుకొంటానంటూనే వున్నాడు చివరివరకూ.

నా భర్త తన సినిమా భవిష్యత్తుకోసం నా శీలాన్ని తాకట్టు పెట్టమని కోరేడు. పెట్టేను. పురాణపతివ్రతల జాబితాలో చేరిపోదామన్న ఆశతో కాదు. నేను ఆడదాన్నిగనుక...అప్పటికే నా శీలాన్ని నాకు తెలీకుండా ఏ మహాపురుషుడో హరించేసేడు గనుక!

నా శీలం పునాది మీద మా సినిమా జీవితాలు క్రమంగా పాలరాళ్ళతో నిర్మాణమయ్యాయి.

ఏకాంతంలో-అదీ అతనికి కోరిక కలిగినప్పుడు... అతను భర్త, నేను భార్య!

బహిరంగంగా నేను సినీతారను. అతను దర్శక నిర్మాత!

మా ఇద్దరి జీవితాలు ఈ ద్వంద నీతితోనే గడిచేయి. బిజినెస్ పెంపుదలే అతని ధ్యేయం!

అతను నన్ను పెళ్లి చేసుకోడని నాకు తెల్సు. కానీ ఆ విషయం చెప్పడు అది అతని బిజినెస్సు లౌక్యం.

నేను అన్నీ తెలిసి అతడిని పెళ్లి చేసుకోమని అడిగేదాన్ని.అది ఆడదానిగా నా ఆశ!

ఆ ఆశ తీరాలంటే అతను పెట్టిన చివరి కండిషన్ ఏమిటో తెల్సా?

నేను నా నిజ జీవిత కథలో ముఖ్య పాత్రధారిణిగా నటించాలి. తెరమీదకెక్కి 'ఇది నా కథ' అని అందరికీ తెలియచెప్పకోవాలి.

ఏముంది నా కథలో— సమాజానికి ఉపయోగపడే విశేషం? ఏం నీతిని బోధించాలి యువతరానికి?

నేను అంగీకరించలేదు.

అతని ప్రయత్నాలు అతను చేసుకొన్నాడు.

ఆ ప్రయత్నాలన్నీ వ్యతిరేకించాను.

ఎలాగైనా నా జీవితంతో బిజినెస్సు చేయాలని అతని పట్టుదల! పడిపోయిన తన స్థానాన్ని నిలబెట్టుకోవాలని అతని తపన.

బిజినెస్...బిజినెస్ . బిజినెస్...!

ఈ దృష్టి అధర్మం, అన్యాయం, క్రూరం—

ఆ అధర్మాన్ని నివారించే ప్రయత్నంలో విఫలమయ్యాను.

మరేం చేయాలి?

ఆలోచింఛాను.

ఆవేశానికి లోనుకాకుండా ఆలోచించాను. ధర్మాధర్మ విచక్షణ చేసేను.

సామాజికంగా ఎట్టి పరిస్థితుల్లోనూ న్యాయాన్ని చేతిలోకి తీసుకోకూడదని నాకు తెల్సు. అలా తీసుకొనేవారికోసం సమాజం ఏర్పరచిన దండన ఏమిటో కూడా తెల్సు.

కానీ...

న్యాయాన్ని చట్టబద్ధంగా సాధించుకొనే అవకాశం లేదు.

మరి మానవ నిర్మిత న్యాయం ముఖ్యమా?

లేక...

ధర్మ సంరక్షణ ముఖ్యమా?

ధర్మ సంరక్షణే ముఖ్యమని నేను మనఃపూర్తిగా విశ్వసించాను.

అధర్మాన్ని, అన్యాయాన్ని, అమానుషాన్ని, వ్యాపార దృక్పథాన్ని, అవినీతిని, హింసామార్గాన్ని అన్నింటినీ కలిపి ఒక్క వేటు వేసేను.

చనిపోతూ పాపం నన్ను నిజంగా పెళ్ళి చేసుకొంటానన్నాడు. తాళి తెమ్మన్నాడు. కాని నేను కోరుకుంది తాళికాదు పెళ్ళి...తాళి వేశ్యలూ కట్టుకొంటారు.

వ్యవహారిక న్యాయంలో నాకు విధించబోయే దండనేమిటో నాకు అప్పుడూ ఇప్పుడూ కూడా తెల్సు!

ఉరి...

ఉరి తియ్యండి నన్ను. నేను విచారించను.

కానీ ఎప్పటికైనా చాతనయితే ఈ కిందివాటిని కూడా ఉరి తియ్యవల్సిందిగా నా ఆఖరు కోరిక—

కులాలను ఉరి తియ్యండి.

యువకుల్లో పిరికితనాన్ని ఉరితీయండి.

ధనాధిక్యతను ఉరి తియ్యండి.

అహంభావాన్ని, అహంకారాన్ని, హిపోక్రసీని, ద్వంద నీతుల్ని...

మోసాన్ని...కుటిలత్వాన్ని..

ఆడదాని అబలత్వాన్ని...

ఆమెను బిజినెస్ కమోడిటీగా చూసే దృక్పథాన్ని ఉరి తియ్యండి.

కొన ప్రాణం పోయేదాకా ఉరి తియ్యండి.

వివాహం కాకుండానే బిడ్డకు తల్లి అయే స్త్రీ దుర్గతికి ఉరి వెయ్యండి.

తన బిడ్డకు తండ్రి ఎవరో చెప్పుకోలేని స్త్రీ పరిస్థితికి ఉరిశిక్ష వేయండి.

నేను అలాంటి అనేక మంది స్త్రీలలో ఒకతిని.

కనుక నాకు ఉరిశిక్ష వెయ్యండి.

కాని, వివాహం చేసుకోవాలని ఆరాటపడే స్త్రీల కనీస కోరికకు వురితాడు




బిగించకండి.

ఇది నా కోరిక!

నేను అరవింద్ అనే నా భర్త కాని భర్తను ఇనుప కడ్డీతో పొడిచి మనః పూర్తిగా చంపేను.

అందుకు ఉరి శిక్షను అనుభవించ టానికి-ఆనందంగా, నిర్విచారంగా చని పోవటానికి సిద్ధంగా వున్నాను"

మాధురి స్థిరంగా, దృఢంగా అని ఆగింది.

కోర్టు నిశ్శబ్దంగా వుంది.

అంతా జడ్జిగారి వైపు చూస్తున్నారు.

జడ్జిగారు ఓ కాగితం రాసి కోర్టు గుమ స్తాకు అందించాడు.

'మాధురీ లతాదేవిగారు చెప్పిన కథ లోని ముద్దాయిల్లో ఒకడినైన నాకు ఆమెను శిక్షించే అధికారం లేదని భావిస్తూ నేను...శ్రీహర్ష అను పేరుగల నేను ఈ వుద్యోగానికి ఇందు వెంట రాజీనామా చేస్తున్నాను' అని ఉందా కాగితంలో.

* * *

"లతా! నన్ను క్షమించు"

"క్షమాపణలకేం కానీండి-నా ప్రశ్న కొకదానికి సమాధానం చెప్పండి. ఈ ప్రశ్నకు సమాధానం తెల్సుకోకుండానే వురికంబం ఎక్కాల్సి వస్తుందేమో నను కొన్నాను. కానీ ఆ ప్రశ్నకు సమాధానం తెల్సుకొనే అవకాశాన్నిచ్చారు మీరు.నిజం చెప్పండి...చెప్తారు కదూ?"

"పెళ్ళి కాకుండానే పుట్టిన నీ బిడ్డకు తండ్రి ఎవరన్నదేగా నీ ప్రశ్న?

ఆ నిజం చెప్పాలనే ఇప్పుడొచ్చాను. నా పిరికితనాన్ని నట్టనడి కోర్టులో నువ్వు ఉరి తీసేక నాకాధైర్యం వచ్చింది.

నీకు భర్త కాకుండానే, నిన్ను తల్లిని చేసిన దుర్మార్గుడిని నేనే"

వినకూడనిదేదో విన్నట్లు ఉలిక్కి-పడింది లత.

"నువ్వు నన్ను అనుమానించి ఉండ వని నాకు తెల్సు. ఎందుకంటే నేను మంచివాడినని నీ నమ్మకం. కానీ నేను మనసులో అందరిలాంటి చెడ్డవాడినే. నువ్వు నా వద్ద చొరవ చూపించినప్పు డల్లా నిన్ను అనుభవించాలన్న కోరిక కలి గేది. కానీ భయం!

నిజానికి అవకాశం వస్తే నీకు మత్తు మందిచ్చి స్పృహ తప్పేలా చేసి నిన్ను అనుభవించాలన్న పశు ప్రవృత్తితో ఎప్పుడూ మత్తుమందు జేబులో ఉంచు కొనేవాడిని కూడా.

ఆ రాత్రి ఆ అవకాశం వచ్చింది. పాలగ్లాసులో మత్తుమందు మాత్రవేసేను.

ఎంతకూ నువ్వు నిద్రపోకపోతే భయం వేసింది. నువ్వు నా గది దగ్గరి కొచ్చావు. అయినా నేను ధైర్యం చేయ లేకపోయాను. పెళ్ళి పాలు తాగి మత్తుగా నిద్రపోయావు.

అప్పుడు నాకు ధైర్యం వచ్చింది.

నేను చేస్తున్నది తప్పని నాకు తెల్సు. కానీ మనసులో కోరికని తీర్చుకొనే అవ కాశం వచ్చిందిగదా?

క్షణకాలపు నా సౌఖ్యంకోసం నీకు అంతులేని నష్టాన్ని కలిగించి వెళ్ళేనని నాకు తెల్సు. నిన్ను పెళ్లి చేసుకోవాలను కొన్నాను నిజంగా- చిత్తశుద్ధిగా. కానీ నేను పిరికివాడిని. నా తల్లిదండ్రులు నా పిరికితనాన్ని ఉపయోగించుకోగల సమ ర్థులు. నిన్ను వదలలేక, వాళ్లను కాదన లేక ఎక్కడికో పారిపోయాను.

ఇన్నాళ్లతర్వాత నిన్ను క్షమించమని అడగను.

నిజానికి ఉరి తీయాల్సింది నిన్ను కాదు...నన్ను!ఉరిశిక్ష నాకు—అని నాకు తెల్సు!

కానీ జడ్జిగా ఆ పని చేయలేను గదా?

అందుకే నీ న్యాయస్థానం ముందు దోషిగా నిలబడ్డాను..."

లత మాట్లాడలేదు. పది నిమిషాలు మౌనంగా గడిచిపోయింది.

"మౌనంతో శిక్ష విధిస్తున్నావా?"

లత నవ్వింది. మరో అయిదు నిమిషాలు మౌనం!

"మీకెంతమంది పిల్లలు?" లత చాలా సహజంగా ప్రశ్నించింది.

"ఒక్కరు"

"ఆడపిల్లా, మగపిల్లవాడా?"

"ఆడపిల్ల"

"మీ భార్య, పిల్లను మీకు అభ్యంతరం లేకపోతే నాకు చూపించగలరా? వాళ్ళను చూద్దామని కోరిక. అంతే! అనుచితంగా ప్రవర్తించను"

"నా భార్యను చూపించగలను కానీ కూతుర్ని చూపించలేను లతా! ఎందుకంటే నా కూతుర్ని ఇంతవరకు నేను చూసుకోలేదు. చూపించమని నిన్ను అడుగుదామనే వచ్చాను నేను"

"అంటే...మీరు..."

"నువ్వు పెళ్ళి కాకుండానే తల్లివయ్యావు. నేనుకూడా పెళ్లి కాకుండానే తండ్రినయ్యాను. నువ్వు నీ కూతుర్ని రక్షించుకోటానికి హత్యచేశావు. కానీ నేను నా భార్యను రక్షించుకోలేని అసమర్థుడిని. పిరికివాడిని.

లతా! నేను పిరికివాడినే కాని—పుట్టు దుర్మార్గుడిని, మోసగాడిని కాదు.

నీలాంటి ధైర్యస్థులు జీవితంలో ఒక్కసారి కాకపోతే రెండు...మూడు...పది సార్లు మాత్రమే చస్తారు.

కానీ నాలాంటి పిరికివాడు ప్రతిక్షణం చస్తాడు.

పిరికివాడికి ప్రేమ పనికిరాదు లతా! నిష్ఫలప్రేమకు, త్యాగానికి అర్థ తాత్పర్యాలేముంటాయి చెప్పు?"

"హర్ష్!"

* * *

కొత్త జడ్జిగారు అరవింద్ హత్య కేసులో తీర్పునిచ్చే రోజు ప్రకటించారు.

తీర్పు రేపే!

"పార్వతమ్మక్కయ్యగారూ! రాధికకు తల్లి మీరు. కానీ నా పాత్ర ఏమిటో మీకు తెల్సు. రాధికకూ ఈ రహస్యం తెల్సు. అయినా నన్ను 'ఈ పని ఎందుకు చేసేవ్? నా తండ్రి ఎవరు?' అని నిలవేసి అడిగి అమర్యాదచేయలేదంటే అది మీరు నేర్పిన సంస్కార ఫలం.

రాధిక, ప్రతాప్‌ల జీవితాదర్శాలు భవిష్యత్తుకు ఆశాకిరణాలు! వారు పీడలాంటి గత కాలపు వక్ర చరిత్రలను పట్టించుకోరు. గత కాలంలోని మంచిని మాత్రమే స్వీకరిస్తారు. భవిష్యత్తులో వెలుగుల్ని అన్వేషిస్తారు.

అయినా రాధిక తండ్రి ఎవరో తెలిసాక చెప్పాల్సిన బాధ్యత నాకున్నది కదా?

భార్యాభర్తలం కాకుండానే తల్లిదండ్రులమయిన పిచ్చిమొక్కల జంట మేమే. వివాహం పట్ల వ్యామోహం చంపుకోలేక పల్లేరు బాటలపై నడిచి చివరికి హంతకురాలినైనాను నేను. పిరికివాడై నాకు ద్రోహంచేసి, అందుకు పరిహారంగా పెళ్లి చేసుకోకుండా ఇవాళ మీ బిడ్డకు తండ్రినంటూ చెప్పవచ్చిన

'ప్రేమమూర్తి, త్యాగమూర్తి' ఈ మహా పురుషుడు"

మర్నాడు కోర్టుకు వెళ్లే ముందు ప్రతాప్, రాధికలకు ఓ కవరు ఇచ్చింది-అందరిముందూ.

"ఇది నా వీలునామా"

అంతా మొహామొహాలు చూసుకొన్నారు. ప్రతాప్, రాధికలు ఇబ్బందిగా అయిష్టంగా మొహం పెట్టేరు.

"భయపడకండి. నా ఆస్తి మీకు అక్కరలేదని, దాన్ని స్వీకరించటానికి మీరు సన్నద్ధులుగాలేరని నాకు తెల్సు.

నాకు జన్మనిచ్చిన తండ్రి ఓ గొప్ప వ్యక్తి. ఆయన నా వివాహజీవితాన్ని కాంక్షించాడు. అందుకే తన ఆస్తిలో వారసత్వంగా నా బిడ్డల పేరిట కొంత రాసేడు. ఆ పవిత్రమైన ఆస్తితో సహా నా ఆస్తినంతా...

వాలా వివాహం కోసం తాపత్రయ పడే స్త్రీల వివాహాల నిమిత్తం...

వివాహం కాకుండానే తల్లులయిన స్త్రీల రక్షణ నిమిత్తం...

ఏస్త్రీ జీవితం కూడా నా జీవితంలా అపస్వరాలు ఆలాపించకుండా వుండే నిమిత్తం...

ఒక ట్రస్టును ఏర్పరచి ఆ ట్రస్టు పేరు రాసేను. ఆ ట్రస్టు ధర్మకర్తలు మీరిద్దరూ-

నాలాంటి అభాగ్యస్త్రీల జీవితాలలో లవలేశమైనా కాంతిని ప్రసారంచేసే బాధ్యతను స్వీకరించండి.

స్వీకరిస్తారు కదూ...?"

ప్రతాప్, రాధికలు కళ్లతోనే ఏదో మాట్లాడుకొన్నారు.

"స్వీకరిస్తాం. కానీ ఆంటీ...మాదో చిన్నప్రశ్న?"

రాధిక వేయబోయే ప్రశ్న ఏమిటి?

తన తండ్రి ఎవరని అందరు ఆడపిల్లలా అడుగుతుందా? లేక తన తప్పుల్ని దుయ్యబడ్తుందా?

"అడగమ్మా"

"హత్య చేసేనని అంగీకరించావు. అందుకు శిక్ష 'ఉరి' అని తెల్సు. అయినా ఇంత ధైర్యంగా ఎలావున్నావు? మృత్యువంటే భయంలేదా నీకు?"

"కోరికలు, వ్యామోహాలు భయానికి ఓ కారణమమ్మా. మరో కారణం-తప్పు చేసేనన్న దోష భావన. కోరికలు, వ్యామోహాలు నన్ను చాలాకాలం క్రితమే వదిలిపోసాగేయి. ఇప్పుడు వాటిని పూర్తిగా జయించాను.

కాగా నేను హత్యచేసినా అది దోషం అన్న భావన నాలో లేదు. ఎందుకంటే నేను హత్యచేసింది అరవింద్‌ని కాదు. ఆ రూపంలో ఉన్న రాక్షసప్రవృత్తిని అని నా భావం. ఇక నేను దేనికి భయపడాలి?"

"భయాన్ని జయించినవారు మృత్యువును కూడా జయిస్తారని అంటారు మమ్మీ! నువ్వు మృతుంజయవు అవుతావు. నువ్వో మృత్యుంజయవు కావాలని మేము భగవంతుడిని ప్రార్థిస్తున్నాము మమ్మీ!"

మాధురిని కోర్టుకి తీసుకెళ్లారు.

"మమ్మీ! అమ్మా..." ఆ రెండు పదాలే ఆమె గుండెల్లో, శరీరంలో నరనరాన తియ్యగా మోగుతున్నాయి.

జడ్జి ఏం తీర్పు చెప్పేడో ఆమెకు విన్పించలేదు.

మాతృత్వం ఫలించిన ఆ మధుర క్షణంలో ఆమె నిజంగానే మృత్యుంజయ అయింది!



# అనుభవం

"నాకీ ఉద్యోగం చాలా అవసరం సార్!" ప్రాధేయపడుతున్నాడా అభ్యర్థి.

"ఎవరికాక్కదుట! ఈ విషయంలో నేనేమీ చేయలేను. అనుభవంలేని వాళ్ళకి ఉద్యోగమిస్తే మాకు చాలా ఇబ్బందవుతుందండీ! కనీసం నాలుగేళ్ళ అనుభవం ఉండాలని పేపర్లో ప్రకటించాం కదా! ఐయామ్ సారీ! మీరిక వెళ్ళచ్చు" అరుణ్ నిర్మొహమాటంగా చెప్పాడు.

ఆరోజంతా విసుగ్గానే ఉన్నాడు అరుణ్. ఈవాళ చేసిన ఇంటర్వ్యూలన్నీ ఉత్త దండగ. ఎవ్వడికీ చదువు లేదు. చదువుంటే అనుభవంలేదు. తాడు బొంగరంలేకుండాగాలికొదిలినబుడగల్లాగ ఈ కుర్రాళ్ళంతా ఎందుకిలా రోడ్లుపట్టి తిరుగుతారో ! ఆ సమయంలో కొంచెం అనుభవం సంపాయించుకోవచ్చుగా.

అరుణ్ దవడలు గట్టిగా బిగుసుకున్నాయి. రాత్రి జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది.

'నెలకి మూడు వేల జీతం, ఫియట్ కారు, స్వంత ఇల్లు ఉన్న తన లాంటి పెళ్ళికొడుకు దొరకడమే కష్టం కదా! అలాంటిది తాను నోరు తెరిచి అడిగితే అనుభవం, ప్రేమ-పెళ్ళి అంటూ భారమైన డైలాగులు చెప్పి తిరస్కరిస్తుందా ఆ ప్రమీల. డామిట్! అసలు ప్రమీల ప్రవర్తన మంచిది కాదని చాలా మంది చెవులు కొరుక్కోడం తనకి తెలుసు. ఇవాళ్టికి నిజం తేలింది.

'నెల తిరిగేలోగా దాని అమ్మమ్మ లాంటి పిల్లని పెళ్లి చేసుకొని ప్రమీలకి చెప్పుదెబ్బ తీస్తాను. ఏమనుకుంటోందో నేనంటే! నాకేం తక్కువని? అందాని అందం...'ఇలా అనుకుంటూ అరుణ్



వివాహ ప్రకటన చేసేందుకు పత్రికా కార్యాలయంకేసి వెళ్లాడు.

* * *

అరుణ్ పెళ్ళి ప్రకటన చూసి చాలా మంది తమ తమ ఫొటోలు పంపారు. వాటిల్లో తనని మరింతగా ఆకర్షించిన





# కతలు

మూడు ఫొటోల తాలూకు వాళ్లని ఇంటర్వ్యూకు పిలిచాడు అరుణ్. వారం తర్వాత ఇంటర్వ్యూ. మొదటి యువతి వచ్చి కూర్చుంది అరుణ్ ఎదురుగా.



"మీ పేరు?" అరుణ్ ఆమెని గుచ్చి గుచ్చి చూస్తూ అడిగాడు.

"లలిత!"

"మీరు క్రైస్తవులా?" అరుణ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"కాదు, బ్రాహ్మణులం" అందామె.

"మరి ముఖంమీద బొట్టు లేదు..."

ఆమె కళ్ళలో నీళ్ళుసుళ్ళు తిరిగాయి.

"మావారు చనిపోయారు" ఆమె గొంతు బొంగురుపోయింది.

'వీడో! నేనేమన్నా సంఘ సంస్కర్త ననుకుందా – మొగుడు చచ్చిన వాళ్ళం దరికీ ఆశ్రయం ఇచ్చేందుకు. పెళ్ళికి వధువుకావాలన్నాను గానీ, విధవనుకాదే?' అనుకున్న అరుణ్ కోపాన్నంతా దిగమింగుకుని, "మీరిక బయటికెళ్ళచ్చు!" అన్నాడు.

రెండో యువతిని పిలిచాడు.

"మీ పేరు?"

"షీలా! బియ్యే చదివాను. ఉద్యోగం కూడా చేస్తున్నా" టకటకా సమాధానం చెప్పిందామె. షీలా అందంగా ఉంది. కానీ, ఆమెని ఎప్పుడో ఎక్కడో చూసినట్టు అరుణ్‌కి గుర్తు.

"మిమ్మల్ని ఇంతకుముందు ఎక్కడో చూసినట్టుంది..." అన్నాడు అరుణ్ సంశయంగా!

"అవును. ఓసారి క్లబ్‌లో జరిగిన పార్టీకి నేనూ, మావారూ వచ్చాం. అక్కడే మిమ్మల్ని చూశాను"

"ఏమిటీ! మీకింతకు ముందు పెళ్ళయిందా?" ఆశ్చర్యంతో అరుణ్ కళ్ళు రెండింతలయ్యాయి.

"ఆఫ్‌కోర్స్! కానీ, ఆయనకి నేను విడాకులిచ్చేశాను. నా మంచితనాన్ని ఆయన అలుసుగా తీసుకున్నారు......" షీలా ఇంకా ఏదో చెప్పబోయింది.

అరుణ్ తీవ్రమైన ఆవేశంతో "గెటౌట్" అని అరిచాడు.

మూడో అభ్యర్థిని వచ్చి ఒద్దికగా నిల్చుంది.

"ఫర్వాలేదు కూర్చోండి" అన్నాడు అరుణ్.

ఆమె అతి విన్రమత ఒలకబోస్తూ, చీర కొంగు వంటినిండా కప్పుకుని, కింది పెదవి పంటికింద బిగించి, అరుణ్ ప్రశ్న కోసం వేచి చూస్తోంది.

"భయం లేదు. ఈ కుర్చీలో ఫ్రీగా కూర్చోండి" మళ్ళీ అన్నాడు అరుణ్.

ఆమె నెమ్మదిగా వచ్చి కూర్చుంది.

"మీగురించి తెల్సుకోవచ్చా?" అరుణ్ ప్రశ్నించాడు—కూల్‌డ్రింక్ ఆమె ముందు పెడూ!

"నా పేరు కమల. పెద్దగా చదువు కోలేదు లెండి...మధ్యలో మాన్పించేసి, మా పెద్దవాళ్ళు నన్ను వృత్తిలోకి దించే శారు..." ఆమె నోట్లోంచి ముత్యాల్లా రాలాయి ఆ మాటలు.

"ఏమిటో ఆవృత్తి?" ఆమెని నఖ శిఖ పర్యంతం పరీక్ష చేస్తూ అడిగాడు అరుణ్. ఆమె తల వొంచుకుని, ఒక్క నిమిషం ఆగి "వ్యభిచారం!" అనిచెప్పింది.

భూకంపం వచ్చినట్లయింది అరుణ్‌కి.

"నేను పెళ్ళి చేసుకుందామని ముచ్చట పడితే నా ఖర్మ ఇలా తగలడిందేం? నువ్వు ఒళ్ళు అమ్ముకునే దానివి....... ఒక రై మొగుడు చచ్చిన విడో! మరొ కతె భర్తనొదిలేసిన పతివ్రత. నా భార్య కావాలనుకుంటున్నది మీరా? ఈడియట్స్! పోలీసుల కప్పగించేస్తాను....ఏమనుకు న్నారో? తక్షణం ఇక్కడ్నుంచి పోండి!" అరుణ్ నేల, ఆకాశం ఏకం అయ్యేలా అరిచాడు.

ఆమె మరింత ఉక్రోషంతో "మీరి చ్చిన ప్రకటన చూసి మేముకాక మరెవ రొస్తారు ?" అంటూ చేతిలోని పేపరు అరుణ్ ముందుకి విసిరింది.

తన వివాహ ప్రకటన కళ్ళ జోడు పెట్టుకుని మరీ చదివాడు అరుణ్—

"మూడు వేల జీతంతో మేనేజరు పని చేయుచున్న ఇరవైఎనిమిది సంవత్స రములు వయస్సు గల వరునకు వధువు కావలెను. కుల మతములతో నిమిత్తము లేదు. కనీసం రెండు సంవత్సరముల అనుభవం తప్పక ఉండవలెను"

తన అలవాట్లో దొర్లిన పొరపాటుకు తల తిరిగిపోయింది అరుణ్‌కు.

—సరిపల్లి వెంకట రవి కిరణ్

## స్లైట్

''లేచివచ్చిన లేమ' సినిమా మూడో వారం ఆడుతోంది జనతా టూరింగ్ టాకీస్‌లో. జయమాలిని డాన్స్ లేదు అందులో. కనీసం ఓ క్లబ్ సీను కాదుగదా ఓ రేప్ సీన్ అయినా లేదు. అందుకే కాబోలు చిత్రానికి 'ఎ' సర్టిఫికేట్ వచ్చింది. 'పేరులోనే వున్నది పెన్నిధి' అన్నట్టు, 'మామూలు మసాలా'లు లోపించిన చిత్రమయినా అందరినీ విప రీతంగా ఆకర్షించు కుంటోంది.

రెండవ ఆట అయినా జనం బాగానే వున్నారు. ఆట జోరుగా సాగుతోంది.

ఆఫీసు రూంలో కూర్చుని ఆవలిం చాడు థియేటర్ మానేజర్ గుండూరావు. తల్లిదండ్రులు తనను కన్సల్ట్ చేయ కుండా ఆ పేరు పెట్టారన్న కోపంతో కాబోలు హిప్పీ జుట్టు పెంచేసాడతను.

కునుకుపాట్లకు వుపక్రమించిన గుండూరావ్, గేట్‌కీపర్ వచ్చి "సార్!" అనడంతో వులిక్కిపడి కళ్లు తెరిచాడు.

"సార్! ఎవరో రిటైర్డ్ ఆర్మీ మేజ





రట. అతని రెండో భార్య ఎవడితోనో లేచిపోయిందట మన థియేటర్‌కే వచ్చినట్లు తెలిసిందట. వాళ్ళిద్దరినీ షూట్ చేసేస్తానంటూ గన్ వేసుకొచ్చాడు. గేటు తెరవమని గొడవ చేస్తున్నాడు" అన్నాడుగేట్‌కీపర్ కంగారుతోరొప్పుతూ.

'ఆర్మీ మేజర్', 'గన్' అన్న పదాలు చెవిలో పడటంతో, ఎక్కడికో పారిపోయింది మానేజర్ నిద్ర.

"ఇప్పుడతను ఎక్కడున్నాడు ?"



కంగారుగా లేచి నిలుచుని అడిగాడు గుండూరావ్.

"గన్‌తో గేటుకు కాపలా కాస్తున్నాడు" అన్నాడు గేట్‌కీపర్.

ఒక క్షణం యోచించాడు మానేజర్. తరువాత, "నువ్వో పని చెయ్. మానేజర్ గారితో మాట్లాడదాం రమ్మని అతన్ని మెల్లగా ఇక్కడికి తీసుకురా. చల్లబడ్డానికి ఓ కూల్‌డ్రింక్ తెప్పించి ఇయ్యి. నేను వచ్చేంతవరకు అతన్ని ఇక్కడి నుండి కదలనివ్వకు" అని చెప్పి, హడావుడిగా మేడమీదున్న ప్రొజెక్టరు రూముకి పరుగెత్తాడు.

గేట్‌కీపర్ మానేజర్ చెప్పినట్టే చేసాడు.

మానేజర్ రూంలో డబుల్ సెవెన్ సిప్ చేస్తూ కూడా బుసలు కొడుతున్నాడు మేజర్. ప్రొజెక్టర్ రూమ్‌లో ప్రవేశించిన మానేజర్ సిబ్బందితో అర్జెంటుగా చర్చలు జరిపి అప్పటికప్పుడు ఓ స్లైడ్ తయారు చేయించాడు–

'ప్రియుడితో సినిమాకొచ్చిన భామకు హెచ్చరిక! నీ భర్త గన్ వేసుకొచ్చాడు మీ కోసం. ఇప్పుడు అయిదు నిమిషాల పాటుహాల్లో లైట్సార్పి వేస్తాము. మళ్ళీ లైట్సు వెలిగేసరికి ఆ జంట దయచేసి హాలు విడిచి వెళ్ళిపోవలసిందిగా కోరుతున్నాము ... ఇట్లు–మానేజర్, జనతా టాకీస్' అని.

సినిమా మధ్యలో అపి, ఆ స్లయిడ్ వేయించాడు మానేజర్. తరువాత హాల్లో లైట్సు ఆర్పేసాడు.

అయిదు నిముషాల తరువాత మళ్ళీ లైట్సు వెలిగాయి.

కుతూహలంగా థియేటర్‌లోకి చూసిన మానేజర్ త్రుళ్ళిపడ్డాడు.

హాలు సగానికి సగం ఖాళీగావుంది !!

—తిరుమలశ్రీ

HATURA Telugu Monthly, Hyder ad 500 004, Regd No.

# ప్రియ తోడుగా ఉంటే చాలు... మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్లలో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో * అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ * పండు మిరపకాయ * వంకాయ

తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

ఎంతో రుచి... ఎంతో రుచి

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.